# CIVICS

# పౌరశాస్త్రము

## FOR MATRICULATION

[ *Approved Text-Book*
*For the Andhra and Sree Venkateswara Universities* ]



By
**Gummidithala Venkata Subba Rao**
( of the GOSHTHI Amalapuram )

Published by
**M S R MURTY & CO,**
**VISAKHAPATNAM 2**

 1962 [ *Rs* **2-50** *nP*

# తొలిపలుకు



బ్రహ్మశ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావు గారు ఆంధ్రులకు చిరపరిచితులు విద్యార్థిదశనుండియు దేశాభిమానపూరితులై ప్రజా సేవయందు కాలము గడిపినవారు వారికి పాండిత్యముతోపాటు ప్రపంచానుభవమును కలదు అట్టివారు పౌరశాస్త్ర గ్రంథమును వ్రాయుట ప్రశంసింపదగిన విషయము

దీనిని వ్రాయుటలో వారు పాశ్చాత్యులు రచించిన గ్రంథములనే గాక భారతీయులు రచించినవానినిగూడ పరిశీలించిరి గనుక వారి అభిప్రాయములు సంకుచితములుగాక విశాలదృష్టితో కూడినవిగా నున్నవి ఈ సమన్వయము వారి గ్రంథములోని విశేషములలో నొకటి మనుధర్మశాస్త్రము, కౌటిల్యుని అర్థశాస్త్రము, శుక్రనీతి మొదలగు ప్రాచీన భారతీయ గ్రంథములలోని విషయములనుగూడ వారీ గ్రంథము నందచ్చటచ్చట చేర్చియుండుట గమనింపదగిన లక్షణములలో మరి యొకటి

సాధారణముగ గ్రంథములు వ్రాయువారికి ప్రపంచవ్యవహారముల యనుభవముండదు అందుచేత వారి గ్రంథములయందు కొన్ని లోపములు కనిపించుచుండును ఈ గ్రంథములో అట్టి లోపములు లేవు గ్రామపంచాయతులు, జిల్లాబోర్డులు, మునిసిపల్ సంఘములు మొదలగువానితోడను, అట్టివానిలో పనిచేయువారితోడను, గ్రంథకర్తకు విస్తార పరిచయము కలదు దానినాధారముగ జేసికొని వారీ గ్రంథమును వ్రాసిరి ఈవిధముగ సిద్ధాంతములను వాస్తవ ప్రపంచ వ్యవహారములతో జోడించుట వారి గ్రంథములోని విశేషములలో మరియొకటి

శాస్త్రగ్రంథములను వ్రాయుటలో పారిభాషిక పదములను సమ కూర్చుట సులభసాధ్యముకాదు కాని శ్రీ వెంకటసుబ్బారావుగారు శ్రమ పడి, సరియైన సాంకేతిక పదముల నుపయోగింపగలిగిరి వారి గ్రంథములోని విశేషములలో నిదికూడ గమనింపదగి యున్నది

గ్రంథకర్తగా రీ గ్రంథమును ఆంధ్రకళాపరిషత్తు వారు మెట్రి క్యులేషన్ విద్యార్థులకు నిర్ణయించిన ప్రణాళిక ననుసరించి వ్రాసిరి విద్యార్థుల కవసరములైన విషయములన్నియు వా రీ గ్రంథమున చేర్చియుండుటచే పరీక్షలో కృతార్థులగుట కిది యెంతయో సహాయకారి కాగలదు శైలి సులభముగను, సుబోధకముగ నుండుటచే నిందులోని విషయములను విద్యార్థులు శ్రమలేక అవగాహనము చేసుకొనగలరు విద్యార్థుల యుపయోగము నుద్దేశించి వా రీ గ్రంథమును వ్రాసినను విద్యార్థులు కానివారుకూడ దీనినుండి క్రొత్త విషయము లనేకములను తెలిసికొనవచ్చును

మద్రాసు,
తేది 30, ఏప్రల్ 1950 } మామిడిపూడి వేంకటరంగయ్య

# ప్రథమ సంపుటికి ఉపోద్ఘాతము



సివిక్సు మన రాజధానిలో కొంత నవీనముగ నున్నను ఇతర ప్రాంతములందీ శాస్త్రమును చాలకాలమునుండి బాలురకు పాఠ్య గ్రంథముగ గరపుచునే యున్నారు ఆంధ్ర కళాపరిషత్తువారును యిటీవల రెండేండ్లనుండి తమ నూతన మెట్రిక్యులేషన్ విధానములో దీని నొక ఐచ్ఛిక శాస్త్రముగ నంగీకరించుట ముదావహము ఈ రెండేండ్లలో మన బాలబాలిక లెందరీ శాస్త్రమును తమ అభిమాన శాస్త్రముగ గ్రహించిరో అదొక్కటే యీ శాస్త్ర ప్రాముఖ్యమునకు తార్కాణము

ఇటీవల మనదేశమందు రాజకీయ శాస్త్రము (పొలిటిక్సు) నందెక్కువ అభిమానము, అభిరుచి కలుగుట సహజము ఎలయన బానిసదేశమందు ప్రజలను పీడించు విదేశ ప్రభుత్వమును తొలగించుట యొక్కటే మానవ ధర్మము ఎతద్ధర్మ నిర్వహణకై రాజకీయ శాస్త్రజ్ఞానము, పరనము ముఖ్యావసరము దైవకృపచే 26 1 1950 తేదీతో యీ దేశమందంతట బ్రిటిష్ రాజరికము సంపూర్ణముగ అంతరించినది బ్రిటిష్ రాజు ఇప్పుడు మన చక్రవర్తి కాడు భారత ప్రెసిడెంటే మన రిపబ్లిక్ అధ్యక్షుడు బ్రిటిష్ రాజముద్ర మన నాణెములపైన, తపాల బిళ్ళలపైన యిక చిత్రింపబడదు సాంచి స్థూపము, ఇతర దేశీయ చిహ్నములే మన కారాధనీయములు బ్రిటిష్ యూనియన్ జెండా యిక యిచ్చట యెగురదు భారత చక్ర ధ్వజమే మన జాతీయ జెండా ఈ మార్పులు జాతి చరిత్రలో సామాన్యములు కావు వీనికొరకు తప మొనర్చి తమ అర్థప్రాణముల నర్పించినవారి కెల్లరకును జోహార్లు!

పారతంత్ర్యమునుండి స్వతంత్రమున కొక జాతి మారుట ఒక యెత్తు మనకు లభించిన స్వాతంత్ర్యమును చిరస్థాయిగ నిలబెట్టుకొనుట యింకొక యెత్తు ఇప్పుడు మనదేశమందలి ప్రధాన కర్తవ్యము-మనకు నూతనముగ అబ్బిన స్వాతంత్ర్య స్థితిని, పౌరసత్వమును, రిపబ్లిక్ రాజ్యమును, చక్రధ్వజమును సర్వవిధముల సంరక్షించుకొనుటయే ఇందుకై రాజకీయ శాస్త్రముతోపాటు సివిక్సు ను మన మెల్లరము పఠించుట యవసరము యదార్థముగ మన స్వాతంత్ర్య రక్షణకై మన మిప్పుడు చేయవలసిన మొట్టమొదటి పని యీ శాస్త్రమును భారతీయులలో ఆబాలగోపాలమునకు గరపుటయే ఎలయన యీ శాస్త్ర పఠనముచె యెల్లరయొక్క విధులను హక్కులను మనము గ్రహింపగలుగుదుము అట్టి నూతన విజ్ఞానముతో మన జాతి కార్యాచరణకు గడంగినచో యీ రాజ్యము రక్షింపబడుటయేకాక, మహోచ్ఛ స్థితికిని పోగలదు దేశమందలి యిప్పటి మిడి మిడి జ్ఞానము అనర్థ దాయకమే

సివిక్సు అను పదము వివిధరీతుల ఆంధ్రీకరణ మొనర్ప బడుచున్నది కాని దీనిని పౌరశాస్త్ర మనుటయే మేలని నా యభిప్రాయము ఈ పదమునే శాస్త్రమును రచించిన పలువురు సోదర గ్రంథకర్తలును ఉపయోగించిరి

మెట్రిక్యులేషన్ పాఠ్యభాగములో సివిక్సు, భారత పాలనా అను రెండు భాగము లున్నవి ఇంటర్మీడియేట్ భాగమందీ రెండిటికిని సమాన ప్రాముఖ్యత యొసంగబడినది కావున నీ పుస్తకములో సివిక్సు తోపాటు భారత పాలన గూర్చియు సవిస్తరముగ నుల్లేఖించుచున్నాను ముఖ్యముగ ఇంటర్మీడియట్‌లో ఈ భారత పాలన చదువువారికే కాక యితర రాజకీయ విద్యార్థులకును ఈ భాగ ముపయుక్తముగ నుండునని ఆశించుచున్నాను

పారతంత్ర్యమునుండి స్వతంత్రమున కొక జాతి మారుట ఒక యెత్తు మనకు లభించిన స్వాతంత్ర్యమును చిరస్థాయిగ నిలబెట్టుకొనుట యింకొక యెత్తు ఇప్పుడు మనదేశమందలి ప్రధాన కర్తవ్యము-మనకు నూతనముగ అబ్బిన స్వాతంత్ర్య స్థితిని, పౌరసత్వమును, రిపబ్లిక్ రాజ్యమును, చక్రధ్వజమును సర్వవిధముల సంరక్షించుకొనుటయే ఇందుకై రాజకీయ శాస్త్రముతోపాటు సవిక్సు ను మన మెల్లరము పఠించుట యవసరము యదార్థముగ మన స్వాతంత్ర్య రక్షణకై మన మిప్పుడు చేయవలసిన మొట్టమొదటి పని యీ శాస్త్రమును భారతీయులలో ఆబాలగోపాలమునకు గరపుటయే ఎలయన యీ శాస్త్ర పఠనమువే యెల్లరయొక్క విధులను హక్కులను మనము గ్రహింపగలుగుదుము అట్టి నూతన విజ్ఞానముతో మన జాతి కార్యాచరణకు గడంగినచో యీ రాజ్యము రక్షింపబడుటయేకాక, మహోచ్ఛ స్థితికిని పోగలదు దేశమందలి యిప్పటి మిడి మిడి జ్ఞానము అనర్థ దాయకమే

సవిక్సు అను పదము వివిధరీతుల ఆంధ్రీకరణ మొనర్పబడుచున్నది కాని దీనిని పౌరశాస్త్ర మనుటయే మేలని నా యభిప్రాయము ఈ పదమునే శాస్త్రమును రచించిన పలువురు సోదర గ్రంథకర్తలును ఉపయోగించిరి

మెట్రిక్యులేషన్ పాఠ్యభాగములో సవిక్సు, భారత పాలనా అను రెండు భాగము లున్నవి ఇంటర్మీడియేట్ భాగమందీ రెండిటికిని సమాన ప్రాముఖ్యత యొసంగబడినది కావున నీ పుస్తకములో సవిక్సు తో పాటు భారత పాలన గూర్చియు సవిస్తరముగ నుల్లేఖించుచున్నాను ముఖ్యముగ ఇంటర్మీడియట్‌లో ఈ భారత పాలన చదువువారికే కాక యితర రాజకీయ విద్యార్థులకును ఈ భాగము పయుక్తముగ నుండునని ఆశించుచున్నాను

బడినది వ్యాకరణ దోషము లున్నచో పండితులు మన్నించెదరుగాక తేనిక ఆంగ్లపదముకాని, హాందుస్తాని పదములుకాని యున్నచోట్ల అర్ధరహితమగు తెనుగు తర్జుమాకు నేను పూనుకొనలేదు కొన్నిచోట్ల యీ తెనుగు పదముల ప్రక్కనె ఆంగ్ల పదములును కూర్చబడినవి ఈ శైలి బాలురకు సుబోధకముగ నుండునని నా ఆశయము

ఈ గ్రంథమునకు తోడ్పడినవారికి కృతజ్ఞత తెల్పుట నా విధి

ఈ గ్రంథ మందలి చాల విషయములు గత రెండేండ్లలో మా గోష్ఠి విద్యాలయపు బాలురకు యీ శాస్త్ర బోధనానుభవమువల్ల తేలిన సారాంశములు కావున ముందుగ ఆ విద్యాలయమువారికిని, అందలి విద్యార్థి గోష్ఠికిని నా కృతజ్ఞత అందు ముఖ్యముగ నా 'నోట్సు' చక్కగా గ్రంథస్థ మొనర్చి, నా కొక ప్రతిని ప్రత్యేకముగ వ్రాసి యిచ్చిన చిరంజీవి సీతా కృష్ణమూర్తికి నా శుభాశీస్సులు

ఈ గ్రంథమందలి విషయము లన్నియు స్వీయ కల్పనలు కావు ఆంగ్లమందిందుకు సంబంధించిన గ్రంథకర్తలగు దాన్లే, పలాండీ గార్లకు యీ గ్రంథ మెంతయో ఋణపడి యుండును వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు

ఈ గ్రంథమును నేను కోరినంతనే ప్రచురించి, ఈ యత్నమందు విశేషముగ నాకు తోడ్పడిన పబ్లిషర్సు M/s M S R మూర్తి అండ్ కంపెనీ వారికిని, ఎంత తీరిక లేకున్నను శ్రమయనక తొలినుడి వ్రాసిన అస్మద్గురువర్యులును సుప్రసిద్ధ భారత చరిత్రకారులు నగు శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య M A గార్లకును నా కృతజ్ఞతా పూర్వక వందనములు

గోష్ఠి విద్యాలయము
విజయవాడ, 16–4–1950

గుమ్మడిదల వెంకటసుబ్బారావు,
ప్రిన్సిపాల్

# ఎనిమిదవ సంపుటికి పీఠిక

ఈ పుస్తకము గత యెనిమిదేండ్లనుండియు ఆంధ్రా యూని వర్సిటీలో మెట్రిక్యులేషన్ విద్యార్థులకు పాఠ్య గ్రంథముగ నుండి అధ్యాపకులయొక్కయు, బాలబాలికలయొక్కయు మన్ననల వడసినది ఇటీవల శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ (తిరుపతి) వారును యీ పుస్తకమును తమ మెట్రిక్ విద్యార్థులకు పాఠ్యగ్రంథముగ నామో దించిరి ఇందులకై యీ ఉభయ యూనివర్సిటీ అధికారులకును కృతజ్ఞత దెల్పుట నా విధి

ఈ పుస్తకముయొక్క యేడవ ప్రచురణ సమయముననే (1956 ఆగస్టు) మనదేశ రాజ్యాంగములో పెక్కుమార్పులు సంక ల్పింపబడి పార్లమెంటు సభలలో తర్జన భర్జనలు జరుగుచుండెను 1955 సెప్టెంబరులో రాష్ట్ర పునర్నిర్మాణ సంఘ (States' Reorga nisation Commission) నివేదిక ప్రచురింపబడుటయు అప్పటి నుండియు వివిధ ప్రభుత్వములు శాసనసభలు యిందుగూర్చి తమ తమ యభిప్రాయములను వెలిబుచ్చుటయు 1956 జూన్‌లో యిందుకు సంబంధించిన చిత్తుచట్టము లోక్‌సభలో ప్రవేశపెట్టబడుటయు, తదు పరి పార్లమెంటు నందలి ఉభయ సభలలో బిల్లుపై చర్చలు, వోటింగు, గత అక్టోబరునాటికి రాష్ట్రపతి ఆమోదములో బిల్లు చట్ట (Act) మగు టయు, యిటీవల మన రాజకీయ చరిత్రలో నొక మహాఘట్టము ఈ చట్టమునసుసరించి ది 1 11-1956 నుండి దేశములో క్రొత్త రాష్ట్రము లేర్పడినవి మన ప్రాంతమందు గత 225 యేండ్లనుండి యుండిన హైదరాబాదునిజామేటు విచ్ఛిన్నమగుటయు, అందలి వివిధ ప్రాంత ములు ప్రక్కనున్న రాష్ట్రములతో జేరిపోవుటయు, ఒక్క ద్విభాషా బొంబాయితప్ప తక్కిన రాష్ట్రములన్నియు దాదాపు భాషారాష్ట్రము లగుటయు, యీ చట్టమందు ముఖ్యముగ గమనింపదగ్గవి ఈ రీతిగ నేర్పడిన నూతన రాష్ట్రములు యూనియన్ ప్రదేశములన్నియు ఈ సంపుటిలో నుదహరింపబడినవి వీనిలో ఒక్క ద్విభాషా బొంబాయి

మాత్రము యిట మహారాష్ట్రముగను అటు యిటు గుజరాత్‌గను విభజింపబడవలెనను ఆందోళన యింకను సాగుచునేయున్నది ఇటు లనె నైఋతిప్రా తమందలి నాగప్రాంతమును అస్సామ్ యుండి విడదీసి కేంద్ర (యూనియన్) పాలిత ప్రాంతముగ నేర్పరచుటయును మంతన ములు జరుగుచున్నవి ఇట్టి స్వల్ప మార్పులు గాక భారత రాజ్యాంగ ములో యీ రాష్ట్ర విభజన విషయమున తుది రూపము దాల్చెనని చెప్పవచ్చును

1956 రాష్ట్ర పునర్నిర్మాణ చట్టమునందలి మరొక విశేషము— యీ వివిధ రాష్ట్రములలో యేర్పడిన జోనల్ (Zonal) సంఘములు ఈ సంఘములను గూర్చియు యీ సంపుటి 40 వ ప్రకరణములో ముచ్చటించబడినది

గోష్ఠి అమలాపురము
15—10—19 7

గుమ్మడిదల వెంకటసుబ్బారావు
గ్రంథకర్త

# పదవ సంపుటికి పీఠిక

స్థానిక పాలనలో మన రాష్ట్రములో పంచాయితీ సమితులు జిల్లా పరిషత్తులు ఏర్పడి జిల్లా బోర్డులన్నియు రద్దయిపోయినవి కాని యూనివర్సిటీ పాఠ్యపుస్తకములలో యీ మార్పు లింకను గుర్తింపబడలేదు ఈనూతన వ్యవస్థగురించి యింకను తెలుసుకొనగోరువారు నాచే ప్రత్యేక ముగ రచింపబడిన పరిపాలనా వికేంద్రీకరణ మను వ్యాసమును జదువగలరు

ఇటీవలనె బొంబాయిరాష్ట్రము విడిపోయి, గుజరాత్ మహా రాష్ట్రము లేర్పడినవి నాగభూమికిని ప్రత్యేక పరిపాలనావ్యవస్థ ఏర్పడెను

అమలాపురము
1—4—1961

గ్రంథకర్త

# విషయసూచిక




| | | |
|---|---|---|
| | తొలిపలుకు | iii |
| | ప్రథమ సంపుటికి ఉపోద్ఘాతము | v |
| | ఎనిమిదవ సంపుటికి పీఠిక | ix |
| 1 | ఎవిక్స్ అనగా నేమి? | 1 |
| 2 | మనము పౌరశాస్త్ర మేల చదువవలెను? | 5 |
| 3 | పౌరుడు, పౌరశిక్షణ | 8 |
| 4 | పౌరహక్కులు, విధులు | 11 |
| 5 | పౌరసత్వము | 15 |
| 6 | పౌరుడు, సంఘము | 18 |
| 7 | కుటుంబము | 20 |
| 8 | మతము, సిద్ధాంతము | 24 |
| 9 | వర్ణము, కులము, వృత్తి | 29 |
| 10 | సాంఘికసేవ | 34 |
| 11 | గ్రామము – గ్రామోద్యోగులు | 39 |
| 12 | స్థానికపరిపాలన – గ్రామపంచాయతీలు | 43 |
| 13 | పట్టణ మునిసిపాలిటీలు | 49 |
| 14 | జిల్లాపాలన | 53 |
| 15 | జిల్లాబోర్డులు | 56 |
| 16 | స్థానిక పాలనకు హద్దులు | 62 |
| 17 | ఆస్తివిషయము | 66 |
| 18 | రాజ్యము, రాజ్యవిధులు | 73 |
| 19 | ప్రభుత్వము, ప్రభుత్వవిధులు | 77 |
| 20 | జాతీయ ప్రణాళిక | 80 |
| 21 | ప్రభుత్వాంగములు | 84 |

| | | |
|---|---|---|
| 22 | అధికార విభజన | 88 |
| 23 | ప్రతినిధి ప్రభుత్వము, బాధ్యతాయుత ప్రభుత్వము | 91 |
| 24 | ప్రభుత్వరూపములు | 95 |
| 25 | ప్రజాపాలన – రాజకీయపార్టీలు | 101 |
| 26 | ఎన్నికలు, వోట్లు | 105 |
| 27 | రాజ్యాంగచట్టము | 110 |
| 28 | జాతీయత | 112 |
| 29 | ఇండియా ఒక జాతి యగునా ? | 115 |
| 30 | అంతర్జాతీయత శాంతిరక్షణ | 119 |
| 31 | కామన్‌వెల్తు | 123 |
| 32 | సంయుక్తరాజ్యమండలి (U N O) | 125 |
| 33 | భారతారాజ్యాంగము | 131 |
| 34 | నాలుగు ఆదర్శములు | 134 |
| 35 | భారతీయ పౌరసత్వము, పౌరహక్కులు | 138 |
| 36 | యూనియన్ ప్రభుత్వ స్వరూపము–యూనిటరీ, ఫెడరల్ | 141 |
| 37 | యూనియన్ ప్రభుత్వము 1 పార్లమెంటు | 145 |
| 38 | ,, , 2 కార్యవర్గము | 148 |
| 39 | ,, , 3 సుప్రీంకోర్టు | 152 |
| 40 | రాష్ట్రములు యూనియన్ ప్రాంతములు జోనల్‌కౌన్సిళ్లు | 154 |
| 41 | రాష్ట్రప్రభుత్వము | 159 |
| 42 | కేంద్ర, రాష్ట్ర అధికారములు | 163 |
| 43 | న్యాయస్థానములు (Judiciary) | 165 |
| 44 | భాష, ఉద్యోగములు, సవరణ | 168 |
| 45 | రాజ్యాంగ విమర్శలు | 171 |
| | 1వ అనుబంధము – కొన్ని ప్రశ్నలు | |
| | 2వ అనుబంధము–Glossary of Some Technical Terms | |




# పౌరశాస్త్రము

## 1 సివిక్సు అనగా నేమి?

మానవ శాస్త్రములు పెక్కు గలవు ఉదాహరణ రాజకీయ శాస్త్రము, అర్థశాస్త్రము, వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, భూగోళశాస్త్రము, అందు "సివిక్సు లేక పౌర శాస్త్ర మనున దొకటి

రాజకీయ శాస్త్రము ఒక రాజ్యమునుగూర్చి చర్చించును (Politics is the Science which deals with the State) అర్థశాస్త్రము అర్థము లేక ఐశ్వర్య విషయములగూర్చి ప్రస్తావించును (Economics is the Science which deals with Wealth) వృక్షశాస్త్రములో (Botany) వృక్షజాతులగూర్చియు, జంతుశాస్త్రములో (Zoology) జంతువుల గూర్చియు చదువుదుము భూగోళ శాస్త్రము (Geography) మనము నివసించు భూమిని గురించి బోధించును

"సివిక్సు' అను పదము లాటిన్ (Latin) భాషలోని 'సివిటాస్' (Civitas) నుండి పుట్టెను "సివిటాస్" లేక "సిటీ (City) అనగా పట్టణము లేక పురమని యర్థమగుటచే, యీ శాస్త్రమునకు పౌర శాస్త్రమని పేరు వచ్చెను అనగా ఒక దేశము లేక ప్రపంచమునందలి ప్రజలలో పౌరవిషయములగూర్చి చర్చించు శాస్త్రమును పౌర శాస్త్రమందురు 'పౌర' శబ్దము "పురము అను పదమునుండి యుద్భవించెను కావున యీ "పుర" శబ్దమునుగూర్చి మనము ముందుగా తెలుసుకొనుట యవసరము

సాధారణముగ మన జనవాసములను పురమనియు, పట్టణ మనియు, ఊరనియు, నగరమనియు అందురు చిన్నయూళ్ళను వాడ, పల్లె, పాలెము, గ్రామమని పిలుతురు

ఇందు "పుర' మనగా పెద్దఊరని చెప్పవచ్చును ఉదాహరణ అమలాపురము, అనంతపురము, నాగపురము, బీజపురము బరంపురము, హాస్తినాపురము

"పట్టణ శబ్దము సాధారణముగ రేవుస్థలములకు వర్తించును ఉదాహరణ – కళింగపట్టణము, గోపాలపట్టణము, భీమునిపట్టణము,

విశాఖపట్టణము, కోమగిరిపట్టణము మచిలీపట్టణము నిజామ్‌పట్టణము, కొత్తపట్టణము, చెన్నపట్టణము బ్రహ్మపట్ణము ఆంధ్రసీమ యెక్కువగా కోస్తా ప్రాంతమగుటచే యీ పట్టణములు యిచ్చటనే యెక్కువగా కాననగును

పూర్వకాలమందు చిన్నయూళ్లుగ నుండిన స్థలములు కొన్ని నేడు మహానగరములైనవి ఉదాహరణ - మైసూరు, నెల్లూరు, గుంటూరు, చిత్తూరు మరికొన్ని కుగ్రామములుగనే యున్నవి

“నగర శబ్దమునకును నాగరికతకును సన్నిహిత సంబంధము కలదు విజయనగరము భాగ్యనగరము, శ్రీనగరము, అహమ్మద్ నగరము యీ నగరములకు ఉదాహరణలు

ప్రతికాలమందును, ప్రతిదేశమందును ప్రజాజీవితములో పట్టణవాస్తవ్యులే ప్రధానపాత్ర వహించిరి ఒక రాజ్యమునకు పల్లెటి సీమల కంటె నగరదుర్గములె యెక్కుడు ముఖ్యములని మనువుచెప్పెను గత ప్రపంచయుద్ధమందు స్టాలిన్ గ్రాడ్‌లో ఆరుమాసములు హోరాహోరి పోరాడిన రష్యాయే తుదకు విజయముగాంచెను కాని మొట్టమొదటనే తమ ప్యారిస్ నగరమును శత్రువులకు వప్పజెప్పిన ఫ్రాన్సు రాజ్యము పటాపంచలయ్యెను

కావున యీపెద్దయూళ్ళే పౌరభావమునకు ముఖ్యాధారములని చాలకాలము శాస్త్రజ్ఞులు భావించెడివారు కాని అధునికు లట్లు తలంచరు

పౌరశాస్త్రము యొక్క నగరవాసులకె సంబంధించిన దనుకొనుట పొరపాటు పట్టణవాసులతోపాటు పల్లెపట్టులలోని జనులును పౌరులె యగుదురు నేటి పట్టణములు చాలవరకు ఆదిలో కుగ్రామములుగ నుండి యుండెను అందు ముఖ్యముగ మనదేశమం దనాదిగ గ్రామజీవితమే యీ జాతి జీవగఱ్ఱయైయున్నది నేటికిని యిచ్చట నూటి తొంబది మంది ప్రజ గ్రామీణులే 1951 జనాభా ప్రకారము మన దేశమందలి జనసంఖ్య ౩౫,68,29,485 లో 29,50,04 271 వరకు (౮౨.౭%) గ్రామీణుల

కావున 'సివిక్సు' అనగా మానవుడు తాను నివసించు గ్రామము లేక పురముతో కలిగియుండు సంబంధమును తెలియ

జేయు శాస్త్రమని చెప్పవచ్చును ఇంతేగాక, ఆతడు నివసించు సమితి, తాలూకా, జిల్లా, రాష్ట్రము, దేశము, ఖండము, ప్రపంచములతో గల సంబంధమును గూడ యీ శాస్త్రము తెల్పును

పౌరశాస్త్రము పౌరునకును ఆతడు నివసించు రాజ్యమునకును గల సంబంధమును ఎక్కువగ తెలుపును అందుచే యీ రాజ్యము యొక్క స్వభావము, స్వరూపము, రాజ్యాంగము, రాజ్యవిధులు, ప్రభుత్వము ప్రభుత్వరూపములు, విధులు మున్నగువాని గూర్చి మన మీ శాస్త్రమందు చదువుదుము ప్రస్తుత రాజ్యములు యెక్కువగా ప్రజారాజ్యము లగుటచే ప్రజాపాలన గూర్చియు, ప్రజాహక్కులు, ప్రతిపౌరునకు తన దైనందిన జీవితములో హెచ్చు సంబంధముగల స్థానికపాలన గూర్చియు యీ శాస్త్రము తెలుపును

కాని రాజకీయ శాస్త్రమునకును పౌరశాస్త్రమునకును చాల భేదముండును రాజకీయశాస్త్రములో రాజకీయములే ప్రధానములు పౌరశాస్త్రమందు పౌరవిధులకు, పౌరహక్కులకు యెక్కువ ప్రాముఖ్యతయుండును ప్రతిపౌరుడును తనతోడి పౌరులయెడ యెట్లు వ్యవహరించుకొనవలెను ? తన ముఖ్యవిధు లెవ్వి ? ఆతనికి యితరు లొసంగవలసిన గౌరవ మర్యాద లెట్టివి ? తన నిత్యజీవితము నెట్లు గడుపుకొనవలెను ? వివిధ పౌర సంఘములలో యాతని స్థాన మెద్ది? విధు లెవ్వి ? హక్కు లెవ్వి ? రాజ్యాంగ విషయములలో పౌరు డెట్లు ప్రవర్తించవలెను ? అను విషయములగూర్చి పౌరశాస్త్రము ప్రస్తావించును రాజ్యశాస్త్రములో ఒక రాజ్యమును స్థాపించుట లేక సంపాదించుట యెట్లు ? ఆ రాజ్యపాలన, రక్షణ, పన్నులు, శాసనములు శిక్షలు, యుద్ధములు సంధి విషయములు మున్నగు విషయములకు హెచ్చు ప్రాముఖ్యత యొసంగబడును ఒక్కమాటలో చెప్పవలెనన్నచో రాజ్యశాస్త్రములో రాజ్యము ప్రధానము, పౌరులు రెండవవిషయము పౌరశాస్త్రములో పౌరులు ముఖ్యము, రాజ్యమునకు రెండవస్థానము

ఇటులనే సాంఘికశాస్త్రము (Sociology) కును,పౌరశాస్త్రముకును తారతమ్యముండును పౌరశాస్త్రమందు మనము అనేక సాంఘిక రూపముల గూర్చి చదువుదుము ఉదాహరణ - మతము, కులము, వర్ణము కాని యీ సాంఘిక జీవితమందు పౌరునిపాత్ర యెంత

వరకు ఉండునో అంతవరకే మనకు పౌరశాస్త్రము తెలుపును సాంఘికశాస్త్రమందు పౌరవిషయములు అప్రధానములు, సాంఘిక ధర్మములు, రూపములు, రీతులు, ఆచారములే యిచ్చట ముఖ్య విషయములు

రాజకీయముగనేకాక ప్రతిపౌరుడును తనతోడి మానవులతో ఆర్థిక, సాంఘిక, నైతిక వైజ్ఞానిక, సంబంధములను కలిగియుండును కావున యాతని కుటుంబము, ఆస్తి, మతము, వృత్తి కులము, ఆచారములగూర్చి మన మీ శాస్త్రమందు చదువుదుము ప్రపంచమంతయు ఏకమగుచున్న యీ రోజులలో ప్రపంచైక్యత, ప్రపంచపాలనల గూర్చియు మనము చదువుకొనుట అవసరమగుచున్నది

సారాంశముగ సివిక్సులో పౌరుడు, పౌరవిధులు, హక్కులు, కుటుంబము, తెగ, కులము, గోత్రము జాతి, మతము, గ్రామము, పట్టణము, తాలూకా, జిల్లా, రాష్ట్రము దేశము, ప్రపంచైక్యత, వీని పరిపాలనావిధులు, విధానములు మున్నగువానినిగూర్చి మనము చదువుదుము పల్లెటూరి పంచాయితీ మొదలు దేశీయ పార్లమెంటు, ప్రపంచ వ్యవస్థలవరకు అన్ని హంశములగూర్చియు సివిక్సు బోధించును దేశ దారిద్ర్యము, ఆరోగ్యము వ్యవసాయాభివృద్ధి, గృహపరిశ్రమలు, సహకార సూత్రములు, విద్యాలయములు, వైద్యాలయములు, గ్రంథాలయములు, న్యాయస్థానములు రాజ్యశాసనములు రాజ్యాంగ విషయములు, రాజ్యరక్షణమున్నగువాటితో సివిక్సుకు జోక్యముండును కాని వీటి అన్నిటిలో నొకమాలలోని సూత్రమునకువలె యిందలి పౌరభావమునకే మన మెక్కుడు ప్రాధాన్య మియ్యవలెను అందుచే మానవ జీవితములోని పౌరభావముగూర్చి తెల్పుశాస్త్రమును మనము పౌరశాస్త్రమని యనవచ్చును

## 2 మనము పౌరశాస్త్ర మేల చదువవలెను ?

సివిక్సు అనగా పౌరశాస్త్రమని మన మింతవరకు చదివితిమి ఈ శాస్త్ర పఠనమువల్ల యెట్టిలాభ ముండునో మన మిప్పుడు తెలుసు కొనవలసియున్నది

పౌరశాస్త్రములో పౌరవిధులు, హక్కులు నిరూపించ బడును అందుచే ప్రతిరాజ్యమందలి పౌరులును తమ విధులు, హక్కుల గూర్చి తెలుసుకొనుటచేత తమలో తామెట్లు ప్రవర్తించవలెనో గ్రహించుకొనగలుగుదురు తమ తమ పనులను సరసముగను సమ ర్థముగను ఇతరులకు హానికరముగాని, బాధాకరముగాని కాకుండు నట్లును చేసుకొనగలుగుదురు తమకు యిందువిషయమై అన్యాయము జరిగినప్పుడు తమ హక్కులను చట్టరీత్యా చెలాయించుకొన గలుగుదురు

ఉదాహరణ – మన యింటిలోని చెత్తచెదారములను ప్రక్క వాని దొడ్డిలోనికి విసరివేయుట పౌరధర్మమునకు విరుద్ధము ఈ స్వల్ప విషయమును మన పౌరులు గ్రహించెడిచో ప్రజాజీవిత మిప్పటికంటె యెన్నియో మడుంగులు సుఖవంతముగ నుండెడిది వీధులలో మల మూత్రములను విడువరాదు నదీతీరములను, కాల్వగట్లులను పవిత్రము లుగ జూడవలెను రైలుపెట్టెలయందును, స్టేషనులందును ఉమ్మివేయ కూడదు నీటికుళాయిలవద్ద వరుసగ నీళ్ళను గ్రహించవలెను రోడ్డుపై మధ్యగా నడువరాదు చీకటిపడిన ఎమ్మట దీపము లేనిదే సైకిలు త్రొక్కకూడదు బండ్లను యెడమవైపుగనే త్రోలవలెను ఆరోగ్యసూత్రములను పాటించవలెను లంచ మీయరాదు దొంగ తనము చేయకూడదు ఈ మున్నగు నిత్యజీవితమునకు సంబంధించిన సూత్రము లెన్నియో యుండును వీనిని మనము చక్కగ తెలిసికొన్ని, ఆచరించినచో నేటి ప్రపంచవైఖరియే మారిపోవుననుట నిస్సంశయము

ప్రస్తుత ప్రజారాజ్యములందు పల్లెటూరి పంచాయితీ మొదలు దేశీయ పార్లమెంటువరకు అధికారమంతయు ప్రజలవోట్లపై ఆధార పడియుండును అట్టితరి ప్రతిపౌరుడును యీ వోటు (Vote) యొక్క అర్థము, దాని విలువ, పవిత్రత, వినియోగించవలసిన విధానము,

దానిని దుర్వినియోగపరచుటవల్ల వచ్చెడి అనర్థములు, నేటి ప్రజా రాజ్యములలో ఇండియా, అమెరికా మున్నగు పెద్ద పెద్ద రాజ్యముల యెన్నికలు, స్థానిక యెన్నికలు మున్నగువానిగూర్చి మనము చక్కగ గ్రహించగలము, అట్లు గ్రహించి, ఆచరించినచో, రాజ్యచక్రము నిర్విఘ్నముగ నడచును లేనిచో రాజ్యమే కుంటుబడిపోవును

ఇటులనే ఒక మున్సిపల్ కౌన్సిలరు లేక పంచాయితీ సభ్యుడు తన సభ్యత్వవిధులను, బాధ్యతలను చక్కగ గుర్తెరిగినచో, తన నగరమునకు లేక గ్రామమునకు మంచిసేవజేసి, ప్రజల మెప్పును బడయగలుగును అటులకానిచో వారి సభ్యత్వమే నిరర్థకమగును నేటి మన పంచాయితీసభ్యులు మున్సిపల్ కౌన్సిలర్లలో తమ విధ్యుక్త ధర్మమగు తీర్మానములు, సవరణలు ప్రశ్నావళి, భిన్నాభిప్రాయము **(Minute of Dissent)**, సభలను వాయిదా వేయించుట, **(Adjournment of the House)** బడ్జెటు రహస్యములు మున్నగు సభ్యత్వవిధులను సరిగా గ్రహించిన వారెందరుందురో ! తుదకు సభలలో ఒకరు మాట్లాడునప్పుడింకొకరు మాట్లాడుట సభా మర్యాదలకు విరుద్ధమని మనలో యెందరెఱుగుదురు ?

ఒక రాజ్యమందలి శాసనసభ్యుడు, మంత్రి, లేక న్యాయాధికారి తన విధులను చక్కగ గుర్తెరిగి నిర్వహించిననాడు దేశమంతయు సక్రమముగ నడచును ఇందుకుమారుగ అజ్ఞానమువల్లకాని, అవినీతివల్లకాని వీరిలో యెవరు త్రోవదప్పినను, పట్టాలుతప్పిన రైలువలె, దేశ మరాజకముపాలై, ప్రజలు దుఃఖమును, నాశనమును పొందుదురు ఉదాహరణ – ఇప్పటి మన శాసనసభ్యులలో యెందరు నిరక్షరకుక్షులున్నారో ! చిరా, ఆవర్జాలన నేమో తెలియనివారు ఆర్థిక మంత్రులా ! వైద్యవిద్య నెరుంగనివారు ఆరోగ్యమంత్రులా ? అదృష్టవశాత్తు మన న్యాయస్థానము లింకను యీ మిడిమిడిజ్ఞానముతో నిండుటలేదు ఇట్టివారెల్లరకు యీ చిన్ని పరనము చింతామణివలె ఉపకరించుననుట నిస్సంశయము

నేడెచ్చట జూచినను మూడవ ప్రపంచ యుద్ధము గూర్చి ప్రజలు భీతావహులై యున్నారు గత యేభై యేండ్లలో రెండు మహాయుద్ధములు జరిగినవి (1914–18, 1939–45) వానివలన కోటాన

కోట్లు ప్రజలు మడసిరి  అర్బుదములఆస్తి నేలపాలో నీటిపాలో, లేక బుగ్గిపాలో అయినది  అట్టి తరి మరొక ప్రపంచయుద్ధము రాకుండ జూచుటకు మార్గములెవ్వి ? ఇందుకై లోగడ నానాజాతిసమితి చేసిన పను లెవ్వి ? అందలి లోపము లెట్టివి? ప్రస్తుత సంయుక్త రాజ్యమండలి (U N O) ఆశయము లెవ్వి? ఎధానము లెవ్వి ? ఇందలి లోపము లెట్టివి ? ఈ మున్నగు అంశములను తెలుసుకొనుటచే ప్రతి పౌరుడును దేశమునకును, ప్రపంచ శాంతికిని, లోక కళ్యాణమునకును తోడ్పడ గలిగియుండును

ఇదేవిధముగ దేశ ఐశ్వర్యము, దారిద్ర్యము ఆరోగ్యము, పరిశ్రమలు, వ్యవసాయాభివృద్ధి, విద్యావిధానము, దేశరక్షణ, మత విషయములు మున్నగువానిగూర్చి మన మీ శాస్త్రమందు చదువు కొందుము కావున వీనిద్వారా మనము ప్రపంచవిజ్ఞానమును బడసి, మనకును, ఇతరులకును హెచ్చులాభము సంపాదింపగలుగుదుము అందు ముఖ్యముగ మనదేశములో స్వాతంత్ర్యావతరణకు బిమ్మట (15-8-1947) ప్రతిబాలుడును, బలికయు, యీ పౌరశాస్త్రమును చక్కగ బరించి ఆచరించినచో మన పౌరులును, దేశమును ఉచ్ఛ స్థితికి రాగలవు ఏలయన, నేటి విద్యార్థులే భావి భారతపౌరులుకదా ! ది 15-8-47 కు పూర్వము మనకు భారతీయ పౌరసత్వమే లేకుండెడిది మన మందరము అప్పుడు బ్రిటిష్ పౌరులుగా నుండెడివారము ఆనాడే మనకు భారతీయ పౌరసత్వ మవతరించెను అప్పటినుండి మనము భారత పౌరులమైతిమి ఆ అమూల్య వస్తువును కాపాడి, అభివృద్ధిపరచు కొనుట ప్రతి భారతీయ పౌరునియొక్కయు, ముఖ్యధర్మము

# 3 పౌరుడు, పౌరశిక్షణ

పౌరుడనగా ఒక పురవాసి లేక పట్టణవాస్తవ్యుడని సామాన్య అర్థము కాని గ్రామీణులును పౌరులే యగుదురని మనము లోగడ జదివితిమి పౌరుడనగా ఆంగ్లభాషలో 'సిటిజెన్ (Citizen) అనియు, పౌరభావమును 'సివిక్ సెన్సు' (Civic Sense) అనియు అందురు పౌరసత్వమును 'సిటిజెన్‌షిప్ (Citizenship) అందురు

పౌరభావము మునుపటికిని యిప్పటికిని చాల మార్పు జెందెను ఆదిలో నొక రాజ్యమందలి ప్రధాన పురుషులుమాత్రమే పౌరులుగ యెంచబడెడివారు ఆరిస్టాటిల్ (Aristotle) అను గ్రీకు తత్త్వవేత్త పురనివాసము, రాజ్యగౌరవములు, పౌరలక్షణములని చెప్పెను సామాన్యప్రజల కీ పౌరధర్మమునకు వలయు తీరికకాని, శక్తి సామర్థ్యములుకాని ఉండవని ఆరిస్టాటిల్ అభిప్రాయము పట్టణమందలి అల్పసంఖ్యాకులగు ఉత్తమతరగతివారికి మాత్రమే ఆతడు పౌరహక్కుల నొసంగెను దరిమిలా రాజులకాలమందును యీ హక్కులు పదవులు గౌరవములు ఉన్నత తరగతులవారికే ప్రత్యేకించబడినవి పారిశ్రామిక విప్లవముతో ఈ భావము కొంతవరకుమారి, మొట్టమొదట పట్టణకార్మికుడు, క్రమేణ గ్రామకూలీలును తమ తమ పౌరహక్కులను గుర్తించిరి స్త్రీలు పురుషులతో సమానత్వము నాశించుచున్నారు పాశ్చాత్య ప్రపంచములో బానిసత్వ మంత మొందించబడెను మన దేశమం దస్పృశ్యత తొలగిపోవుచున్నది రష్యావిప్లవముతో ప్రపంచమందలి కార్మిక లోకమం దొక నూతనోత్తేజము ప్రబలెను ఇప్పుడు మన దేశమందు యీడువచ్చిన స్త్రీ పురుషులందఱకును "వోటు' అధికార మొసంగబడినది

పూర్వకాలపు పౌరభావమునకును, ఇప్పటి పౌరబావమునకును, చాల తేడా యున్నది పూర్వకాలపు పౌరుడు వినయ విధేయతలకు మూర్తి ప్రస్తుతకాలమందు ప్రతిపౌరుడును ప్రభుత్వముయెడ విధేయుడైనను, ఆ ప్రభుత్వమం దాతడు భాగస్వామియై యున్నాడు ఆతడు యెన్నికలకు నిలవవచ్చును పార్లమెంటుకు విజ్ఞప్తి చేసుకొనవచ్చును కోర్టులో తన ప్రాథమికహక్కులను స్థిరపరచుకొనవచ్చును

అత్యవసరసమయములందు శాసనోల్లంఘన, రాజ్యాధికారములకు గడంగవచ్చును ఈరీతిగ పౌరులతో స్వయంశిక్షణాలు తోడు స్వాతంత్ర్యభావము మునుపటికంటె హెచ్చినది ఇంకొక విధముగ గూడ ప్రస్తుత పౌరభావము విశాలమైనది పూర్వము పౌరసత్వ మొక్క పట్టణవాసులకే చెందెడిది ఇప్పుడు గ్రామీణులును రాజ్య పౌరులే స్త్రీలకు, బానిసలకు విమోచన మొసంగబడినది స్వార్థ రహితమగు సాంఘికసేవయే నేడు పౌరశిక్షణముగ విధించబడు చున్నది తన కుటుంబము, కులము, మతము, వృత్తి, సంఘము, రాజ్యము మున్నగువానిలో అతనికి సభ్యత్వ మబ్బుచున్నది ఆ యా సంస్థలయందు తన అర్హతనుబట్టి యాతడు హక్కులను, విధులను కలిగియుండును ఈరీతిగ పౌరసత్వము నానాటికి సువిశాలమగుచున్నది

మంచిపౌరుని లక్షణము లెట్టిండవో మన మించుక తెలిసుకొనుట యవసరము 1 పరోపకారపారీణత (Public Spirit), 2 సరియగు విద్యాగంధము, 3 రాజ్యచట్టములందు విధేయత, 4 భేదాభిప్రాయములను సహనముతో తర్కించి, చర్చించి, పరిష్కరించుటకు సంసిద్ధత, 5 సుఖజీవనము, 6 సమత్వము—అనగా రాజకీయ, సాంఘిక, ఆర్థిక, మతభేదములను పాటింపకుండుట, 7 కష్టపడి పని చేయుటకు సామర్థ్యము కుతూహలత, 8 పన్నులు చెల్లించుటకును, దేశరక్షణకును సంసిద్ధత, 9 నిష్పక్షపాతబుద్ధి, 10 ధర్మచింతన ఇట్టి సుగుణములు కలవారే మంచి పౌరులగుదురు

## పౌరశిక్షణ గరపు టెట్లు?

మానవునకు జీవితమే యొక శిక్షణాలయము కాని యితర సుగుణములవలెనే యీ పౌరసత్వమును క్రమశిక్షణవల్లను, నిరంతర సాధనవల్లను వృద్ధిపొంది శోభించును ఇందుకు వలయు శిక్షణకు కుటుంబము, పాఠశాల, ఆటస్థలము, కర్మాగారము, కచేరీలు, సాంఘిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక సంఘములు, చక్కని రంగస్థములు ఇందు విద్యాలయములు, క్రీడారంగములు పౌరునకు బాల్యమందే పౌరలక్షణము నలవ[illegible] [illegible]స్థము [illegible] సమయమునకు పాఠశాలకు పోవలెను గురువులయెడ వినయవిధేయతలు

జూపవలెను. తోటి విద్యార్థులతో సహకరించవలెను. ఒకే తరగతి యందలి వారందరకును ఆ తరగతి పాఠములు చదువుకొనుటకు సమానావకాశము లుండును. జాతి, మత, కులభేదములను పారద్రోలుటకును, సర్వమానవ సమత్వము, శాశ్వతమైత్రి, ఉన్నత జీవితాదర్శముల నేర్పుటకు విద్యాలయములు నారుమళ్ళవంటివి. ఇచ్చట ప్రతివిద్యార్థియు తన పౌరజీవితమందు వలయు స్వయంకృషి, ఆత్మవిశ్వాసము, ఆత్మనిగ్రహము, సంఘసభ్యత, లోకజ్ఞానములను నేర్చుకొనుటకు అవకాశముండును. విద్యార్థి గోష్ఠులలో వ్యాసపఠన, వక్తృత్వపోటీలలో ఆరితేరినవారే భావివ్యాసులు, వెనర్జిలగుదురు. అటులనే క్రీడారంగములును పౌరునికి వలయు ప్రధానశిక్షణ నొసంగును. ఎదిరిపక్షమువారితో మిత్రభావముతో పోరాడనేర్చిన వారు ప్రపంచయుద్ధముల నరికట్టు రహస్యముల నెరిగినవారై యుందురు. ఆటలలో గెలుపోటులయెడ సమభావము నలవడజేసికొన్నచో జీవితపరిస్థితుల తాత్కాలిక ఓటమికి క్రుంగిపోరు. ఆటలలో నాయకత్వము వర్ధిల్లును. వినయవిధేయతలు, తోడివారియెడ వాత్సల్యము, పెద్దవారిపై గౌరవమర్యాదలు మున్నగు సుగుణము లేర్పడుటకు అవకాశముండును. విద్యాలయములలో మానసికాభివృద్ధి యెట్లు కలుగునో, క్రీడారంగములలో శారీరకాభివృద్ధికిని అట్టి అవకాశము లేర్పడును. బాల్యమందు బడిలోను, ఆటలయందును, క్రమశిక్షణపొంది ఆరితేరిన విద్యార్థి తన జీవితరంగములో సంపూర్ణ పొందగుట కెట్టి సంశయము నుండదు. ఇటులనే ఇతర పౌరసంఘములును పౌరశిక్షణకు తోడ్పడును.

# 4 పౌర హక్కులు, విధులు

## (Civic Rights and Duties)

పౌరుడనగా నేమియో మనము లోగడ అధ్యాయమందు కొంతవరకు చదివితిమి కాని శాస్త్రదృష్ట్యా ఈ విషయమును మన మింకను లోతుగ బరిశీలించవలసియుండును ఉదాహరణ - పౌరునకును, ఆతడు నివసించు రాజ్యమునకునుగల సంబంధమేమి? ఆ రాజ్యములో యాతని హక్కులు, విధులు యెట్టివి? ఒకనికి పౌరసత్వ మెట్లు లభించును? ఎట్లుపోవును? అను ప్రశ్నలను మన మిప్పుడు విచారించుట యవసరము

పౌరుడనగా ఒక రాజ్యముయెడ భక్తిగలిగి తన దేశమందును, పరదేశములందును న్యాయమగు స్వాతంత్ర్యమును ఆస్తిని అనుభవించుటలో ఆరాజ్యరక్షణను పొందుచు, ఆరాజ్య ఎన్నికలలో వోటు చేయుట, అభ్యర్థిగ నిలుచుట, ఉద్యోగములు చేయుట మున్నగు హక్కులలో భాగస్వామియై, తన విద్యుక్తధర్మములను నిర్వర్తించు వాడని యర్థము

పౌరహక్కులు రెండువిధములు 1 సివిల్, 2 పొలిటికల్

సివిల్ హక్కులలో యీ దిగువ హక్కులు ముఖ్యమైనవి

1 జీవితహక్కు (Right to life) ప్రతి పౌరుడును జీవించుటకు హక్కుగలిగియుండను దీనివల్ల యితరులెవరైన తనపైబడి కొట్ట వచ్చినపుడు తనను తాను రక్షించుకొనుటకు నాతడు హింసామార్గము నవలంబింపవచ్చును అనగా ఆత్మరక్షణకై (Self defence) పౌరుడు ఆయుధములు ధరించవచ్చును కాని యే పౌరుడును ఈ హక్కును దుర్వినియోగపరచి అట్టి ఆయుధములను యితరులను హింసించుటకు గాని, అన్యాయముగ జంపుటకుగాని వినియోగించరాదు

2 ఆస్తిహక్కు (Right to Property) ప్రతి పౌరుడును తన స్వార్జితముగాని, పిత్రార్జితముగాని యగు ఆస్తిని ఇతరులవల్ల యెట్టి ఆటంకమును లేక యథేచ్ఛగ అనుభవించుటకు హక్కుగలిగి యుండును ఇందుకు ప్రభుత్వ మాతనికి తగు రక్షణ లొసంగవలెను కాని యీ ఆస్తిని యే పౌరుడును సంఘమునకు హానికరమైన పనులకు ఉపయోగింపరాదు ఇందునుండి ప్రభుత్వమున కాతడు చెల్లించ

వలసిన పన్నులను చెల్లించవలెను ఇటీవల రష్యా మున్నగు దేశములలో స్వంత ఆస్తిపై హెచ్చు ఆంక్షలను విధించినారు

3 మత స్వాతంత్ర్యము (Freedom of Faith) ప్రతి పౌరుడను తాను నమ్మిన మతమును స్వీకరించవచ్చును, ప్రచారము చేయవచ్చును కాని యీ మత ప్రవర్తనలో యితర మతస్థులకును, తోడి పౌరులకును ఎట్టి కష్టముగాని, న్యూనతగాని కలిగించరాదు ఇతరవారిపై సహనభావముతో వర్తించవలెను అన్నిమతములకు గమ్యస్థానము మోక్షమే యని గ్రహించవలెను

4 వాక్స్వాతంత్ర్యము (Freedom of Speech) ప్రతి పౌరుడను తన యభిప్రాయములను యథేచ్ఛగ చెప్పుకొనుటకు హక్కుగలిగియుండును కాని యాతనికి ఇందుకువలయు ఆలోచనాశక్తి మనోవికాసము, సభ్యత సాంఘిక సామరస్యము, అవసరములు

5 పత్రికాస్వాతంత్ర్యము (Freedom of Press) వాక్స్వాతంత్ర్యమువలెనే ప్రతి పౌరుడును పుస్తకములలోగాని, పత్రికలలోగాని తన భావములు ప్రకటించి ప్రచారముచేసుకొనవచ్చును కాని సంఘమును రూపుమాపుటకుగాని, యితరులను దూషించుటకుగాని ఈ హక్కును యెవ్వరును వినియోగింపరాదు

6 సభా స్వాతంత్ర్యము (Freedom of Association) ఆధునిక కాలములో పౌరులు తమ క్షేమాభివృద్ధులకై అనేక సంఘముల నేర్పరచుకొనుచున్నారు వీని యుద్దేశ్యము పౌరులలో అన్యోన్యసహకారము క్రమశిక్షణ గల్గు, సాంఘికబలమును సమకూర్చుకొనుట కావున ఆధునిక రాజ్యములన్నియు ప్రతిపౌరునకు ఈ సభాస్వాతంత్ర్యమును విధిగా నొసంగును కాని యీ సంఘములను యే పౌరుడును రాజద్రోహమునకుగాని, కుట్రలకుగాని దుర్మార్గములకుగాని వినియోగింపకూడదు

7 వృత్తిస్వాతంత్ర్యము (Freedom of Profession) ప్రతి పౌరుడను తన యిచ్ఛవచ్చిన వృత్తిని చేసుకొనవచ్చును కాని మద్యవిక్రయము, ఆయుధములు చేయుట, అమ్ముట, మున్నగు వృత్తుల విషయమై ప్రతి రాజ్యము కొన్ని హద్దులను పెట్టుటయో, లేక పూర్తిగ నిషేధించుటయో జరుగును

8 చట్టసమత్వము (Equality before Law) ప్రతి పౌరుడును మతము, కులము, వర్ణము, లింగము, ఆస్తి, జన్మస్థలము మున్నగు విచక్షణలతో నిమిత్తము లేకుండ, న్యాయచట్టముల ప్రకారము సరిసమానత్వ మనుభవించుటకు హక్కు గలిగియుండును

ఈ పై హక్కులుగాక ప్రతిపౌరుడును తనసంసారమును తాను యథేచ్ఛగ నడుపుకొనుటకును, ఇచ్ఛవచ్చినభాష, లిపి, చదువు నేర్చుకొనుటకును, హక్కు గలిగియుండును ఆధునిక రాజ్యములందీ హక్కులన్నియు క్రమముగ గ్రంథస్తముచేయబడి, వీనికి భంగము కలిగినప్పుడు కోర్టులద్వారా సాధించుకొనుటకు పౌరులు హక్కు గలిగి యుందురు

రాజకీయహక్కులు – పౌరుల రాజకీయ హక్కులు మూడు 1 వోటింగుహక్కు, 2 ఉద్యోగములహక్కు — అనగా అర్హతను బట్టి తనకు తగిన పదవిని పొందుటకు హక్కు, 3 విజ్ఞప్తిహక్కు (Right of petition) అనగా ప్రతిపౌరుడును తన కష్టములగూర్చి అధికారులకు విజ్ఞప్తి బంపుకొని తన యిక్కట్టులను తొలగించుకొను హక్కు

ఈ హక్కులతోపాటు ప్రతిపౌరునకు కొన్ని పౌరవిధు లుండును యథార్థముగ పౌరులు తమవిధులను చక్కగ నిర్వహించుటవల్లనే రాజ్యపాలనయు, రాజ్యరక్షణయు జరుగును పూర్వకాలమందీ విధులను రాజ్యధర్మము లనెడివారు వీరిపై ఆధారపడు ధర్మశాస్త్రము లెన్నియో కలవు కాని హక్కుశాస్త్ర మొక్కటియు మన మెరుగము ఆధునికులు విధులకంటె హక్కులకె హెచ్చు ప్రాముఖ్యత నొసంగుచున్నారు

1 దేశరక్షణ – పౌరవిధులన్నిటిలో రాజ్యరక్షణ చాల ముఖ్యమైనది ప్రతిపౌరుడును రాజ్యరక్షణ కవసరమగుచో తన ప్రాణములను గూడ సమర్పింప సంసిద్ధుడై యుండవలెను ఒక రాజ్యమును రక్షించుటకు పరదేశీయులు బాధ్యులు కాజాలరు రాజ్యరక్షణకు సంసిద్ధులుకాని పౌరులు నిజముగ పౌరులనిపించుకొనజాలరు

2 రాజ్యశాసనములయెడ విధేయత — ప్రతిపౌరుడును తన రాజ్యశాసనముల నెల్లప్పుడును శిరసావహించవలెను ఇట్లొనర్చుటచే

దేశమందు శాంతిభద్రతలు పెంపొంది, ఐశ్వర్యము వృద్ధిజెందును ప్రతి పౌరుడును సామాన్యసమయములందు శాసనోల్లంఘనకు గడంగినచో ఆరాజ్య మెక్కడుకాలము నడువజాలదు కావుననే ఇట్టి ఉద్యమములను ప్రతిప్రభుత్వము తీవ్రముగ అణచివేయుటకు యత్నించును

3 పన్నులు చెల్లించట - ప్రతి ప్రభుత్వమునకును రాజ్యనిర్వహణకై ధనమవసరము ప్రభుత్వబొక్కసమునకు ప్రజల ప్రత్యక్ష, పరోక్షపన్నులె (Direct and Indirect Taxes) ఆధారములు కావున రాజ్యము సాగవలెనన్నచో ప్రతిపౌరుడును తానీయవలసిన పన్నులను సకాలములో చెల్లించవలెను

4 వోటును న్యాయముగ వినియోగించుట - ఆధునిక ప్రభుత్వము లన్నియు ప్రజల వోట్లపై ఆధారపడియున్నవి కావున పౌరులెల్లరు తమవోట్లను న్యాయముగ, అర్హులగువారికే యొసంగవలెను వోటు పవిత్రమని భావించవలెను వోటును విక్రయించరాదు అనర్హుల కొసంగరాదు

5 కష్టించిపనిచేయుట - పౌరులు కష్టించిపనిచేసినగాని రాజ్యమభివృద్ధిగాంచనేరదు ప్రజలు సోమరులుగాని, భోగలాలసులుగాని, అయినచో రాజ్యము నశించి పోవును పౌరులకష్టమే రాజ్యముయొక్క ఐశ్వర్యము

6 న్యాయపాలనలో సహకారము - ప్రతిపౌరుడును న్యాయపాలనలో తాను చేయవలసిన సహాయము చేయవలెను దోషులను కనిపెట్టుటలో పోలీసులకుతోడ్పడుట, తా మెరింగినదానిగూర్చి సాక్ష్యమిచ్చుట, అవసరమైనప్పుడు అసెసర్లు assessors), జూరర్లు (Jurors లేక పంచాయితీదార్లుగ వ్యవహరించుట, ఈ మున్నగు న్యాయవిధులనుండి యేపౌరుడును వెనుదీయరాదు కాని కూటసాక్ష్యములు చెప్పరాదు

పౌరహక్కులు, విధులు, ఒకవిధముగ పర్యాయపదములని చెప్పవచ్చును తమ విధులను చక్కగ నిర్వర్తించని పౌరుల కెట్టి హక్కులు నుండజాలవు ఇందుకు మారుగ క్రమవిధులను బాగుగ గుర్తెరిగి నిర్వహించుకొనువారే అన్నిహక్కులకు అర్హులగుదురు అప్పుడే రాజ్యము బలిష్ఠమై, ప్రజలు సుఖముగనుందురు

# 5 పౌ ర స త్వ ము

పౌరసత్వమనగా ఒక రాజ్యమందలి పౌరులయొక్క విధులు, హక్కుల సాముదాయకమని చెప్పవచ్చును ఆ రాజ్యరక్షణ, పాలన లలో ప్రతిపౌరుడును తన విధులు, హక్కులద్వారా తోడ్పడుటయే పౌరసత్వలక్షణము

ఒక రాజ్యమందలి ప్రజలను మూడు విధములుగ విభజింప వచ్చును 1 పౌరులు (Citizens), 2 ఇతరులు (Aliens), ఆధీనులు Subjects)

ఒక రాజ్యములో శాశ్వతముగా నివసించుచు అందలి పౌర హక్కులను, విధులను అనుభవించువారు పౌరులు తాత్కాలికముగ అచ్చట నివసించుచు, వేరొక రాజ్యమందు పౌరసత్వముగలవా రితరులు ఈ రెండవ వర్గమందు పరదేశములనుండి వచ్చు విద్యార్థులు, ఏజంట్లు, యాత్రికులు, వర్తకులు నుందురు వీరు తాత్కాలికముగ నివసించు రాజ్యమం దున్నంతవరకు ఆ రాజ్యముయెడ భక్తిగలిగి యుండవలెను ఆ రాజ్యమందలి సివిల్ హక్కులను వారుపొందుదురే గాని రాజకీయహక్కులను కలిగియుండరు ఆదేశరక్షణయెడ వీరికెట్టి బాధ్యతయు నుండదు ఆదేశముయొక్క సివిల్, క్రిమినల్ చట్టములను వారు శిరసావహించుచు, అధికారులకు చెల్లించవలసిన పన్నులను విధిగా చెల్లించుచుండవలెను దేశక్షేమమునకు వీరు కంటకులగుచో వీరిని ఆ దేశమునుండి పారద్రోలుటకు రాజ్యము హక్కు కలిగియుండును ఒకవిధముగా ఈ ఏలియన్లు (పరదేశీయులు) ఒకరాజ్యమందలి అతిథులవంటివారని చెప్పవచ్చును వారికివలయు ఆస్తి, ప్రాణరక్షణను రాజ్యముచేయును కాని ఆ రాజ్యవ్యవహారములలో వారి కెట్టి ప్రమేయము నుండదు ఆరాజ్యవ్యవహారములందు జోక్యము కలుగజేసికొనుట అనవసరమగుటచే వీరికి యేరాజ్యమును రాజకీయహక్కుల నొసంగదు

పౌరులు, పరదేశీయులు, యీరెండువర్గములుగాక, ప్రతిరాజ్యమందును మరియొక తరగతివారుకూడ నుందురు వీరిని పరాధీనులు **(Subjects)** అని పిలుతురు ఉదాహరణ – మైనర్లు, దివాలాతీసిన

వారు, పిచ్చివాండ్రు, దీర్ఘశిక్షబడిన అపరాధులు పరదేశీయులవలె వీరికిని రాజ్యమందు సివిల్ హక్కులు మాత్రమే యుండును కాని రాజకీయహక్కులుండవు ఏలయన యిట్టివారు రాజకీయ బాధ్యతలను నిర్వహించుటకు అనర్హులు కాని వీరిలో మైనర్లు యీడురాగానే సంపూర్ణ పౌరులగుదురు కొంతకాలమునకు దివాలాతీసినవారును పౌరసత్వము బడయవచ్చును

ఒకనికి పౌరసత్వమెట్లు లభించును ? ఎట్లుపోవును ?

ప్రతి పౌరునకును ఒక రాజ్యమందు పుట్టుకవల్లనే పౌరసత్వము సంక్రమించును ఇండియాలో పుట్టినవారెల్లరు భారతీయపౌరులు పాకిస్థాన్ ప్రజ పాకిస్థాన్‌పౌరులు బ్రిటిష్‌ప్రజ బ్రిటిష్‌పౌరులు చైనా వాసులు చైనాపౌరులు తాము బుద్ధిపూర్వకముగ వదలుకొన్నగాని యీ పౌరసత్వమా యా దేశవాసులను వదలదు ఇట్టిపౌరసత్వమును సహజ పౌరసత్వమని పిలువవచ్చును

ఇందుకు భిన్నముగ ఒక రాజ్యవాసులింకొక రాజ్యమందు పౌరసత్వమును బడయుటకు సావకాశముండును ఇట్టి పౌరసత్వము మూడురీతులుగ సంక్రమించును 1 పెంపకము (Naturalisation) 2 వివాహము, 3 రాజ్యమందు మార్పు

ఒక దేశీయుడింకొక రాజ్యమందు పౌరసత్వము పొందవలెనన్నచో ఆతడచ్చటి అధికారులకు దరఖాస్తు చేసుకొనవలెను అప్పుడందుకై నియమితుడగు ఉద్యోగి ఆ విదేశీయునికి పౌరసత్వమునొసంగవచ్చును కాని అట్లు చేయుటకు ముందాతడు కొన్ని షరతులను విధించును ఉదాహరణ - 1 ఆ విదేశీయుడు తమ రాజ్యమందెంత కాలమునుండి నివసించుచున్నాడు? ఇందుకు సాధారణముగా అయిదేండ్లనుండి పదేండ్లు గడువు పెట్టుట ఆచారమైయున్నది 2 ఇచ్చట ఆతనికిగల భూమి, ఇళ్ళు వగైరా ఆస్తులెవ్వి ? 3 ఆతని దేశభాషా జ్ఞానము 4 ఆతడు తన స్వదేశ పౌరసత్వమును త్యజించవలెను 5 నూతన రాజ్యము యెడ ఆతడు భక్తిప్రమాణమును గైకొనవలెను ఈ అయిదును ముఖ్య షరతులు ఈ ప్రకార మొక రాజ్యమందు పౌరసత్వము బొందిన విదేశీయుని పెంపుడు పౌరుడందురు (Naturalised Citizen)

స్త్రీలు విదేశీయులను వివాహమాడెనచో తమ భర్తల పౌరసత్వమును బడయుదురు ఈ పద్ధతి ఇంకను పురుషులకు వర్తించుట లేదు

ఒక రాజ్యము పరరాజుల హస్తగత మైనప్పుడా రాజ్యవాసు లందరు జయించిన రాజ్యముయొక్క పౌరులగుదురు మన రాజ్యము బ్రిటిష్‌వారి హస్తగత మైనప్పుడు మనమందరము బ్రిటిష్ పౌరుల మైతిమి కాని 15-8-47 న ఇచ్చట స్వతంత్ర భారత రాజ్య మేర్పడిన నాటనుండియు మనము తిరిగి భారతపౌరుల మైతిమి ఇటీవల భారత యూనియన్‌లో జేరిన పుదుచ్చేరి, యానాంవాసులు వెనుక ఫ్రెంచి పౌరులై యుండి యిప్పుడు భారతీయ పౌరసత్వము ననుభవించుచున్నారు ఇటులనే గోవావాసులును యిప్పుడు భారత పౌరులు

ఈ పై మూడు మార్గములవలననేగాక 'రిజిస్ట్రేషన్ వలనగూడ పౌరసత్వము లభించుచున్నది విదేశములలో గాని కామన్వెల్తు యితర రాజ్యములలోగాని భారతీయులు పౌరులుగ రిజిష్టరుచేయించు కొనవచ్చును

ఇటులనే యొక రాజ్య పౌరుడు తన పౌరసత్వమును మూడు విధములుగ కోలుపోవును (1) బుద్ధిపూర్వకముగ వదలుకొనుటవలన, (2) స్త్రీలు పరరాజ్యపురుషుని వివాహ మాడుటవలన, (3) తమ రాజ్యమును కోలుపోవుటవలన- ఈ మూడు విధముల పౌరులు తమ పౌరసత్వమును కోలుపోవుదురు కొన్ని రాజ్యములలో రాజ ద్రోహుల పౌరసత్వమును ప్రభుత్వమే తొలగించుచున్నది

# 6 పౌరుడు, సంఘము

మానవు డొక సాంఘికజీవి (Man is a Social Animal) అనిచెప్పుదురు దీనియర్థమేమో మనమిప్పుడు గ్రహించుట అవసరము




మానవుని సాంఘిక రూపములు

మన మింతవరకు పౌరశాస్త్రమన నేమో, యీ శాస్త్ర పఠనము వలన మన కెట్టిలాభములు కలుగునో, పౌరుడు, పౌరసత్వము, పౌరహక్కులు పౌరవిధులగూర్చియు చదివియుంటిమి ఇప్పుడీ పౌరులు కొంతయుంది గుంపులుగను సంఘములుగను, యేర్పడి తమ సాంఘిక జీవనము నెట్లు సాగించుకొనుచున్నారో చదువవలసి యున్నది

ఏ మహామునియో, యోగిపుంగవుడో తప్ప, యే మానవుడును నిరంతరాల మేకాకిగ నుండజాలడు తల్లిదండ్రులు, ఆలుబిడ్డలు, ఆప్త

వర్గము, ఈరీతిగ ఆత డితరులతో కలసిమెలసి, వారిపై తన ఆదరాభి మానములను ప్రసరించుచు, వారి సహాయసహకారములను బొందుచు, తన జీవయాత్రను సాగించుకొనును కావుననే మానవుడొక సాంఘిక జీవి యందురు తుదకు మహామునులును యెంతటి విరాగులైనను యేదో ఒకవిధమగు సంసార తాపత్రయములనుండి తప్పించుకొనజాలరు కొందరకు నిత్యవిధులు, మరికొందరకు "కౌపీన సంరక్షణార్థమ్ అయం పటాటోపః" అని, నైమిత్తిక పటాటోపము శ్రీ అరవిందయోగి దేశమునుండి విరాగియై పుదుచ్చేరిచేరి తపోనిష్ఠనుండగా, ఆతని జీవితాంతమునకు 600 మంది శిష్యులు వేలాదిభక్తులు, రెండు కోట్ల రూప్యముల ఆశ్రమమును సిద్ధమైనవి! తిరువన్నామలై యందలి శ్రీరమణమహర్షులకును దాదాపు అంతియే పరిణామము కావున పౌరులకు పదిమందితో కలసి వ్యవహరించుటయే పరిపాటియని చెప్ప వచ్చును

మానవుని సాంఘిక రూపములను గ్రహించుటకు ఎదిరిపుటలో నున్న చిత్రము నొకసారి పరిశీలింపుడు జీవచక్రములో కేంద్రమున పౌరుడు నక్షత్రమండలమందలి సూర్యునివలె నున్నాడు ఆతని కిరణములనుబోలి వివిధ సాంఘికరూపము లుండును ఇందు కుటుంబము, శాఖ, తెగ, మతము, వర్ణము, కులము, గోత్రము, వైజ్ఞానిక సంఘము, బడి, ఆటస్థలము, దేవాలయము, క్లబ్బు, వృత్తి సంఘము, ఫ్యాక్టరీ, కచేరీ, గ్రామపంచాయితీ, రాష్ట్రము, రాజ్యము, ఖండము, ప్రపంచము, ఈ మున్నగు సాంఘిక వ్యవస్థలెన్నియో యుండును వీనిలో అనేక రంగములందు బ్రహ్మచర్య, గృహస్థ, సన్యాసాశ్రమముల ద్వారా ప్రతిపౌరుడును తన జీవయాత్రను సాగించుకొనుచుండును ఈ వివిధ సంఘము లాతని జీవయాత్రకు వలయు రంగస్థానములుగ నుపకరించును వీనివలన అతడు తన జీవితమందు వలయు పౌరశిక్షణను బొంది, గమ్యస్థానము జేరును ఇట్టి సాంఘికరూపములలో కొన్నిటి గూర్చి మన మిప్పుడు చదువుకొందము

# 7. కుటుంబము (FAMILY)

మానవుని సాంఘికజీవితమందు కుటుంబము మిక్కిలి పురాతనమును, సహజమును, సుఖదాయకమునై యున్నది కుటుంబము అన్ని దేశములందును, అన్ని జాతులందును గలదు పుట్టుక మొదలు జన్మాంతమువరకు–బాల్య, యౌవన, కౌమారాది అన్ని అవస్థలలోను జీవునకు కుటుంబము పుట్టినిల్లు కుటుంబమర్యాదలు, గౌరవములు, స్త్రీలయెడ వలపు, బిడ్డలపై మమకారము, అన్యులపట్ల ఈర్ష్యాసూయలు, కుటుంబ ఆస్తులపై గాఢమమకారము మున్నగు గుణములు ప్రతి కుటుంబమందును అగుపడును ఒకే కుటుంబములో కొన్ని ఆచారములు, మర్యాదలు, వ్యవహారములు, క్రమశిక్షణ, సహకారము, సేవాతత్పరత మున్నగు గుణములుండును సామాన్య పౌరభావమందిట్టి గుణము లమూల్యములు ఇట్టి సుగుణములు లేనిదే యే పౌరుడును తన పౌరధర్మమును నిర్వహించజాలడు

మానవులు కుటుంబములుగ నేర్పడుటకు శాస్త్రజ్ఞులు మూడు హేతువులను దెల్పుదురు (1) స్త్రీ పురుషులలో ఒండొరులయెడ స్వతస్సిద్ధమగు అనురాగము, (2) సంతానేచ్ఛ, (3) కొన్ని ఆర్థిక కారణములు ఉదాహరణ – స్త్రీలకు జీవనాధారమును, పురుషునకు గృహపోషణయు అవసరము ఇట్టి కారణములచే మానవులు భిన్న కుటుంబములుగ ఏర్పడుచున్నారు ఒకే కుటుంబీయులు లొకేయింట నుండుట సామాన్యానుభవము

కుటుంబములు రెండువిధములు (1) తల్లి వలన యేర్పడినవి **(Matriarchal)** (2) తండ్రివలన యేర్పడినవి **(Patriarchal)** వీనిలో మొదటిరకపు కుటుంబములు హిమాలయ ప్రాంతమందును, మలబార్, కొచిన్ లందు మాత్రమే కాననగును తక్కినచోట్ల రెండవరకపు కుటుంబములే యుండును మొదటితరగతి కుటుంబములో వారసత్వము స్త్రీలమూలముగ యేర్పడును రెండవరకపు వానిలో తండ్రికి ఆస్తిపై సర్వాధికారములుండును అతడే గృహయజ్ఞములు, పితృకర్మలను జేయును కుటుంబాస్తి యంతయు అతని అధీనమందేయుండి అతనికి పిమ్మట తన మగబిడ్డలకు జెందును

కుటుంబజీవితమందు నామకరణము, ఉపనయనము, వివాహము ముఖ్యసంస్కారములు నామకరణముతో బాలుని కొకవ్యక్తిత్వమబ్బును పాశ్చాత్య దేశములలో పౌరులపేర్లు ఎక్కువగా చెట్లు, రాయి, కర్రల ననుసరించును మన దేశమందు దాదాపు నూటికి తొంభై పేర్లు దైవనామములే ఇంత హెచ్చుగ దేవతల పేర్లుగల దేశము మఱెద్దియు నుండదు ముఖ్య నామమునకు తోడు ప్రతివానికి ఇంటి పేరు లేక ఊరుపేరు ఉండును కొందరు తండ్రి పేర్లను ధరింతురు దీనివల్ల పౌరజీవితమందు గృహము, స్థలము యెట్టి ప్రాధాన్యత వహించుచున్నవో మనము గ్రహింపగలము స్త్రీలకు వివాహముతో ఇంటి పేర్లు మారిపోవుట సామాన్య ఆచారము ఉపనయనముతో బాలునకు బ్రహ్మచర్యాశ్రమ మేర్పడును ఇది విద్యార్థిదశకు ప్రారంభము స్త్రీ, శూద్రాదులకీ విద్య అప్రధానమని చాలకాలము భావించెడివారు కాని యీభావము సరియైనది కాదని ఆధునికు లంగీకరించుచున్నారు సరస్వతియే స్త్రీ స్వరూపిణిగదా ! గృహస్థాశ్రమము జీవుని ప్రాపంచికయాత్రలో కల్పతరువు వంటిది

గత రెండువందల యేండ్లలో ఏర్పడిన పారిశ్రామిక యుగమందీ (Industrial Age) కుటుంబరీతులు చాలవరకు మారిపోయినవి పూర్వకాలమందు మనయిండ్లలో తయారగు వస్తువులు చాలభాగమిప్పుడు ఫ్యాక్టరీలలో ఉత్పన్నమగుచున్నవి పల్లెటూళ్ళలో ప్రజలు తమయిండ్లు, పొలములు విడిచి పట్టణముల కెగబ్రాకుచున్నారు స్త్రీలకు ఆర్థిక హక్కులపైనను, ఉద్యోగములపైనను వాంఛ ప్రబలుచున్నది విడాకులచట్టము మున్నగువానితో కొన్నిచోట్ల గృహచ్ఛిద్రము లేర్పడుచున్నవి పౌరులలో వ్యక్తిస్వాతంత్ర్యము ప్రబలుచున్నది

కాని యెన్నిమార్పులు తటస్థించినను కుటుంబజీవితము చెక్కుచెదురునను భయమగుపడదు ఏలయన, స్త్రీ పురుష సంబంధము సనాతనము శాశ్వతమైనది తలిదండ్రు లుభయులకును తమ సంతానము ఇలవేల్పులు అందు ముఖ్యముగ స్త్రీకి తనపిల్లలపై ప్రేమ అపారము. బాల బాలికల విద్య, పోషణ, వివాహములు, కార్యకలాపములన్నియు కుటుంబజీవితమును వృద్ధిపరచునేగాని తగ్గింపనేరవు

మన దేశమందలి హైందవులలో సాధారణముగ సమిష్టికుటుంబాచారము మెండు ఒకేయింటిలో ఆయింటియజమాని, అతని గృహిణి వారి బిడ్డలు, కోడండ్రు, మనుమలు ఉమ్మడిగ నివసించుచుందురు ఆడబిడ్డలుమాత్రము అత్తవారిండ్లకుపోయి మరొక యింటివారగుదురు వీరందరు ఒకేయింట నివసింతురు ఒకేవంట భోజనము చేయుదురు కుటుంబపెద్ద అందరిపైన పెత్తనము చేయుచు, కుటుంబాస్తిని తన పేరిటనే వ్యవహరించుచు, కుటుంబపోషణ జరుపుచు, కుటుంబమర్యాదలను కాపాడుచుండును మత సాంఘిక విధుల నితడే నిర్వహించును కుటుంబమందలి అందరి సంపాదనయు ఉమ్మడి చిరాకు వచ్చును కుటుంబసభ్యులెల్లరు తమ శక్త్యనుసారము పనిచేయుదురు అవసరమునుబట్టి యింటిపెద్ద యాజమాన్యమున కుటుంబధనమును వ్యయపరచు కొనుకొందురు ఈ రీతిగ ఆస్థి, ఆహారము, పూజావ్యవహారము లందు కుటుంబజీవితము సమష్టిగ గడుపుదురు కుటుంబసభ్యులు విడిపోయినచో వ్యష్టికుటుంబము లేర్పడును

ఉమ్మడి కుటుంబములవల్ల పెక్కు లాభములు గలవు

(1) అందు ముఖ్యముగ ప్రతి మానవునకును రాజ్యనిర్వహణ మందుగాని, వ్యవహార నిర్వహణమందుగాని అత్యవసరమగు పౌర శిక్షణ యీ సమష్టి కుటుంబములందు విశేషముగ అలవడును కుటుంబ పెద్ద పదిమంది సభ్యుల జీవితమునకు బాధ్యతవహించి నిర్వహించుట, మిగత సభ్యులాతని ఆజ్ఞలను శిరసావహించుట గొప్ప విషయము పదిమందిని నడిపింపగలిగిన గృహయజమాని పదికోట్ల ప్రజలను అవలీలగా పరిపాలించు సామర్థ్యమును సంపాదించగలుగును అటులనే ఒక కుటుంబ యజమాని చెప్పుచేతలలో మసలగలవారు ఒక కంపెనీలోగాని, రాజ్యమందుగాని, క్రమశిక్షణతోను, వినయ విధేయతలతోను నడచుకొనగలుగుదురు (2) ఉమ్మడి కుటుంబములో దుబారా ఖర్చులు లేకుండ సంసారము క్లుప్తముగ జరిగిపోవును కొద్ది ఆదాయముతో పలువుర పోషణ కిందు సావకాశ ముండును (3) పదిమంది కలసి ఒకేయింట నుండుటచే సంఘీభావము బలమును సామెత ననుసరించి కుటుంబ గౌరవము, పలుకుబడి హెచ్చును

(4) ఇందలి సభ్యులు ఒకరితో నొకరు కలసి పనిచేయుటచే వీరిలో సహకారభావము, త్యాగశీలత క్రమశిక్షణ వృద్ధియగును (5) ఉమ్మడి కుటుంబములో వృద్ధులకు, దుర్బలులకు, అబలలకు ఎక్కువ క్షేమ ముండును

ఈ విధానమందలి ముఖ్యలోపము లెవ్వియనగా - (1) ఇందలి ప్రతి సభ్యునకు తన కృషికి తగినఫలము దక్కుటకు సావకాశముండదు ఒక కుటుంబములో నలుగురు సోదరులుండి, అందొకడు హెచ్చు కష్టపడి నెలకొక నూరురూపాయలు సంపాదించి, మిగిలిన ముగ్గురును ముప్పై రూపాయల జీతగాళ్ళైనను,అనుభవములోమాత్రము అందరు సమానముగనే అనుభవింతురు (2) ఈ అసమానత్వమును మొదటివాడు గ్రహించుచో, ఆతడు తన ఆర్జనపట్ల అలక్ష్యభావము బూనవచ్చును (3) తన కెట్లైనను యింట్లో తిండి, బట్ట యితర అవసరములు లభించును కదాయని కుటుంబ సభ్యులలో సోమరితనము బలిసిపోయి, కుటుంబ బాధ్యత తగ్గిపోవును (4) కుటుంబసభ్యులలో అన్యోన్య సహనము, వ్యక్తిస్వాతంత్ర్యము సన్నగిల్లి, కుటుంబములో అశాంతి, అసంతృప్తి పెరుగును (5)స్వార్థపరులగు కుటుంబపెద్దలు నిరంకుశులై తమతోడి సభ్యులకు అన్యాయము చేయుటయు జరుగుచుండును

ఇట్టిలోపము లున్నను హిందూ సమష్టికుటుంబములు మానవ కోటియొక్క సాంఘిక నిర్మాణములో నత్యున్నతస్థానము నలంకరించినవి ఒక్కొక్క కుటుంబమునకు చెందిన కులము, గోత్రము, నామము, ఆచార సంప్రదాయములు చిరకాలమునుండి వచ్చుటయేగాక, సాంఘిక ధర్మమునకు కట్టుబడవలసిన మానవులెల్లరును యీ ఉమ్మడి కుటుంబములలోని ఉత్తమరీతులను ప్రశంసించక మానరు దేశస్వామ్యము (National Socialism), ప్రపంచస్వామ్యము (World Socialism), కావలెననెడి యీ రోజులలో ఈ కుటుంబస్వామ్యము (Family Socialism) దోషమని చెప్పుట సాహసమే యగును వ్యక్తులకు వలయు స్వేచ్ఛ, అవకాశములతోపాటు యీ ఉమ్మడి కుటుంబములను రాష్ట్ర దేశ, ఖండ స్వామ్యములలో అలవడజేయుటయే మన ప్రస్తుత కర్తవ్యము కాని యిటీవల దేశమందలి భూమి "సీలింగు" శాసనములలో అనేక ఉమ్మడి కుటుంబములు చీలిపోవుటను మనము కనుచున్నాము

# 8 మతము - సిద్ధాంతము

మానవచరిత్రలో మతము ప్రపంచమందంతటను ప్రబలమైన సాంఘికవ్యవస్థ హిందూ (బ్రాహ్మణ), బౌద్ధ, మహమ్మదీయ, క్రైస్తవ, పారశీక, శిఖ్ఖుమతములు ముఖ్యమైన మతములు చైనాలో "టావో" మతమును, కన్ఫ్యూసియస్ మతమును, జపానులో "షింటో" మతమును, యూదులకు యూదుమతమును ప్రధాన మతములు

ఈ జీవితమననేమి? ఈ సృష్టి క్రమమెట్టిది? సృష్టికర్త యెవరు? మతమననేమి? సత్యాసత్యములకును, మంచిచెడుగులకును తారతమ్యమెట్టిది? ఈ జీవమాత్రకు మూలసాధనము లెయ్యవి? జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములు, మనో బుద్ధి చిత్త అహంకారములు, జీవాత్మ పరమాత్మలు; అరిషడ్వర్గము, బ్రహ్మస్వరూపము, కర్మఫల సిద్ధాంతము, పురుషార్థములు, ఆశ్రమధర్మములు, ఉపనయన వివాహాది సంస్కారములు, మరణమనగానేమి? మరణానంతరం జీవిత మెట్లుండును? అమృతత్వ స్వరూప మెద్ది? ఈ మున్నగు ప్రశ్నలు ప్రతి దేశమునందును, ప్రతికాలమునందును, బుద్ధిమంతులగువారు యెదుర్కొనుట సామాన్యానుభవము ఇట్టి ప్రశ్నల నెదుర్కొనువారిని 'జిజ్ఞాసువు" లందురు ఈ ప్రశ్నలకు సమాధానముల నొసంగునదే మతము క్రమేణా యీ ప్రశ్నోత్తరములన్నియు గ్రంథస్థములగుట సామాన్యానుభవము

హైందవ మతగ్రంథములలో "సర్వసారోపనిషత్" అను నొక చిన్నపుస్తకమున్నది అందలి ప్రథమసూత్రమునందే ఎంబది రెండు ప్రశ్నలు వేయబడి, మిగిలిన సూత్రములలో వానికి సమాధానము లొసంగబడినవి అందలి ప్రశ్న లెట్టివనిన -

(1) కథం బన్ధ? (బంధ మెట్టిది?)

(2) కథంమోక్షః? (మోక్ష మన నెట్టిది?)

(3) కాఽవిద్యా? (అవిద్య యెట్టిది?)

(4) కా విద్యాచేతి? (విద్య యెట్టిది?)

(5) జాగ్ర త్స్వప్న సుషు ప్తి స్తురీయంచ కథమ్? (జాగ్రత్స్వప్నసుషుప్తి తురీయము లెవ్వి?)

(6) అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయానన్దమయ కోశా కథమ్ ? (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయకోశము లెవ్యవి ?

(7) కర్తా జీవః పఞ్చవర్గః క్షేత్రజ్ఞ సాక్షీ కూటస్థాఽన్తర్యామీతి చ కథమ్ ? (కర్త, జీవుడు, పంచవర్గములు, క్షేత్రజ్ఞుడు, సాక్షి, కూటస్థుడు, అంతర్యామి యెట్టివి ?)

(8) ప్రత్యగాత్మా ? (ప్రత్యగాత్మ యెవడు ?)

(9) పరమాత్మా చ కథమ్ ? (పరమాత్మ యెవడు ?)

(10) కిం బ్రహ్మ ? (బ్రహ్మ మెట్టిది ?)

(11) కతి పదార్థా ? (పరమార్థము లెన్ని విధములు ?)

(12) కా మాయా చేతి ? (మాయ యన నేమి ?)

ఈ ఉపనిషత్తుయొక్క పేరునుబట్టియే యిందు సర్వోపనిషత్తుల, మతగ్రంథముల సార మిమిడియుండునని మనము గ్రహింపగలము అట్టి ఉపనిషత్తుసంపలి ప్రశ్నలనుబట్టి యీ మతజిజ్ఞాస యెటులుండునో మనము తెలిసికొనగలము

ఇట్టి ప్రశ్నలకు వివిధ దేశములలో వివిధమతస్థులు వివిద సమాధానముల నొసంగుచుండుట సహజము ఒక్కొక్కప్పుడు వివిధ జిజ్ఞాసువు లొకే ప్రశ్నకు ఒకేసమాధానము నొసంగుటయు కలదు ఉదాహరణ "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకమ్ శరణమ్ వ్రజ" అని శ్రీకృష్ణమూర్తి గీతలలో నుడివెను బైబిల్‌లో యేసుక్రీస్తును యిట్టి భావమునే ప్రకటించెను - ప్రహ్లాదచరిత్రలో "తనయందు నిఖలభూతములందు నొకభంగి" యని వర్ణించబడినది ఈ భావమునే బైబిలులో గూడ 'నీ ప్రక్కవానిని నీవలెనే జూచుకొనుము అని శాసించిరి ఈ మున్నగు ప్రశ్నలకు యీ జిజ్ఞాసువు లొసంగు సమాధానములు క్రమముగ గ్రంథస్థమై, పద్యరూపమునను, గద్యరూపమునను, మానవ కోటికి పవిత్రరచనలుగను, ఆ యా మతస్థులవారి జీవితములో పరమ ప్రమాణములుగను వెలయుచుండును ఇట్టి గ్రంథములలో హైందవులకు వేదమును (శృతిప్రమాణమ్), మహమ్మదీయులకు ఖురాన్,

క్రైస్తవులకు బైబిల్, పారశీకులకు జెండవస్థా, శిక్కులకు గ్రంధ సాహెబ్ మున్నగునవి ముఖ్యమైనవి

ఈ మతములలో బౌద్ధ జైన, పారశీకాది మతము లన్నియు యిటీవల, అనగా గత 2500 ఏండ్లలో వెలసిన మతములు భారతీయుల సనాతనధర్మము మాత్రము యుగయుగములుగ యిచ్చట బ్రవహించి నేటికిని కొంతవరకు సజవముగ నున్నదని చెప్పవచ్చును ఈ సనాతన ధర్మమునకు వేదములు (శృతులు), ధర్మశాస్త్రములు (స్మృతులు) పురాణేతిహాసములు ఉపనిషత్తులు, బ్రాహ్మణములు ముఖ్య గ్రంధ ములుగ వెలసినవి ఇప్పటి కలియుగములో యీ "నిగమ విజ్ఞాన మునకు తోడు "ఆగమములు ను కొన్ని యుద్భవించినవి ఆగమము లనగా దేవపూజా విధానములను దెల్పు శాస్త్రములని యర్థము వీటినిబట్టి దేశములోని దెవాలయములు విగ్రహారాధన, ఈ యుగ ములో చాల పెరిగిపోయినవి ఆ రాధ్యమూర్తులలో మూలపురుషులు ముగ్గురు- బ్రహ్మ, విష్ణు, ఈశ్వరులు విష్ణుమూర్తియొక్క అవతార ములు పది-మత్స్య, కూర్మ మొదలగునవి వీరి శక్తిస్వరూపములును ఆరాధనీయములే ఇటీవల అష్టాదశ పురాణములును వెలసినవి

ఈ జీవితసమస్యలన్నింటిని ఏమతమైనను పరిష్కరించగలదా? ఆయా మతస్థులు తమగ్రంధములే లోకమంతటిలో సర్వోత్తమమైన వని చెప్పకొనుట సహజము కాని దేశ కాలానుగుణ్యముగ, "అనం తావై వేదా" అను రీతిగ, యీ ధర్మశాస్త్రములును మతగ్రంధము లును అప్పుడప్పుడు సంస్కరింపబడుచుండుట, నూతన గ్రంధములు, క్రొత్తక్రొత్త వ్యాఖ్యానములు పుట్టుచుండుట సహజము మానవుని సత్యాన్వేషణ కొక మొదలు, తుద యున్నవనుకొనుట కేవలము అవివేకము ఇట్టి యజ్ఞానమువల్లనే యీ మతకర్తలు తమ యనుచరు లకు నైతికముగ, వైజ్ఞానికముగ, ఆధ్యాత్మికముగ, తుదకు ఐహిక ముగగూడ అద్వితీయమగు సేవజేసినను, ఒండొరులు కలహములకు కాలుద్రవ్వి, తుదకు మతముయొక్క పేరు నే పాడుచేయు స్థితికి దెచ్చిరి క్రైస్తవ-ముసల్మాన్, హిందూ-మహమ్మదీయ, అరబ్ - యూదు మున్నగు కల్లోలము లిట్టి దుస్థితికి కొన్ని ఉదాహరణలు తుదకీ మత భేదములు కొన్నిచోట్ల రాజద్రోహములకును, మరికొన్నిచోట్ల దండ

యాత్రలు, అంత కలహములు ఘోర యుద్ధములకుగూడ కారణభూత మైనవి వీనివల్ల ప్రపంచచాత్మ యెంతయో క్షోభించి, కుదకీ మతము యెడ ద్వేషభావముగూడ పురికొల్పబడినది ఇందు కుదాహరణగ అశోక, కనిష్క, హర్షాది రాజుల కాలములో మతమునకు రాజ్యములో నత్యుత్తమ స్థానముండగా, ఆధునిక ప్రపంచమందు కొన్నిచోట్ల మతమునకు ప్రజలలో గౌరవస్థానము లేకుండుటయు (ఉదా రష్యా), మరికొన్నిచోట్ల విమతరాజ్యములు (Seculaı States ఉదా - ఇండియా) బయల్వెడలుటయు మనము కనుచున్నాము

కాని అసలీ మతస్వరూపము నెఱిగినవారిలో ఉత్కృష్టులైన వారు "విస్సన్న చెప్పనదే వేదమ ని తమ అభిప్రాయములే ప్రమాణములనియు ఇతరమతములన్నియు దూష్యములేయనియు ఎచ్చటను చెప్పియుండలేదు ఇందుకు మారుగ బ్రహ్మ మొక్కటేయైనను పలువుర కది పలువిధముల నగపడుననియు, (1) ఆకాశమునుండి వివిధ స్థలములలో పడిన వర్షపునీరు వివిధనదులగుండా ఒకే సముద్రమునకే జేరుననియు, ( ) శివ విష్ణు లిరువురు రూపమునందును హృదయమునందును ఒక్కటేయనియు, (3) పరమాద్వైతతత్వమునే పరమ పూజ్యముగ చెప్పుచువచ్చిరి ఇంతేకాక సనాతన ధర్మవాదులు ఏ ఒక్కనియొక్కయు స్వధర్మమును నిరసించలేదు, త్రోసిపుచ్చలేదు ఇందుకుమారుగ యెవరి ఇష్టదైవమును వా రారాధించుకొనవచ్చును, ఆరాధించుకొనవలెనని శాసించిరి ఆర్య-ద్రావిడ సమన్వయములో శివకేశవుల యనన్యత్వమును ప్రతిపాదించిరి గౌతమబుద్ధు డొక నూతన "ధర్మవిధము" ను సూచించగా శ్రీకృష్ణునికి బిమ్మట యాతని నొక 'అవతారముగ" బూజించిరి ఇచ్చట మహమ్మదీయమతము రాగా "అల్లా ఉపనిషత్తు' నొకదానిని సృష్టించిరి ఇటులనే యీ కాలమున "క్రీస్టాయ కృష్ణరూపాయ యని క్రీస్తు, కృష్ణు లుభయులను సమన్వయపరచుటకును బైబిల్, ఖురాన్లేగాక, కన్ఫ్యూసియన్

---

(1) ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ

(2) అకాశా త్పతితం తోయం

(3) శివాయ విష్ణురూపాయ

[illegible] గ్రంథములను మాని "ప్రాణములుగ స్వీకరించవలె [illegible] పలువురు సూచించి [illegible] "చతుస్సాగర పర్యంత [illegible] నూతన ధర్మము నెవ్వరైన [illegible] ప్రపంచములో మతధర్మములకు అర్థ[illegible]

[illegible] వివిధమతము లేర్పడినటులనే సిద్ధాంత [illegible] వైజ్ఞానిక సంఘము లెర్పడుచున్నవి ఉదాహరణ మనదేశమందలి ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత ములు వీరందరికి సనాతనధర్మవాదులే ఈ మూడింటికిని మూలము బాదరాయణుని బ్రహ్మసూత్రములు కాని వీని వ్యాఖ్యానములో మాత్రము జీవాత్మ పరమాత్మలకుగల సంబంధము ద్వైతమని మధ్వాచార్యుడను, విశిష్టాద్వైతమని రామానుజుడను, సంపూర్ణాద్వైతమని ఆదిశంకరుడను భిన్నరీతుల వ్యాఖ్యానించిరి దీనినిబట్టి వీరిలో సిద్ధాంతభేదములు, ఆచారభేదములు కలిగినవి ఇటులనే నవీన హైందవులలో ఆర్యసమాజ బ్రహ్మసమాజములును, క్రైస్తవులలో కెథోలిక్, ప్రొటెస్టాంటు వర్గములును, మహమ్మదీయులలో షియా, సున్నీ శాఖలును ఉద్భవించినవి ఈ మున్నగు మత సంఘములేగాక, ప్రపంచమందెల్లెడల తత్త్వవిచారణకు కవిత్వపోషణకు, గాన నృత్య నాట్యాదికళోద్ధారణకు, శాస్త్రపరిశోధనకు అనేక వైజ్ఞానిక సంఘములను మనము నిత్యము గనుచున్నాము ఈ సంఘములద్వారా వివిధదేశములందలి విజ్ఞానము అభివృద్ధియగుచున్నది ఇంతేకాక ప్రపంచమందలి వివిధజాతుల మధ్య యేర్పడిన ఐక్యరాజ్యసమితికి అనుబంధమగు [illegible] ఆధ్వర్యమునగూడ వివిధజాతుల విజ్ఞానమును కొంతవరకు క్రోడీకరించి, ఒండొరులకు యెరుకపరచుటకును కొన్నియత్నములు జరుగుచున్నవి

---

# 9 వర్ణము (CASTE), కులము, వృత్తి

యుగయుగాను సహజముగ మానవులు నిర్మించిన సాంఘికవ్యవస్థలలో వర్ణపద్ధతి యొకటి. ఈ పద్ధతి యిప్పుడొక్క భారతదేశమందే కానవచ్చును. క్రీస్తుపూర్వమే యింతకుముందు ఇరాన్, చైనా, జపాను లందును మరికొన్ని దేశములందును యున్నటుల గానవగును.

వర్ణమునకు 'రంగు' అని వ్యుత్పత్త్యర్థము. ఆర్యుల తెలుపు, అన్యుల నలుపు భేదములే వర్ణ శబ్దమునకు కారణమని కొందరి అభిప్రాయము. కాని యిది సరియైనటుల తోచదు.

భారతసంఘమునందలి వర్ణములు నాలుగు. బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులు. వీరిలో మొదటిముగ్గురికి ఉపనయనార్హత కలదు. అనగా వేదము చదువుకొను అధికారము. దీనినే "ద్విజత్వ" మందురు. శూద్రులు మాత్రము ఏకజులనుదురు. ఈ వర్ణవిభజన "గుణ కర్మ విభాగశః", అనగా జీవునియొక్క గుణకర్మలతో కూడుకొనియుండునని గీతాచార్యులు చెప్పిరి.

నాలుగువర్ణములవారికిని వేర్వేరు ధర్మము లేర్పడినవి. బ్రాహ్మణులకు యజ్ఞములు చేయుట, చేయించుట, అధ్యయనము, అధ్యాపకత్వము మున్నగు షట్కర్మలు. క్షత్రియులకు వీనిలో మూడును రాజ్యస్థాపన రాజ్యరక్షణ స్వీయధర్మములు. వైశ్యులకు కృషి, గోరక్షణ వాణిజ్యములును, శూద్రులకు సేవాధర్మమును స్మృతులు విధించినవి. కాని కాలానుగుణ్యముగ యీ వర్ణములు, వర్ణస్థులు, వారివృత్తులు, రీతులు, మారిపోవుటచే యీ పద్ధతి యిప్పుడు చాలవరకు అర్థహీనముగ నున్నది.

ఆదిలో నాల్గువర్ణములవారిలో యెక్కుడు సాంఘిక సమత్వము, సామరస్యమును యుండెడివి. మోక్షము సర్వవర్ణములవారికి సమానముగ లభ్యమగునటుల శాసించబడెను. కాని రానురాను ఇందుత్తమాధమ భేదము లుదయించుటయు, జన్మసిద్ధాంతమునకు ప్రాధాన్యత ఈయబడుటచే, ఈ నాలుగు వర్ణములందే కాక వానిలో శాఖోపశాఖలుగ వెలసిన వివిధశాఖలు, ఉపశాఖలలో, ఒకరొకరి

మధ్య బ్రహ్మాండమగు కొట్లగోడలు, ఈర్ష్యాసూయలు, ద్వేషములు పెరిగిపోయినవి అందుచే యీ పద్ధతిని సంపూర్ణముగ నశింపజేయుటయో లేక కాలానుగుణ్యముగ సంస్కరించుటయో జరిగితీరవలెనని పలువురు భావించుచున్నారు

భారతీయ వర్ణపద్ధతికి అనుకూలురగువారు ఈపద్ధతిలోని ఈ దిగువ సుగుణములను సూచింతురు

(1) ఈ పద్ధతి యిచ్చట చిరకాలమునుండి యేర్పడి, సంఘజీవితములో వేళ్లు పాతుకొనియున్నది ఇది సహజము సనాతనము, శాశ్వతమైనది దీనిని తొలగించుట సాధ్యముకాదు

(2) ఇండియా, చైనా మున్నగు పెద్దదేశములలో కోట్లాన కోట్లగు ప్రజానీకము నొక పంథముగ నేర్పరచి నడిపించుటకు యేదో ఒకవిధమగు సాంఘిక విభజన యవసరము ఉదాహరణ - పూర్వకాలమందు యూదులను మోజెస్ కొన్నివర్గములుగ జేసెను బ్రిటన్‌లో మూడు రాజకీయపార్టీలున్నవి ఇతరదేశములలో తరగతులు (Classes) ఏర్పడుచున్నవి

(3) ఇందలి 'గుణ కర్మ విభాగశ" అను సూత్రము సహజమును, సమర్థమును, న్యాయమైనది

(4) ఈ విభజనయును పాశ్చాత్యుల ఆర్థిక విభజన యందలి భూమిశక్తులు (క్షత్రియ), కార్మికవర్గము (శూద్ర), ధనికవర్గము (వైశ్య), సంధానకులు (బ్రాహ్మణ), యీరెండును ఒకెమూస నుండి వచ్చినవే - పేర్లుమాత్రము వేరు

(5) ఈ పద్ధతివల్ల వివిధవర్ణస్థులకు వ్యక్తిలాభము, జాతిక్షేమము, రెండును చేకూరుచున్నవి

(6) దీనివల్ల యెల్లరకు మోక్షార్హత యబ్బుచున్నది

కాని ఈ పద్ధతికి వ్యతిరేకులగువారి వాదన యెట్టిదనగా -

(1) ఈ పద్ధతివల్లనే యిచ్చట జాత్యైక్యతయు, సాంఘిక పటుత్వమును చెడిపోయినవి

(2) కాలక్రమేణ యిచ్చట వర్ణములలో ఉత్తమాధమ భావము అంకురించి, ఉత్తముల జాత్యహంకారము, అధముల నిమ్నత్వము లేర్పడినవి

(3) జాతిలో అల్పసంఖ్యాకులగు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణములు ప్రపంచపోటీలో మన మత, రాజకీయ ఆర్థిక క్షేమము లను సమకూర్పజాలక పోయిరి దీని ఫలితమే చిరకాల మిచ్చట వెలసిన మన మత, రాజకీయ ఆర్థికదాస్యములు

(4) ప్రస్తుతాచారమగు 'జన్మవల్ల నేవర్ణ' మను పద్ధతి కేవలము దురాచారము దీనివల్ల వివిధవర్ణములవారిలో ద్వేషభావ మతిశయించు చున్నది జాత్యైక్యత నశించుచున్నది

ఇట్టి లోపములను తొలగించి, కొన్ని శతాబ్దములనుండి యీ సంస్థకుబట్టిన త్రుప్పును దులిపించినచో యీపద్ధతి యిప్పటికిని కొంత సేవ చేయదగియుండును కాని యీ ప్రజారాజ్య యుగమం దెట్టి విభజనయైనను సంపూర్ణసమత్వముపైననే ఆధారపడియుండవలయును అనగా వీటిలో యెక్కువ భేదము లుండరాదు

## అస్పృశ్యత

భారతీయ వర్ణవ్యవస్థలో అంతర్భాగము కాకపోయినను ఆచారముగ చిరకాలమునుండి యిచ్చట ప్రబలిన అస్పృశ్యతను గూర్చి మన మీ సందర్భమున చర్చించుట యవసరము

పురుషసూక్తము, మనుధర్మశాస్త్రము, భగవద్గీతలు, నాలుగు వర్ణములగూర్చి మాత్రమే ప్రస్తావించినవి కాని అసంఖ్యాకమగు భారతసంఘములో నొక భాగము చాలకాలముగ సవర్ణీయులచే అస్పృశ్యముగ చూడబడుచున్నది దీనిచే యీ సంఘీయులు ధర్మనీరసులగు టయేగాక వారి ఆర్థిక, సాంఘిక దురవస్థనుబట్టి గత యేడెనిమిది శతాబ్దములలో యేడెనిమిది కోట్లమంది పరమతములకు బానిసలగు టయు, మిగిలినవారు నేడదోగతిలో నుండుటయు చారిత్రాత్మకము

ఆదిలో యీ అస్పృశ్యత యెట్లు పుట్టెనో చెప్పసాధ్యము కాదు బహుశ ఆర్యద్రావిడ, ఆర్యదస్యుల పోరాటములో ఆదిమవాసులు గ్రామములతో కేటాయింపు చేయబడియుందురు ఐరోపీయు లీ దేశమునకు వచ్చిన యెమ్మట తమ బంగళాలను ఊరుబయట విశాల ప్రదేశములందు నిర్మించుకొనెడివారు పాతగ్రామములటులనే నిలచ పోయినవి కాని యిచ్చటి పాశ్చాత్యులసంఖ్య బహుస్వల్పమగుటచే వారు మనజాతి జీవితమును సాంతముగ అంతమొందింప జాలక

పోయిరి చిరకాలమునుండి తమ పల్లెలు, గూడెములను అంటి పెట్టుకొని యుండిన మాల మాదిగలు నేటికిని జీవశేషమాత్రులగుటలో నాశ్చర్యములేదు ఈ జాతులలో గోమాంస భక్షణ, చచ్చిన గొడ్డు మాంసము తినుట మున్నగు అనార్యరీతులు వీరి తొల్లి యస్పృశ్యతకు కారణమాత్రమై యుండనోపు

ఈ పద్ధతి యెట్లుపుట్టినను, పౌరదృష్ట్యా యీవర్గీయులు నేడు మన దేశమందు బహుహీనస్థితిలో నున్నారనుట నిస్సంశయము వేదార్హతతోపాటు దేవాలయ ప్రవేశమునకు వీరు దూరులైరి అనేక చోట్ల వీరు రోడ్లపై నడవకూడదు బడులలోనికి రానిచ్చెడివారు కారు ధర్మశాలలు హోటళ్లు నాటకములలో వీరికి స్థానముండెడిది కాదు తుదకు గ్రామ చెరువులలోను, బావులలోను వీరు నీరు చేది కూడదు ఆర్థికముగను, సాంఘికముగను వీరిస్థితి దుర్భరముగ నుండెడిది

ధర్మరూపేణ వీరి నీస్థితినుండి తప్పించుటకు మొదటయత్నించిన మతాచార్యుడు శ్రీ రామానుజులు ఆతడెల్లరకు తిరుమంత్రము నొసంగుటయేగాక, ఆయాజాతులనుండి కొందరాళ్వారులను కూడ స్వీకరించెను రామానుజుని బిమ్మట వివిధ మతకర్తలు సంస్కారవేత్తలు ఈ సంఘీయుల అభ్యున్నతికై పాటుపడుచువచ్చిరి గత నూరేండ్లలో క్రైస్తవ మిషనరీలు, బ్రహ్మసమాజ ఆర్యసమాజములు గాంధీ హరిజనోద్యమము లీవిషయమై ప్రశంసనీయమగు సేవజేసినవి వీరి యత్నముల ఫలితముగ నేడీ సంఘీయుల యిక్కట్లు కొంతవరకు చట్టరీత్యా సడలింపబడినవి నూతన రాజ్యాంగము అస్పృశ్యత యే రూపమునను ఉండరాదని నిషేధించుచున్నది కాని యిట్టి చట్టమార్పులతో యిచ్చట పరమాద్వైతసిద్ధి కలుగుననుకొనుట పొరబాటు గాఢమగు ధర్మోద్యమ మవతరించినగాని యిట్టి సాంఘిక జాడ్యములు సాంతముగ పోనేరవు

## కులము – వృత్తి

వృత్తి సంఘములు ఆర్థిక రూపములు ఇవి ప్రపంచమంతకును సామాన్యమే అయినను, భారతదేశమందు మతామోదమును బడసి 'కుల' రూపము ధరించినవి ఇట్లేర్పడిన కులములలో కమ్మర, కుమ్మర,

సాలి, కంసాలి చాకలి, మంగలి మేదర, దొమ్మర, గౌడ, మొరుగల ఇత్యాకారాది వృత్తులు అనాదినుండియు వృత్తిసంఘములు లేక శ్రేణులను ఆయా స్వయంవ్యవహారములను నడిపించుటకై వారినుండి పెద్దలు లేక శ్రేష్ఠులను ఏర్పరచెడువారు గ్రామ సముదాయమునందును, గ్రామపాలన గూడ ఈ వృత్తులకు అప్పగించిన ముండెడిది ఉదాహరణ చాళుక్య సామ్రాజ్యమందలి గ్రామపంచాయతీలు ఈపద్ధతివల్ల వివిధ కులములు అభివృద్ధి నొంది వారి వారి సంఘములకు స్వపరిపాలనాధికారమును, సంఘ గౌరవమును సమకూర్చెడివి కాని గత యేడువందల ఏండ్లలో యిచ్చటి విదేశీయ పరిపాలనవల్ల యీ వృత్తులు రీతులు చాలవరకు నాశనమై పోయినవి ఏనిలో చాల కులములు వెనుకబడిన జాతులుగ పరిగణింప బడుచున్నవి

సాధారణముగా ఈ కులములన్నియు వృత్తివల్ల ఏర్పడినందున ఒకే కులస్థులు లొకేవృత్తినవలంబించుట సహజము ఈ వృత్తులు వంశ పారంపర్యముగ వచ్చుచుండెను వర్ణపద్ధతివల్ల ఒకేకులస్థులు భోజన మజ్జనాదులచే కట్టుబడుటయు ఇతర కులస్థులతో సంబంధ బాంధవ్యములు విడనాడుటచే, ప్రతి కులము చుట్టును కోట గోడలవంటి విధి నిషేధములు పెరిగిపోయినవి

వర్ణపద్ధతితో పాటే కులపద్ధతియు దోషపూరితమని కొందరందురు కాని యిందలి మతసిద్ధాంతములు, సాంఘికాచారముల విషయమెట్లున్నను యీ కులముల వారవలంబించు వృత్తులనైనను పునరుద్ధరించుట చాల యవసరము ఇందుకై యీ జాతులకు ఎలయు విద్యా ఆర్థిక సహాయమునకు తోడుగ రాజకీయముగ వీరికి తగు అవకాశములు నొసంగబడవలెను

ఉదాహరణ - గ్రామపంచాయితీలు మున్నగు ప్రజాసంస్థలకు వారి ప్రతినిధుల నెన్నుకొనుటకంటె యీ కులపెద్దలు లేక వృత్తిపెద్దల నెన్నుకొనుటయే నిజమగు ప్రజారాజ్యపద్ధతియనితోచును పాశ్చాత్య వాదపద్ధతి కేవలము ప్రాంతీయము ఒక కులము వెనుక దీర్ఘమైన చరిత్ర శిష్టసంప్రదాయము, లోతుగ ప్రాకిన వేళ్ళు, సహజ సామరస్యము, సంఘీయులలో ఒండొరుల యెరుక, మోసముచేయుటకు వీలులేని పరిచయము, అన్నిటికంటె మిన్న ఆయా కులముల ఆర్థిక,

షింటో గ్రంథములను మానవ "పురాణములుగ స్వీకరించవలె ననియు విశాలహృదయులైన సంస్కర్తలు పలువురు సూచించి యున్నారు. ఇట్టి సమిష్టి ప్రాంతములో "చతుస్సాగర పర్యంత వ్యాపించియున్న యావత్ప్రపంచమునకొక నూతన ధర్మము నెవ్వరైన ప్రతిపాదించినను నేటి ప్రపంచములో మతధర్మములకు అర్థాం ప్రతిపాదన తోచదను

గ్రంథభేదమునుబట్టి వివిధమతము లేర్పడినటులనే సిద్ధాంత భేదముబట్టి యిప్పటి వైజ్ఞానిక సంఘము లేర్పడుచున్నవి ఉదాహరణ మనదేశమందలి ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత ములు, వీరందరు సనాతనధర్మనాదులే ఈ మూడింటికిని మూలము బాదరాయణుని బ్రహ్మసూత్రములు కాని వీని వ్యాఖ్యానములో మాత్రము జీవాత్మ పరమాత్మలకుగల సంబంధము ద్వైతమని మధ్వాచార్యుడును, విశిష్టాద్వైతమని రామానుజుడును, సంపూర్ణాద్వైతమని ఆదిశంకరుడును భిన్నరీతుల వ్యాఖ్యానించిరి దీనినిబట్టి వీరిలో సిద్ధాంతభేదములు, ఆచారభేదములు కలిగినవి ఇటులనే నవీన హైందవులలో ఆర్యసమాజ, బ్రహ్మసమాజములును, క్రైస్తవులలో కెథొలిక్, ప్రొటెస్టాంటు వర్గములును, మహమ్మదీయులలో షియా, సున్నీ శాఖలను ఉద్భవించినవి ఈ మున్నగు మత సంఘములేగాక, ప్రపంచమందెల్లెడలను తత్త్వవిచారణకు, విత్తోపార్జనకు, గాన నృత్య నాట్యాది కళోద్ధారణకు, శాస్త్రపరిశోధనకు, అనేక వైజ్ఞానిక సంఘములను మనము నిత్యము గనుచున్నాము ఈ సంఘములద్వారా వివిధదేశములందలి విజ్ఞానము అభివృద్ధియగుచున్నది ఇంతేకాక, ప్రపంచమందలి వివిధజాతుల మధ్య యేర్పడిన ఐక్యరాజ్యసమితికి అనుబంధమగు ఆర్థిక సాంఘికపర ఆధ్వర్యమునగూడ వివిధజాతుల విజ్ఞానమును కొంతవరకు క్రోడీకరించి, ఒండొరులకు యెరుకపరచుటకును కొన్నియత్నములు జరుగుచున్నవి

# 9 వర్ణము (CASTE), కులము, వృత్తి

యుగయుగాను పరిణామముగ మానవులునిర్మించిన సాంఘికవ్యవస్థలలో వర్ణపద్ధతియొకటి ఈ పద్ధతి యిప్పుడొక్క భారతదేశమందే కానవచును ఇట్టిపద్ధతియే యింతకుముందు ఇరాన్, చైనా, జపాను లందును మరికొన్ని దేశములందును యున్నటుల గాననగును

వర్ణమునకు 'రంగు' అని వ్యుత్పత్త్యర్థము ఆర్యుల తెలుపు, అన్యుల నలుపుభేదమే ఈవర్ణ శబ్దమునకు కారణమని కొందరి అభిప్రాయము కాని యిది సరియైనటుల తోచదు

భారతసంఘమందలి వర్ణములు నాలుగు బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్రులు వీరిలో మొదటిమువ్వురకు ఉపనయనార్హతకలదు అనగా వేదముచదువుటకును అధికారము దీనినే "ద్విజత్వ" మందురు శూద్రులు మాత్రము ఏకజులుగనుందురు ఈ వర్ణవిభజన 'గుణ కర్మ విభాగశః', అనగా జీవులయొక్క గుణ కర్మలతో కూడుకొనియుండు నని గీతాచార్యులు చెప్పిరి

నాలుగువర్ణములవారికిని వేర్వేరు ధర్మము లేర్పడినవి బ్రాహ్మణులకు యజ్ఞములు చేయుట, చేయించుట, అధ్యయనము, అధ్యాపకత్వము మున్నగు షట్కర్మలు క్షత్రియులకు వీనిలో మూడును, రాజ్యస్థాపన రాజ్యరక్షణ స్వీయధర్మములు వైశ్యులకు కృషి, గోరక్షణ వాణిజ్యములును, శూద్రులకు సేవాధర్మమును స్మృతులు విధించినవి కాని కాలానుగుణ్యముగ యీ వర్ణములు, వర్ణస్థులు, వారివృత్తులు, రీతులు, మారిపోవుటచే యీ పద్ధతి యిప్పుడు చాలవరకు అర్థహీనముగ నున్నది

ఆదిలో చాతుర్వర్ణమువారిలో యెక్కుడు సాంఘిక సమత్వము, సామరస్యమును యుండెడివి మోక్షము సర్వవర్ణములవారికి సమానముగ లభ్యమగునటుల శాసించబడెను కాని రానురాను ఇందుత్తమాధమభేదము లుదయించుటయు జన్మసిద్ధాంతమునకు ప్రాధాన్యత ఈయబడుటచే, ఈ నాలుగు వర్ణములందే కాక వానిలో శాఖోపశాఖలుగ వెలసిన వివిధశాఖలు, ఉపశాఖలలో, ఒకరొకరి

సాంఘికవృద్ధికి వలయు అవకాశములు నుండును ప్రస్తుత ట్రేడ్ యూనియను, కిసాను మజ్దూరులకంటె యీ కులపద్ధతియే ఎక్కుడు దేశీయము సంప్రదాయయుతము, ఉపయుక్తమని తోచును కావుననే 1882 లో రిప్పన్ ప్రభువు యీ పాశ్చాత్య వార్డు పద్ధతికంటె ఇచ్చటి కులపద్ధతియే ఇండియాలో యెక్కుడు సమంజసమని నుడివెను

## 10 సాంఘిక సేవ

'తమకార్యంబు పరిత్యజించియు పరార్థప్రాపకుల్ సజ్జనుల్"

—భర్తృహరి

ఎల్లచోట్లను సంఘములో సుఖవంతులును, పీడితులును యుందురు అందు ముఖ్యముగ మనదేశమువంటి దీర్ఘపీడితదేశములో యీబాధితులస్థితి దుర్భరముగ నుండును అట్టి సంఘములో కొద్దిపాటిమంది భోగలాలసులు, ఐశ్వర్యవంతులు కోట్లాది నిస్సహాయులు, గర్భదరిద్రులు నుండుట సామాన్యానుభవము ఇట్టి పరిస్థితులలో పౌరులకు సాంఘికసేవ యెక్కుడవసరముగ నుండును

మానవునకు అన్నమయ, ప్రాణమయ, మనోమయ విజ్ఞానమయములను నాలుగు కోశము లెట్లుండునో, అదే రీతిగ మన సాంఘికావసరములును వివిధములుగ నుండను ఈ బాధితులలో కొందరు కుంటి, గ్రుడ్డి మున్నగు వికలాంగు లుందురు కొందరు బిడ్డలకు తలిదండ్రులుండరు కొందరునిస్సహాయులగు వృద్ధులు, విధవలు పతితులు అనేకమందికి ఆకలిబాధ కొందరు రోగపీడితులు దేశములో అచ్చటచ్చట ప్లేగు, కలరా మున్నగు అంటువ్యాధులువచ్చుచుండును ఇండ్లు తగులబడిపోవుట, వరదలు క్షామముల బాధలు కొన్ని కొందరకు పిచ్చి విద్యావిషయమైన ఇక్కట్టులు అసంఖ్యాకములు బాలబాలికలవిద్య, పెద్దలలో అక్షరాస్యత నిమ్నజాతుల అభివృద్ధి గ్రామములో పరిశుభ్రత, ఆరోగ్యవిషయములు, ఆస్పత్రులు, వాడవాడల సంస్కారము, యెల్లరకు గృహవసతి, జైళ్ళలోపడి

ప్రస్తువారి ఈతిబాధలు, కొన్నిచోట్ల అనాథప్రేతల సంస్కారము కేవలము మానవులబాధలేగాక యితర జీవరాసుల కష్టములు – ఇవి, అవి అననేల ? దాస్యపీడితదేశములో పిపీలికాది బ్రహ్మవేత్త పర్యంతము అందరకుబాధలే, అన్నీ యిక్కట్టులే వీనినిబాపుటకై ఎందరెందరి యొక్క సహాయము కావలయుండును ఎన్నో విద్యాలయములు, వైద్యాలయములు, గ్రంథాలయములు, సత్రములు చెరువులు, బావులు మున్నగు సహాయ సంస్థలు అవసరము వీటన్నిటికీ ప్రభుత్వమే బాధ్యత వహించుట అసాధ్యము అందుచేత ప్రజలలో సహాయక సంఘములు, సాంఘిక సంస్థలు, యిట్టి సాంఘికసేవకు విరివిగపూనుకొను భవర్గములు అవసరమగుచున్నవి

భారతదేశము దాస్యములోనున్నంతకాల మిచ్చట ముఖ్యమగు సాంఘికసేవ మాతృమూర్తియొక్క దాస్యశృంఖలములను ద్రుంచివేయుట యొక్కటే ప్రధానవిషయ మయ్యెను ఏలయన, స్వాతంత్ర్యలోపమే అన్నిరంగములందలి అభివృద్ధికిని ఆటంకమయ్యెను అందుచేత దేశీయులలో పెక్కుమంది దృష్టియంతయు జాతీయ కాంగ్రెసు యను మహాసంస్థను నిర్మించి, తద్వారా బ్రిటిష్ ప్రభుత్వమును పారద్రోలి తిరిగి స్వాతంత్ర్యమును సంపాదించుటయే ఇచ్చట ప్రధాన సాంఘిక సేవగ పరిగణించెను అందుకొరకే తిలకు గాంధీ, దాసు, మున్నగు మహనీయు లందరును తమ జీవితములను స్వరాజ్యసాధనలోనే ధారబోసిరి ఈ యత్నములో వారికి సహాయముగ హిందూస్థాన్ సేవాదళ్ ఖిలాఫత్, రామదండు మున్నగు ఐచ్ఛిక సేవాదళములను వాలంటీర్లను వీ రేర్పరచుకొనిరి ఇటులనే స్వాతంత్ర్యసిద్ధికి పిమ్మట ఈఐచ్ఛికదళములలో భారతసేవక సమాజము, రెడ్ క్రాస్, రామకృష్ణమిషన్ సోషల్ సర్వీస్ గిల్డు, స్కౌటు, రోటరీ, కేడెట్ దళము మున్నగు సాంఘికసంస్థలు పెక్కుచోట్ల సాంఘికసేవ యొనర్చుచున్నవి ఇచ్చట కొన్ని దశాబ్దములవరకు జరుగవలసిన సంఘసేవ మహాసముద్రము వలె నుండుటచే యిట్టిసేవాసంస్థల కింకను ఎక్కుడు అవసరమును, అవకాశమును గలదు

ఈ సందర్భములో ఇప్పుడు మనదేశములో జరుగవలసిన సాంఘికసేవ యెట్టిదో కొంచెము విచారించుట అవసరము ఎల్లరకు

ఆకలిబాధను తొలగించుటకై యిచ్చట అన్నసత్రములు మన సంప్రదాయములు. ఇప్పుడిచ్చట మూర్తీభవించిన ఆకలిని నిర్మూలించుటకై తిరిగి ఊరూర అన్నసత్రములు అవసరము. 1943 లో బెంగాల్, ఒరిస్సాలలో క్షామబాధచే ముప్పది లక్షలమంది మడసిరి. కాని యిట్టి అన్న సత్రములు గంజి సత్రముల సహాయమువలన 1952 లోని రాయలసీమ క్షామములో ఆకలి చావులొక్కటియు లేకుండ బయట పడగలిగితిమి. 1953 గోదావరి వరదలలో అనేక గ్రామములు జలమయమై పోవుటచే కొన్నిచోట్ల విమానములనుండి ఆహారపొట్లములు క్రింద పడవేసి ప్రజలను పోషింపవలసి వచ్చెను. ఆహార లోపముచే బక్కచిక్కిన మన బాలబాలికలు అనేకమందికి మధ్యాహ్నభోజనములు, పాలపొట్లములిచ్చి సహాయము చేయుచున్నారు. ఈ రీతిగ ఆహారవిషయమున సాంఘిక సేవచేయుటకు పెక్కు వీళ్ళు గలవు.

ఆహారమునకు పిమ్మట యిచ్చట వైద్యసేవ చాల యవసరము. ప్రజలలోను, పశుపక్ష్యాదులందును రోగనివారణకై ఆదినుండియు మనపూర్వులు పెక్కు సాధనములను కనిపెట్టియుండిరి. అశోకుని కాలమందే ఈ జాడ్యనివారణకు ఆస్పత్రులుండెడివి. ప్రపంచ మంతలో పశువుల ఆస్పత్రులను నెలకొల్పుటలో అశోకచక్రవర్తియే ప్రప్రథముడు. ప్రతి రాజ్యమందును ప్రభుత్వ మనేక ఆస్పత్రులను స్థాపించి, నడుపుచుండును. కాని యీ శాఖలో యింకను ప్రజాసేవ ఎంతయో జరుగవలసియున్నది. ఎల్లెడలను ఉచిత వైద్యాలయములు, ప్రసూతి వైద్యశాలలు, అనాధశరణాలయములు, కుష్ఠుశరణాలయములు క్షయ ఆస్పత్రులు, పిచ్చి ఆస్పత్రులు, ఇట్టివెన్నియో కావలసి యున్నవి.

విద్యారంగమందు మనదేశ మెంతయో వెనుకబడియున్నది. ఇప్పుడిచ్చట అక్షరాస్యత నూటికి 14 లేక 16 వంతులు మాత్రమే యున్నది. ఇతరదేశములలో నూటికి 70-80-90 మందికూడా అక్షరాస్యులు కలరు. వయోజన వోటింగ్ సక్రమముగ అమలు జరుగవలెనన్నచో వయోజనవిద్య అవసరము. ఇందుకై అనేక పాఠశాలలు రాత్రిబడులు, కార్మికవిద్యాలయములు గ్రంధాలయములు అవసరము. పేటపేటలందును, ఊరూర ప్రాథమిక పాఠశాలలు కావలెను

అన్ని దానములలో విద్యాదానము గొప్పదని పెద్దలు చెప్పుదురు ఇందు ప్రభుత్వము హెచ్చుగ పాల్గొనవలసియుండును కాని సంఘము యొక్క తోడ్పాటులేనిచో యేప్రభుత్వమును యీ భారము వహింప జాలదు

మానవునకు కేవలము ఆహారము, ఆస్పత్రులు, విద్యాలయములు గ్రంథాలయములు మాత్రమే సంపూర్ణమగు తృప్తినొసంగ జాలవు ఏది యెట్టులో ప్రతి మానవుడు ఒక ఆత్మస్వరూపు డప్పుడు ప్రపంచమంతట నుండు అన్నకామములతోపాటు యీ జ్ఞానకామమును నైతికామమును ప్రజల నెక్కుడుగ పీడించుచున్నది తిరిగి మానవుడు తన స్వరూపమును గుర్తెరిగి, తన సహజ మానవత్వమును పునరుద్ధరించుకొననిచో, యీ ప్రపంచములోని గాఢాంధకారమును తొలగిపోయి, నూతన జ్ఞానజ్యోతి యవతరించుట దుర్లభము ఇందుకై అనేకచోట్ల జ్ఞానోపదేశము, తత్వబోధ మత ప్రచారము, వేదాంతసమన్వయము అవసరములగుచున్నవి

ఇట్టి సాంఘిక సేవ చేయుటకై దేశమం దిప్పటికే కొన్ని సేవా సంఘములు కృషిచేయుచున్నవని మనము పైన జదివితిమి కాని ఇతర పౌరగుణములవలెనే యీ సాంఘికసేవయును బాల్యమునుండియు కొంత శిక్షణ యవసరము ఇందుకై నేడు మన విద్యాలయములందును, కళాశాలలలోను, 'పౌరశిక్షణాలయములు' 'సాంఘికసేవాసమితులు' (Social Service Leagues) యేర్పాటు చేయబడుచున్నవి ఇందలి పౌరశిక్షణాతరగతులలో (Citizenship Training Classes) ఒక నెలరోజులలో పదిహేను విద్యార్థులకు పౌరశిక్షణ గరపబడును వీరందరు సుశిక్షితుడగు ఒక ఉపాధ్యాయునితో కలిసి ఆ కాలమంతయు గడుపుదురు ఈ శిక్షణలో కేవలం గ్రంథకాలక్షేప మొక్కటియే యుండదు కొన్ని పాఠములు, పుస్తకములును, కొందరు పెద్దలగువారి ఉపన్యాసములు నుండును కాని వీనికి తోడుగ యీ తరగతులలో నిజమగు పౌరశిక్షణ యెట్లుండునో ప్రత్యక్షముగ గ్రహించుటకు సావకాశములు కల్పింపబడును తమ చుట్టుప్రక్కల స్థలమును పరిశుభ్రముగ నుంచుకొనుట, గదులు తమంతటతామే ఊడ్చుకొనుట, గోడలకు వెల్ల (సున్నము) వేసుకొనుట, సాకీదొడ్లను తామే బాగుచేసుకొనుట,

యిట్టి దొడ్డలో ఆధునిక పద్ధతులు నెలకొల్పుట, స్కౌటింగుపద్ధతి, ప్రాథమిక చికిత్స (First aid), ఏదోయొక చేతిపని నేర్చుకొనుట, అన్యోన్య సహకారము, సభ్యత సహనము మున్నగునవన్నియు ఒక గురుసమక్షమందిచ్చుటి బాలురకు గరపుదురు వీరిలో వీరు కొన్ని దళములుగ (Squads) నేర్పడి తమ దళాధిపతిని (Squad leader) యెన్నుకొని, యొక దళశిక్షణలో మసలుటకును, వీరి కిచ్చుట వీలు పడను జాతీయజెండా యెటుల ప్రతిష్టించవలెనో, జాతీయగీత మెట్లుపాడవలెనో, ఇతర దేశముల జెండా రూపము లెట్లుండునో, వీరి కిచ్చుట బోధింతురు ఇతరులకు సేవచేయుటలో వీరిలో వీరిచ్చుట ఒక రాత్రి పాఠశాలను నడుపుటకో, వయోజనవిద్యాలయమును స్థాపించు టకో, ఒక గ్రంధాలయమును నెలకొల్పుటకో, లేక ఒక మురికిపేట (Slum) ను శుభ్రపరచుటకో ప్రత్యేకముగ కొంతశిక్షణ యొసంగ బడును ప్రభాతభేరీలు, హరికథాకాలక్షేపములు, భజన పార్టీలు, పాటకచేరీలు, సమీపముననున్న యేదో ఒక యాత్రాస్థలమును సందర్శించుట (Excu sion) వీరికిచ్చుట యొసంగు వినోదకాలక్షేపములు ప్రాతఃకాలముననే నిద్రలేచుట, సకాలమున స్నానసంధ్యాద్యనుష్ఠానములు తీర్చుకొనుట కసరత్తు ఆటలు, ఒక నిర్ణీతమగు కార్యక్రమమునుబట్టి దినచర్యగడపుట, కులమత విచక్షణలేకయే ఉపాధ్యాయులు శిష్యులు ఒకేపంక్తినిభుజించుట, ఒకేస్థలమున శయనించుట— నిజముగ యీశిక్షణ యొక గురుకులాశ్రమశిక్షణవలెనే యుండును వీరిఖర్చులకై ప్రభుత్వము కొంత ధనసహాయము చేయును

దాదాపు యిట్టి కార్యక్రమముతోనే ప్రతి కళాశాలయందును యిప్పుడు సాంఘిక సేవాసమితులు (Social Service Leagues) ఏర్పడుచున్నవి కాని యీ సమితులలో గురుసమక్షమందు శిక్షణ విశేషముగ నుండదు విద్యార్థులు తమ నాయకుని తామే యెన్నుకొందురు అతని నాయకత్వమున సభలు సమావేశములు జరిపించుకొందురు నగరములో ఎట్టి సాంఘిక సేవయైన అవసరమైనచో తమ ఉపాధ్యాయుల పర్యవేక్షణక్రింద వీరు సేవజేయుదురు ఇట్టి శిక్షణవల్ల ఉత్తరోత్తరా మన విద్యార్థులు మంచి పౌరులు, మంచి సాంఘికసేవకులగుటకు చక్కని అవకాశముండును

# 11 గ్రామము - గ్రామోద్యోగులు

"గ్రామ మనగా ఒకే స్థలమందు దగ్గరదగ్గరగ ఇండ్లుకట్టుకొని నివసించు కొందరు ప్రజాసముదాయము అట్టిస్థలమునకు గ్రామకంఠ మని పేరు గ్రామకంఠముచుట్టును కొంత వ్యవసాయభూమియు, పశువుల బీడు లేక అడవియు నుండును ఆ భూములకు సాధారణముగ ఆ యూరివారే యజమానులగుదురు వారిని గ్రామస్థులు లేక గ్రామీణు లందురు ఇండ్లసంఖ్య బహు స్వల్పమైనప్పుడు దానిని 'పల్లె' లేక 'వాడ' అందురు హెచ్చైనచో ఊరు లేక గ్రామ మందురు

పూర్వకాలమునుండియు మనజాతి జీవితమునకును పాలనకును యీ గ్రామమె పునాదిగా యుండెడిది మనువు రాజ్యపాలనకై ప్రప్రథమమున గ్రామాధికారి, తదుపరి దశగ్రామాధికారి శతగ్రామాధికారి సహస్రగ్రామాధికారు లవసరమని శాసించెను ఇట్టి విభాగమే నేటి గ్రామ ఫిర్కా సమితి లేక తాలూకా, జిల్లాలకు ప్రాతిపదికయని మన మెరుగుదుము మనువునకు బిమ్మట మౌర్యపాలనలో గ్రామము లందు గ్రామీణులును, 5 లేక 10 గ్రామములను గోపులును పాలించుచుండిరి పట్టణములలో నాగరకులు, పంచాయతీలు నుండెడివి దక్షిణ దేశమునేలిన చాళుక్యరాజులకాలమందీ గ్రామపంచాయతీలు మిక్కిలి ఉచ్ఛస్థితిలో నుండెడివి బ్రిటిష్ పాలనలో యీ పంచాయతీలు చాల వరకు శిథిలమైపోయినను ఇప్పటి స్వరాజ్య సౌధమున కీ గ్రామ పంచాయతీలే పునాదులు కావలెనని పలువు రాశించుచున్నారు

సాధారణముగ గ్రామములు రెండు విధములుగ నుండెడివి 1 జమీందారీ లేక మొఖాసా, 2 రైత్వారీ వీనిలో మొదటి దానిలో గ్రామమంతయు ఒకే యజమాని ఆధీనమందుండును అచ్చట గ్రామకంఠపుభూము లన్నిటిని ఆతడు, ఆతని వంశీయులు భూమందు లగుదురు అచ్చటి పొలము కొనుట కాతని యనుమతి అవసరము రైత్వారీ గ్రామములో అటులగాక యెవ్వరైనను పొలము సంపాదించుకొనవచ్చును మొదటితరగతి గ్రామములందు సాధారణముగ ఒకే తెగ లేక వంశమువా రుందురు రైత్వారీ యూళ్ళలో వివిధ జాతులవా రుండుట సహజము ఇటీవల మొఖాసాగ్రామము లంత రించినవి

పూర్వకాలమందు గ్రామములు చాలవరకు స్వయంపోషకము (Self supporting) లు. నుండెడివి. అనగా అచ్చట వారికి వలయు ఆర్థిక సాంఘిక అవసరములన్నియు ఆ గ్రామమందే లభించెడివి ఇందుకై ఇచ్చట గ్రామాధికారులతోపాటు కర్షకులు, నేత, వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, నాయీ, రజక చర్మకారాదివృత్తులకు జెందిన వారును, కొన్ని చోట్ల పూజారి బడిపంతులు, షాహుకారు జ్యోతిష్కుడును ఉండెడివారు కాని నేటి గ్రామములలో సంపూర్ణముగా మార్పు తటస్థించెను పలుచోట్ల పల్లెలు పాడుపడియున్నవి మరికొన్ని జీవచ్ఛవములై నిలువెల్ల పట్టణములపైననో, లేక విదేశములపైననో ఆధారపడియున్నవి ఇట్టి విషాదస్థితికి ముఖ్యకారణము లెవ్వియన - (1) ప్రజలందు న్యాయ్యభావ మతిశయించుట, దీనితో జమీ గ్రామములన్నియు రైత్వారీగా మారిపోయినవి (2) పట్టణముల పెరుగుదల (3) పారిశ్రామిక విప్లవము గత 200 ఏండ్లలో ఆవిరిబలము, విద్యుచ్ఛక్తి గ్రామజీవితమును తారుమారుచేసినవి ఆవిరియంత్రము కనిపెట్టిన జేమ్సువాట్ 1736-1819 నాటివాడు నూలుమర కనిపెట్టిన జేమ్సుహార్‌గ్రీవ్సు 1766 నాటివాడు ఈమార్పువల్ల గ్రామములందలి చేతిపనివాండ్రు ఉత్పత్తివిక్రయములలో యంత్రపోటీకి ఆగలేక, తమ వృత్తులను వదలుకొని, గ్రామమందు వ్యవసాయకూలీలుగనో, చిన్న రైతులుగనో మారిపోవుటయో, లేక దూరప్రాంతములకు ప్రవాసమేగుటయో తటస్థించెను వీనికితోడు (4) మనమందు మార్పు (5) ధనమోహము, యీ పల్లెక్షేమమును పాడుచేయుటకు సహాయభూతములైనవి

1895 గ్రామోద్యోగుల చట్టమందు చెప్పిన ఉద్యోగులు పేర్కొనబడిరి (1) గ్రామమునసబు, (2) పటేల్ లేక మిరాసిదార్ లేక పెద్దకాపు, (3) కరణము, (4) నీర్గంటి, (5) వెట్టి తోటి, లేక తండాల్దార్, (6) తలయారి ఆచారమునుబట్టి యీ ఉద్యోగములన్నియు వంశపారంపర్యముగ దఖలుపడుచున్నవి గ్రామములను రివిన్యూబోర్డు ఏర్పరచును జిల్లాకలెక్టరు గ్రామోద్యోగులను నియమించును ఆతనిపై అప్పీలు అధికారము రివిన్యూబోర్డుది ఏ ఉద్యోగమునకు మొదటివారసుడనర్హుడగుచో, రెండవవానిని లేక మరొకనిని నియమించవచ్చును ఈ

యుద్యోగమునకు మైనర్లు పనికిరారు పదవికివలయు విద్యాశిక్షణ అవసరము గ్రామోద్యోగస్తులందరు ఆ గ్రామవాస్తవ్యులై యుండవలెను

గ్రామమున కొక్కడే మునస బుండును ఆతడు గ్రామములో ఆస్తిపరుడు, పలుకుబడిగలవాడు, ఘరానామనిషిఅయి యుండవలెను తన ఆస్తిని తనఖాపెట్టినవానిని, ఒక యేడు శిక్షపడినవానిని, ఆస్తి జప్తుచేయబడినవానిని, రోగిని, వృద్ధుని, పిచ్చివానిని, తనవిధుల నుపేక్షించినవానిని, ఊరువిడిచి పోయినవానిని, ఈ పదవినుండి కలెక్టరు తొలగించవచ్చును ఈతని విధులలో గ్రామమందలి పట్టాదార్లనుండి భూమి శిస్తు వసూలుచేయుట ముఖ్యమైనది వసూళ్ళకు జమాఖర్చు లెక్కలు, జనన మరణములు ఆక్రమణ లెక్కలను, తాలూకాలకు మునసబు కరణములు తెలుపుచుండవలెను పంటల తనిఖీ, భూమిసర్వే మున్నగు పనులలో రివిన్యూ అధికారులకు వీరు తోడ్పడుదురు గ్రామమందలి 'కేడీ' ల గూర్చి పోలీసులకు దెలుపుట, తగాదాలను రిపోర్టు చేయుట, నేరముల విచారణలో పోలీసులకు తోడ్పడుట, అంటువ్యాధుల గూర్చి వెంటనే తాలూకాకు తెలియజేయుట, మునసబుయొక్క విధులు పది రూపాయీలకు మించని స్థానిక వ్యాజ్యముల నీతడు విచారించవచ్చును ఉభయపార్టీల సమ్మతితో రు 200 ల వ్యాజ్యములనైనను యీతడు విచారించవచ్చును గ్రామ పంచాయతీ కోర్టులున్న స్థలములం దీతని కీ యధికారముండదు

గ్రామోద్యోగు లందరిలో కరణము పదవి హెచ్చు బాధ్యతలతో కూడియుండును 1802 కరణముల నిబంధన ననుసరించి 400 వరహాలకు మించిన శిస్తుగల ప్రతిగ్రామమున కొక కరణ ముండవలెను పని యెక్కువగానున్న గ్రామములలో ఒక్కనికంటె హెచ్చుకరణము లుందురు ప్రభుత్వమునకును, ప్రజలహక్కులకును యీతని లెక్కలు చాల ముఖ్యమైనవని యీ నిబంధన తెల్పుచున్నది గ్రామమందలి భూమి రిజిష్టర్లు సరిహద్దులు, మార్పులు, పచ్చికబీళ్లు, యిళ్లు, తోటలు, సదులు, చెరువులు, బావులు, బంజర్లు, అడవులు వగైరా వివరములను, బందోబస్తు అయిన భూములు, శిస్తులేని భూములు, సనదులవల్లగాని, గ్రాంటులవల్లగాని, యేర్పడిన యీనాములు, పంపకపు లెక్కలు,

గ్రామోద్యోగులకు వినియోగింపబడు పంటమొత్తములు, రేట్లు మేరలు, ధనరూపమున శిస్తురేట్లు, మొత్తములు, క్విట్ రెంటు వగైరా సెస్సులు, అదనపు పన్నులు ( Sur charge), ధాన్యము ధరలు, నెల సరి లెక్కలు, పరాయివారి రాకపోకలు, గ్రామ జమాఖర్చులు, యీ మున్నగు రికార్డునంతయు యీతడు భద్రపరచవలెను ఈతడిట్టి లెక్క లలోను, భూమికొలత (సర్వే) లందును ఉత్తీర్ణుడై యుండవలెను

వెట్టివాని విధులు గ్రామకాపలా, నేరములను కనిపెట్టి మున సబుకు దెలుపుట, గ్రామాధికారులకు తోడ్పడుట

ఈ గ్రామాధికార్లందరు పూర్వకాలమందు గ్రామసేవకులై గ్రామ సముదాయమునుండి "ఈనాము లను పొందెడివారు కాని యిటీవల బ్రిటిషువారి హయాములో వీరందరు కొంతవరకు ప్రభుత్వో ద్యోగులైరి వీరి జీతభత్యములు బహుస్వల్పము లగుటచే వీరి యభి వృద్ధికై రాష్ట్రప్రభుత్వము లిప్పుడు కొంతవరకు యత్నించుచున్నవి ఈ యుద్యోగములలో వంశపారంపర్య పద్ధతిని సడలించుటకు కొన్ని యత్నములును జరుగుచున్నవి ఈ పద్ధతి భారత రాజ్యాంగమునకు విరుద్ధమని సుప్రీమ్‌కోర్టు యిటీవలనే తీర్మానించెను

గ్రామాధికార్లపై అజమాయిషీ చేయుటకు మనప్రాంతమందు పది పదిహేను గ్రామముల కొక ఫర్కా ఇన్స్పెక్టరుండును 5–6 ఫిర్కాలు కలిసిన ఒక తాలూకా, 10–12 తాలూకా లొకజిల్లా, కొన్ని జిల్లాలు కలిసినదాని కొకరాష్ట్రము లేక "స్టేట్ అని పిలుచు చున్నారు ఇటీవల యీ గ్రామములకు, జిల్లాకు మధ్య కొన్ని "బ్లాకు' లు (Blocks ) ఏర్పడినవి

## 12 స్థానికపాలన-గ్రామపంచాయతీలు

స్థానికస్వపరిపాలన (Local Self Government) అనగా ఒక నిర్ణీతమగు ప్రదేశమునందలి ప్రజలు తమ ప్రతినిధులద్వారా కొన్ని పరిపాలనా వ్యవహారములను సాగించుకొనుట, ఇందు బయట అధికారులవల్ల విశేషజోక్యము లేకుండుట – ఈ రెండును స్థానిక పాలనకు ముఖ్యసూత్రములు స్థానిక సంస్థలలో (1) గ్రామపంచాయతీలు, (2) పట్టణ మునిసిపాలిటీలు, (3) జిల్లాబోర్డులు, (4) నగర కార్పొరేషన్లు ముఖ్యమైనవి ఈ నాలుగునుగాక (5) పోర్టుట్రస్టులు, (6) నగరాభివృద్ధి సంఘములు, స్థానిక సంఘముగ యెన్నబడుచున్నవి వీనిలో జిల్లాబోర్డులస్థానే జిల్లాపరిషత్తు ఏర్పడినవి. వీనికి తోడుగ (7) బ్లాకుసమితులు క్రొత్తగా స్థాపింపబడినవి

1950 మదరాసు పంచాయతీల చట్టము ననుసరించి 1000 జనాభాగల గ్రామములలో పంచాయతీ ఏర్పడవచ్చును 1000 కి తక్కువ జనాభాగల ఊళ్ళను ప్రక్క పంచాయతీలలో చేర్చవచ్చును

ఆంధ్రప్రదేశమునందలి సర్కార్లు, రాయలసీమలకు పూర్వపు ఆంధ్రరాష్ట్రభాగములో మొత్తం 17,143 గ్రామములున్నవి తెలంగాణా ప్రాంతమందు 8 327 గ్రామములున్నవి అన్నియూళ్ళలో దాదాపు యీ పంచాయతీల నిర్మాణము పూర్తి అయినది

ప్రతి గ్రామ పంచాయతీయు ఆ పంచాయితీ పేరుతో వ్యవహరించుచు, శాశ్వత వారసత్వము సాముదాయక ముద్ర (సీలు), వ్యాజ్యములు నడిపించుకొనుహక్కు, స్థిరచరాస్తులు కలిగి, కంట్రాక్టులు చేసుకొను అధికారము కలిగియుండి, తన విధ్యుక్తధర్మములను నిర్వహించుచుండును.

గ్రామ పంచాయతీలు రెండు తరగతులు, మొదటి తరగతి అయిదువేలకు తక్కువకాని జనాభా, పదివేల రూపాయలకు తక్కువ

కాని ఆదాయముకలవి ఇంతకు తక్కువ జనాభాకాని, ఆదాయము గాని గల పంచాయతీలు రెండవ తరగతికి చెందును

జనాభానుబట్టి యిందలి సభ్యులసంఖ్య 6 నుండి 16 వరకు నిర్ణయించబడినది వీనిలో పదేళ్ళపాటు షెడ్యూలు తరగతివార్కి మాత్రము కొన్ని స్థానములు ప్రత్యేకించబడినవి కాని ఈ స్థానము లన్నియు ఎన్నికస్థానములే

పంచాయతీ ఎన్నికలకొరకు గ్రామములు కొన్ని "వార్డులు" లేక పేటలుగ విభజింపబడును ప్రతి మూడేండ్లకు యెన్నికలు జరుగును గ్రామములో 21 యేండ్లునిండిన స్త్రీ పురుషులెల్లరు యిందు వోటర్లుగ నుండ నర్హులు గ్రామ మునసబు, కరణము, గ్రామ నౌకర్లు పంచాయతీ లేక యితర ప్రభుత్వోద్యోగులు, యీ పంచాయతీ ఎన్నికలకు నిలువరాదు పిచ్చివాండ్రు, మూగ, చెవిటివారు, కుష్ఠురోగులు, దివాలాతీసినవారు, దీర్ఘశిక్ష ననుభవించినవారు, గౌరవ మేజిస్ట్రేట్లు, పంచాయతీతో లావాదేవీకలవారు, పన్ను బకాయి పెట్టినవారు, యిందు సభ్యులుగ నుండరాదు మూడు నెలలు వరుసగా మీటింగులకు హాజరుకానిచో వారిసభ్యత్వము రద్దగును కాని తోడి సభ్యులు అట్టివారి సభ్యత్వమును రెండుసార్లు పునరుద్ధరింప వచ్చును

ప్రతి పంచాయతీకి ఒక ప్రెసిడెంటు, ఒక వైస్ప్రెసిడెంటు నుందురు వీరు పంచాయతీ సభ్యులలోనుండి సభ్యులచేతనే, యెన్నుకొనబడుదురు

ప్రెసిడెంటు -విధులు - (1) వైస్ ప్రెసిడెంటు యెన్నికను యేర్పాటుచేయుట, (2) పంచాయతీ సభలు జరుపుట, (3) పంచాయతీలో యే రికార్డునైనను చూచుటకు పూర్తి అధికారమును కలిగి ఉండుట, (4) చట్టముననుసరించి ఆతని అన్నివిధులను నిర్వర్తించుట

పంచాయతీ సభ్యులు పంచాయతీ వ్యవహారముల గూర్చి కార్యనిర్వాహకాధికారికి తెలియజేయవచ్చును తీర్మానములు ప్రవేశ పెట్టవచ్చును ప్రశ్నల నడుగవచ్చును ఆఫీసురికార్డు పరిశీలించ వచ్చును సభలలోను, కమిటీలలోను పాల్గొని వోటుచేయవచ్చును అధ్యక్షుడు హాజరులేని సమయములో ఉపాధ్యక్షు డాతని విధులను నెరవేర్చును

పంచాయతీ ప్రెసిడెంటుగాని, సభ్యులుగాని పంచాయతీ నిధిలో నుండి యెట్టి ప్రతిఫలమును తీసుకొనరాదు

యే పంచాయతీకైనను ప్రభుత్వము కార్యనిర్వాహకాధికారిని (Executive Officer) నియమింపవచ్చును అట్టి అధికారి లేనప్పుడు పంచాయతీ ప్రెసిడెంటే అట్టి విధులను చూచుకొనును కొన్ని పంచాయతీలను జేర్చి ఒక ఉమ్మడి కార్యనిర్వాహకాధికారినిగూడ నియమించవచ్చును కార్యనిర్వాహకాధికారి పంచాయతీ సభలకు, కమిటీ మీాటింగులకు హాజరుకావచ్చును కాని తీర్మానములు పెట్టరాదు వోటు చేయకూడదు ఆతడు పంచాయతీ తీర్మానములను అమలుపరచును పంచాయతీ ఉద్యోగులు, నౌకర్లపై అధికారముకలిగియుండును

ఏ ప్రెసిడెంటు, సభ్యుడు, కార్యనిర్వాహకాధికారియైనను, పంచాయతీకి ప్రత్యక్షముగ నష్టము కలిగించినచో, అట్టి నష్టమునకాతడు బాధ్యుడైయుండును స్థానికశాఖాడైరెక్టర్ అనుమతితో ఆ పంచాయతీ ఆతనిపై నష్టపరిహారమునకై వ్యాజ్యము వేయవచ్చును

ప్రతి పంచాయతీయును తన ఆదాయవ్యయములను ముందుగనే అంచనా (Budget) వేసి, ప్రభుత్వమునకు బంపి, ప్రభుత్వామోదమును బడయవలెను ఇదేరీతిగా, సంవత్సరాంతమున ప్రతి పంచాయతీయు తన పరిపాలన గురించి ప్రభుత్వమునకొక నివేదికను (Administration Report) పంపవలెను ఈ రెండు పనులను నెరవేర్పజాలనిచో పంచాయతీ బోర్డే రద్దయిపోవును

పంచాయతీ వ్యవహారములను స్థానికబోర్డుల డైరెక్టర్, ఆతని అనుయాయులు తనిఖీచేయుదురు జిల్లా కలెక్టరుగూడ పంచాయతీ పనులను తనిఖీచేయవచ్చును ప్రభుత్వ ఆడిటర్లు పంచాయతీ లెక్కలను తనిఖీ చేయుదురు

ఏ ప్రెసిడెంటు, వైస్‌ప్రెసిడెంటు, సభ్యునినైనను, ఆతని విధులలో యెట్టి దుర్నడతయైన నున్నచో, డైరెక్టర్ గారు ఆతని తొలగించవచ్చును పంచాయతీ తీర్మానములను ఆపుదలచేయవచ్చును, లేక రద్దుచేయవచ్చును పంచాయతీలను రద్దుచేసి, పునర్నిర్మించుటకు రాష్ట్ర ప్రభుత్వమున కధికారముండును

(16) చేపలు పట్టుటవల్ల ఆదాయము
(17) గ్రామ సేవల రుసుములు
(18) గనుల రుసుములు
(19) పోరంబోకులు, గుత్తలనుండి ఆదాయము
(20) స్థానిక జరిమానాలో 9/10 వంతు
(21) గవర్నమెంటు గ్రాంట్లు
(22) ఇతర పంచాయతీ రుసుములు

ఈ ఆదాయము నింకను పెంచుటకు ప్రయత్నములు జరుగుచున్నవి

## పంచాయతీ కోర్టులు

1889-90 పంచాయతీ కోర్టు చట్టము ననుసరించి ప్రభుత్వమీ కోర్టుల నేర్పరచవచ్చును గ్రామమందలి వయోజనులందరు ఇందు వోటర్లు వీరు తమ కోర్టు అధ్యక్షుని, సభ్యులను, బహిరంగముగ నెన్నుకొందురు ప్రతి పంచాయతీ కోర్టును యేబది రూప్యములకు మించని సివిల్ దావాలను పరిష్కరించవచ్చును ఉభయపార్టీల సమ్మతితో రు 200 ల దావాలను వీరు విచారించవచ్చును పంచాయతీకోర్టు లేనిచోట్ల గ్రామమునసబే యీ అధికారములను చెలాయించును చిన్నచిన్న క్రిమినల్ తగాదాలను పరిష్కరించుటకును వీరికి అధికారముండును ఇప్పటి న్యాయపరిపాలన జహు వ్యయ ప్రయాసలతోను, ఆలస్యములతోను, కొంతవరకు అబద్ధపు సాక్ష్యములతోను గూడియుండి, గ్రామీణులకు అందుబాటులో లేనందున యీ గ్రామ న్యాయస్థానములను అభివృద్ధి చేయవలెనని పలువురు ఆశించుచున్నారు 1950 గ్రామపంచాయతీ చట్టము ననుసరించి ఈ న్యాయాధికారమును గ్రామపంచాయతి బోర్డులకు వప్పజెప్పవచ్చును కాని గ్రామీణ న్యాయపాలనలో ముఖ్యమగు మార్పులు యింకను జరుగవలసియున్నవి అప్పుడుకాని ఈ కోర్టులు ప్రజానురంజకముగ నుండజాలవు

# 13. పట్టణ మునిసిపాలిటీలు

'మునిసిపల్" (Municpal) అనగా ఒక పట్టణమునకు లేక నగరమునకు సంధించిన స్వపరిపాలనాధికారము ప్రస్తుత భారతీయ పురపాలన బ్రిటన్ నందలి 'బరో' (Borough) కౌన్సిళ్ళ పాలనను కొంతవరకు అనుసరించుచున్నది

పూర్వకాలమునుండియు ఇచ్చట పురపాలన యెటులనుండెనో కౌటిల్యుడు, మెగస్తనీస్ పాహియాన్, హుయన్‌త్సాంగ్ మున్నగువారు వర్ణించిరి అంతకుముందు సిందునాగరికతలో విశాలమగు వీధులు, చక్కని స్నానవటికలు, గొప్ప సౌధములుగల నగరములుండెననుటకు మహెంజోదారో, హరప్పాలే సాక్షి

మౌర్యులకాలమందు పాటలీపుత్రము చుట్టును దారుప్రాకారములు లోతైన కందకములు, 570 బురుజులు, 64 ద్వారములుండెడివని మెగస్తనీస్ వర్ణించెను తోటలు, ఉద్యానవనములు, సువర్ణ రత్నమయ సౌధములు మద్దులుగలుగుచుండెడివి పురపాలనకు ముప్పదిమంది సభ్యులతో కూడిన సంఘముండెడిది ఈ సంఘసభ్యులు (1) పట్టణమందలి కళాభివృద్ధి (2) విదేశయాత్రీకుల సౌకర్యములు, (3) జననమరణ లెక్కలు, (4) వర్తకవ్యవహారములు, (5) వర్తకుల ఆదాయమునుండి 10% పన్ను వసూలుచేయుట, (6) రేవులు, అంగడి కట్టడముల పన్నులకును ఆరు పంచాయతీలుగ వ్యవహరించెడివారు ఈ సంఘమునకు పోలీసు అధికారము లుండెడివి ప్రతినగరమందును నాగరకుడను అధికారియుండెను సామ్రాజ్యమందలి వివిధ నగరములన్నియు ఒకేపద్ధతిపై ఏర్పడి, ప్రతిపట్టణమందును విశాలమగు వీధులు నివాసస్థలములు, జలాధారము లుండెడివి వీధులను శుభ్రపరచుట, అగ్ని వరద బాధనుండి ప్రజలను రక్షించుట, విదేశీయులను సన్మానించుట,దుర్మార్గులను ఒంధించుట, నాగరకునివిధులు

బ్రిటిష్ శకమందు పాలకులకు పాలితులకు హెచ్చుసంబంధము లేకుండుటచే దేశపాలనలో వారు యిచ్చటి పెద్దల సహాయమును కోరుట సహజము ఇందుకై కొంపెని ఉద్యోగులు ఉన్నతోద్యోగులతో మునిసిపల్ సంఘములు స్థాపించుటకు సాధకమైనవి

మనరాష్ట్రమం దిప్పుడమలులోనున్న మునిసిపల్ చట్టము 1920 జిల్లా మునిసిపల్ చట్టము అవసరమునుబట్టి దరిమిలా యీ చట్టము పలుమార్లు సవరింపబడినది తిరిగి యిప్పుడి చట్టమును కొన్ని ముఖ్య విషయములలో సంస్కరింప యత్నములు జరుగుచున్నవి మన రాష్ట్రములో ఇప్పుడు దాదాపు 60 మునిసిపాలిటీలున్నవి పట్టణము లభివృద్ధి జెందుచున్న కొలది వీనిసంఖ్య క్రమముగా హెచ్చుచున్నది

ఒక మునిసిపాలిటీయొక్క ముఖ్యోద్దేశ్య మేమనగా-ఒక నిర్ణీత ప్రదేశమందలి ప్రజలు తమ స్థానికపాలనకై ఒక ప్రత్యేక సంఘమును నెలకొల్పి, ఆ సంఘముద్వారా అచ్చటి ప్రజాప్రతినిధులు కొన్ని పన్నులు వసూలుచేసుకొని వ్యయపరచుచు, ఆ ప్రాంతీయ పాలనను సాగించుచు, ప్రజలకు స్వపరిపాలనా సూత్రములను గరపుట

ఈ సంఘములు వాటి జనాభా, ఆదాయములనుబట్టి నాలుగు తరగతులుగ విభజింపబడును విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం, కాకినాడ మునిసిపాలిటీలు వాటి ప్రాముఖ్యతచేత యొక ప్రత్యేక తరగతిగ యెంచబడుచున్నవి వీటిలో 16 నుండి 36 వరకు సభ్యులుందురు వీరందరు యెన్నికసభ్యులే అల్పసంఖ్యాక వర్గములకు ప్రత్యేకస్థానము లుండును వీరి ఉద్యోగపరిమితి అయిదేండ్లు వయోజన వోటింగు పద్ధతిని వీ రెన్నికయగుదురు ప్రతిమునిసిపల్ సంఘమున కొక ఛైర్మన్, వైస్‌ఛైర్మన్లుందురు వీరిని కౌన్సిల్ సభ్యులే యెన్నుకొందురు కమీషనరు హెల్తుఆఫీసరు, ఇంజనీర్లు ఇందలి ప్రధానోద్యోగులు వీరందరు ప్రభుత్వోద్యోగులే ఈ ఉద్యోగులను యే కౌన్సిలైనను 2/3 మెజారిటీతో బదిలీచేయమని కోరవచ్చును ఛైర్మన్ వైస్‌ఛైర్మన్లను కౌన్సిలుసభవారు విశ్వాసరాహిత్య తీర్మానము (No Confidence motion) చే పదభ్రష్టుల జేయవచ్చును వీరిని తొలగించుట ప్రభుత్వమునకును అధికారముండును

కౌన్సిల సభలు నెలకొక్కటియైనను జరుగవలెను సాధారణ సభలకు మూడు రోజుల నోటీసు అవసరము వీటి నియుక్తసంఖ్య (Quorum) మూడవవంతు సాధారణముగ యీ సభలన్నియు బహిరంగముగ జరుగును కాని రహస్య సమావేశములు గూడ నావ

కాశముండును జిల్లా కలెక్టరు, మునిసిపల్ డైరెక్టరు, రాష్ట్ర ప్రభుత్వము, కౌన్సిలు చర్యలపై అజమాయిషీ చేయుదురు ప్రభుత్వ ఆడిటర్లు మునిసిపల్ లెక్కలను తనిఖీ చేయుదురు మున్సిపల్ కౌన్సిళ్లు ధనము, విద్య, ఆరోగ్యము మున్నగు విషయముల గూర్చి కమిటీలను ఏర్పరచుకొనవచ్చును ఏ కౌన్సిలైనను తన అధికారముల నతిక్రమించుట లేక దుర్వినియోగపరచుట చేసినచో, ఆ కౌన్సిలును ప్రభుత్వము రద్దుపరచవచ్చును

పట్టణమందలి రోడ్లు, దీపములు, గృహనిర్మాణము, మురుగు కాలువలు పాయిఖానా దొడ్లు మార్కెట్లు, బస్సుదొడ్లు, కబేళాలు, జనన మరణ లెక్కలు, ఆయుర్వేదాస్పత్రిలు, ప్రాథమిక పాఠశాలలు, పార్కులు లైబ్రరీలు మున్నగుపనులు చేయించుటకు వీరి కధికారముండును పట్టణాభివృద్ధికై ప్రభుత్వానుమతితో నగర నిర్మాణ పథకములను (Town Planning Schemes) వీరు అమలులోనికి తేవచ్చును మార్కెట్లు పాల కంపెనీలు, బస్సుకంపెనీలు, సూయేజి (Sewage) ఫారములు మున్నగు లాభసాటి పనులనుగూడ ఈ సంఘములు చేయవచ్చును

1 ఆస్తిపన్ను 2 వృత్తిపన్ను, 3 బండ్లపన్ను, 4 మోటారు పన్ను, 5 యాత్రీకుల పన్ను, 6 వినోదపు పన్నులను, మునిసిపాలిటీలు విధించవచ్చును ఆస్తిపన్ను మునిసిపాలిటీయందలి భూములపైనను యిండ్లపైనను విధింతురు సాలుకు రు 600 లకు మించిన ఆదాయము గలవారిపై వృత్తిపన్ను విధించబడును బండ్లు, సైకిళ్ళు, ఏనుగులు, ఒంటెలు మొదలగు జంతువులపైనను, సినిమాలు మొదలగు వినోదములపైనను ఈ కౌన్సిళ్లు పన్ను విధించవచ్చును ఫ్యాక్టరీలు, హోటళ్ళు, కాఫీహోటళ్ళు మున్నగువానిపై ప్రత్యేక లైసెన్సు రుసుములు విధించవచ్చును ఈ పన్నులతోపాటు దీపపుపన్ను, నీటిపన్ను లైబ్రరీపన్ను, విద్యాపన్ను, పాయిఖానా పన్నులు గూడ వీరు వసూలు చేయుదురు ప్రభుత్వము వీరికి కొన్ని అప్పులు, గ్రాంటుల నిచ్చును ఇటీవల కొన్ని పెద్ద మునిసిపాలిటీలు తాము ప్రత్యేకముగ ప్రజలనుండి అప్పులు సేకరించుకొనుటకు ప్రభుత్వము అనుమతించుచున్నది

మునిసిపల్ సంఘములు ప్రజోపయోగమున కెక్కుడుపయుక్తములైనను వీరిని యెన్నుకొను వోటర్లలో తగు పౌరభావము లేకుండుటయు, సభ్యులందలి స్వార్థపరత్వము, పార్టీకక్షలువల్ల యివి తగినంతగ ప్రజాసేవ చేయలేకున్నవి వీనికితోడు ప్రభుత్వమును వీని పనులలో హెచ్చు జోక్యము కలుగజేసుకొనుటచే యిందలి స్వపరిపాలన చాలవరకు మృగ్యమగుచున్నది

## — కార్పొరేషన్లు —

బొంబాయి, చెన్నపురి, కలకత్తాలందలి మునిసిపల్ సంఘములను కార్పొరేషను లందురు వీనిలో చెన్నపురి కార్పొరేషన్ 1668లో స్థాపితమైన మొదటి సంఘము 1726లో ఈ సంఘములు న్యాయాధికారముగల మేయర్ల కోర్టులుగ మార్చబడెను 1793లో వీటికి రోడ్లమరమ్మతు మున్నగు పనులు వప్పజెప్పబడినవి క్రమముగ వీటి న్యాయాధికారము పోయినను ఈ కార్పొరేషన్ అధ్యక్షుల నిప్పటికిని మేయర్లని (Mayor) అని పిలతురు మునిసిపల్ సంఘములకంటె ఈ కార్పొరేషన్లకు హెచ్చు అధికారములు ఆదాయములు, ఉండును వీటి కార్యాధికారులను కమీషనర్లు అందురు ఇప్పుడు ఇండియాలో పండ్రెండు కార్పొరేషనులున్నవి అందాంధ్రదేశమం దొక్కటియు లేదు. మన రాజధానియగు హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరముల కొకే మునిసిపల్ సంఘము పనిచేయుచున్నది

— —

# 14. జిల్లా పాలన

మన రాష్ట్రములో గ్రామమునకు పైన 10–15 గ్రామములకొక ఫర్కాయును, 100–150 గ్రామముల కొక తాలూకాయును, 10–12 తాలూకాలకొక జిల్లాయును కలవు ఇప్పుడిచ్చట మొత్తం 20 జిల్లా లున్నవి వీనిని పునర్నిర్మించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి

జిల్లా అధికారిని పూర్వము నాయకు డనెడివారు ఇప్పుడాతనిని కలెక్టరందురు ఈతని యధికారములు బహుళములు ఆతడు జిల్లాలో ముఖ్యారివిన్యూ అధికారి గ్రామములలోని పంటల అంచనాలు, రివిన్యూ రిమీషన్లకు ఆతడే అధికారి జిల్లాలోని శాంతి భద్రతలకును, స్థానిక సంస్థల అజమాయిషీ, క్రిమినల్ న్యాయపాలన, ఆబ్కారీశిస్తువసూళ్లు, ప్రభుత్వ బొక్కసము, కోర్టుస్టాంపులు పెన్షన్లు భూమిరికార్డులు, జైళ్లు, శరణాలయములు, క్షామసహాయము, చిన్ననీటివసతులు, మున్నగు పనులను ఆతడుచేయును రివిన్యూ అధికారములో యీతనిని జిల్లా కలెక్టరనియు, ఆబ్కారీశాఖలో ఆబ్కారీకలెక్టరనియు, న్యాయశాఖలో జిల్లా మెజిస్ట్రేటనియు, బొక్కసము విషయమై జిల్లా ట్రెజరీ ఆఫీసరనియుంలురు

రివిన్యూపాలనలోకలెక్టరకుసహాయులుగ సంయుక్త మేజిస్ట్రేట్లు, సహాయ కలెక్టర్లు తహసీల్దార్లు మున్నగు ఉద్యోగులుందురు న్యాయ పాలనలో యీతనికి తోడుగ అసిస్టెంటు మేజిస్ట్రేట్లు, సబ్ మేజిస్ట్రేట్లు, గౌరవ మేజిస్ట్రేట్లు నుందురు పోలీసుఅధికారులతో సహా యీతడు జిల్లా లోని శాంతిభద్రతలకు బాధ్యుడు ఇటీవల యేర్పడిన జిల్లాపరిషత్తు సంఘముల కీతడు అగ్రాసనాధిపతి (ఛైర్మన్)

బ్రిటిష్‌వారి అధికారముతోపాటు యిచ్చట ఐ సి యస్ అంత రించుట, మద్యనిషేధము, న్యాయశాఖావిభజన, స్థానిక సంస్థల వ్యాప్తులవల్ల జిల్లాకలెక్టరు రీవి కొంత తగ్గినను, ఆతని అధికారముల కింకను లోపములేదు

జిల్లా అధికారులలో కలెక్టరుకు బిమ్మట జిల్లాజడ్జి ముఖ్యుడు ఈతనిపై కలెక్టరుకు యెట్టిఅధికారమును ఉండదు ఈతడు హైకోర్టు అజమాయిషీక్రింద పనిచేయును ఈతనిక్రింద కొందరు సబ్ జడ్జీలు,

జిల్లా మునసబులు నుందురు కాని యీ 'జిల్లా' మునసబులు సాధారణముగ యిప్పుడు తాలూకా న్యాయాధికారులుగ మాత్రమే యున్నారు జిల్లాజడ్జీయును, కొందరు సబ్ జడ్జీలులు "శెషన్సు" అధికారము కలిగియుందురు "శెషన్సు" అధికారమనగా ఖూనీ కేసులు, బందిపోటులు మున్నగు పెద్దపెద్ద క్రిమినల్ నేరములను విచారించు అధికారము రివిన్యూ శాఖనుండి క్రిమినల్ న్యాయాధికారమును తొలగించి యీ న్యాయశాఖకు జేర్చుటచే ఈ శాఖ మునుపటికంటె హెచ్చు ప్రాముఖ్యత బడయగలదు

జిల్లాలోని పోలీసుశాఖకు డిప్యూటీ ఇన్స్పెక్టర్ జనరల్ పెద్ద ఆతనికి లోబడి జిల్లాపరింటెండెంటు (D S P) లు, జిల్లా సూపరింటెండెంటుకు లోబడి A S P, Dy S P లు, వీరికి సహాయముగ ఇన్స్పెక్టర్లు, సబ్ ఇన్స్పెక్టర్లు, సార్జెంట్లు హెడ్ కానిస్టేబిల్సు ఉందురు జిల్లాలోని శాంతిభద్రతలకై ఈ పోలీసు అధికారులు ఆయా మేజిస్ట్రేటుల ఆజ్ఞానుసారము వర్తించవలెను

నేరముల విచారణకై తాలూకాలోని కొన్ని గ్రామములనొక 'సర్కిలు'గ పరిగణింతురు ఈ సర్కిలుక్రింద కొన్ని స్టేషన్లుండును ఒక స్టేషనులో సాధారణముగా 10-12 గురు కానిస్టేబు లుందురు గ్రామాధికారులు వీరికి నేరముల ఆచోకీగురించి నివేదికలను పంపుచుందురు ఇట్లువచ్చు రిపోర్టులన్నియు సబ్ ఇన్స్పెక్టరు తన డైరీలో వ్రాసుకొని సారాంశమును జిల్లా అధికారులకు తెలుపును తన సర్కిలులో యేదైన నేరముగూర్చి ఎనవచ్చినతోడనే యాతడు వాకబు చేసి, దోషులను బంధించి, తనవద్దకువచ్చిన సాక్ష్యమునుబట్టి వ్యాజ్యములను సాగించును డిప్యూటిసూపరింటెండెట్లు సర్కిళ్ళపై అజమాయిషీ చేయుదురు రాష్ట్రమంతకు నొక పోలీసు ఇన్స్పెక్టర్ జనరల్ యును (I G), ఆతనికి సహాయులుగ కొందరు (D I G) లును ఉందురు సాధారణముగా సి ఐ డి విధులీపోలీసుశాఖకే చేరియుండును, కాని రైల్వేపోలీసుమాత్రము వేరు ఈ పోలీసుశాఖయంతయు అంతరంగికమంత్రి (Home Miniser) అనునొక మంత్రి యాజ్ఞానుసారము వ్యవహరించును రైల్వేపోలీసులో చాలభాగము కేంద్ర ప్రభుత్వమువారి యాజమాన్యమున వ్యవహరించును

జిల్లాలో యీ రివిన్యూ పోలీసు, న్యాయ శాఖలేగాక, పి డబ్ల్యు డి (P W D) ఆరోగ్యము, రిజిస్ట్రేషన్, వ్యవసాయము, విద్య కో-ఆపరేషన్, అడవులు, వ్యాపారపన్ను పరిశ్రమలు, లేబరు, రేవులు, మున్నగు శాఖలకు జెందిన ఉద్యోగులు పనిచేయుచుందురు ఈ శాఖలన్నిటికిని రివిన్యూ శాఖవారు తగు సహాయము చేయుచుందురు

ఇచ్చట పాలనలో జిల్లాఉద్యోగులు అయిదు వర్గములుగ నుందురు (1) ఐ ఎ ఎస్ లేక ఇండియన్ ఎడ్మినిస్ట్రేటివ్ సర్వీసు (I A S) జిల్లా కలెక్టరు, జిల్లాజడ్జీలలో కొందరు అసిస్టెంటు కలెక్టర్లు యీ శ్రేణివారు (2) రెండవవర్గము రాష్ట్ర సివిల్ సర్వీస్ (P C S) సబ్ జడ్జీలు డిప్యూటీకలెక్టర్లు, జిల్లామునసబులు, ఈ సర్వీసుకు జెందినవారు (3) మూడవర్గము, సబార్డినేట్ సివిల్ సర్వీసు, తలూకా తహసీల్దార్లు, సబ్ మేజిస్ట్రేట్లు యీ వర్గమునకు జెందినవారు (4) ఆఫీసు గుమస్తాలు, రివిన్యూ ఇనస్పెక్టర్లు మున్నగు చిన్న ఉద్యోగులు-నాల్గవ తరగతివారు (5) అటెండర్లు, జవానులు, మషాల్జీలు, ఆఖరితరగతివారు ఈ అయిదు వర్గములందును గ్రామసేవక వర్గము చేరదు

# 15 జిల్లా బోర్డులు

స్థానిక పాలనలో మన దేశమందు మొదటినుండియు గ్రామ, పట్టణములతోపాటు జిల్లా లేక మండలము ప్రముఖస్థాన మలంకరించుచు వచ్చెను వేదకాలములో గ్రామములు, విషయములు, జనపదములును, మనువుకాలమునాడు గ్రామ, దశగ్రామ, శతగ్రామ, సహస్రగ్రామముల గూర్చియు మనము చదువుదుము మౌర్యరాజ్యములో గ్రామిణులు, గోపులు, రజ్జుకులు, వారికిచెందిన వివిధ పంచాయతీలు నుండెడివి చాళుక్యపాలనలో గ్రామము, కుర్రము నాడు (జిల్లా) వలనాడు, మండలములును, వీటి మహాసభలును నుండెడివి బ్రిటిష్ శకములో యూనియన్ లేక పంచాయతీబోర్డులు, జిల్లా బోర్డులు ప్రాముఖ్యత బడసినవి ఇప్పుడు క్రొత్తగా గ్రామమునకును, తాలూకాకును నడుమ "బ్లాకు" లేర్పడినవి

1853 లో దక్షిణ ఆర్కాటుజిల్లా కలెక్టరు తన జిల్లాలో రోడ్ల కొరకై కొంతనిధి అవసరమని ప్రభుత్వమునకు సూచించెను ఆతని సలహా ననుసరించి యిందుకై భూమిశిస్తులో కొంతభాగము ప్రత్యేకించబడెను తదుపరి రేవులు, బళ్ళపన్ను, గడ్డిపన్ను చెట్ల ఆదాయము, బందెలదొడ్లు రహదారిబంగళాలవల్ల వచ్చిన ఆదాయమంతయు ఒక స్థానిక నిధిగ (Local Fund) ఏర్పరచిరి దరిమిలా గ్రామములలో విద్యాభివృద్ధికై యిండ్లపన్ను విధించబడెను క్రమముగ భూమిశిస్తునుండి లోకల్ సెస్సు రూపాయకు రెండణాలవరకు హెచ్చించిరి

1882 రిప్పన్ ప్రభువుయొక్క స్థానిక పరిపాలనా సూత్రము ననుసరించి మనరాజధానిలో 1884లో లోకల్ బోర్డు చట్టము శాసించబడెను దీనినిబట్టి ప్రతిగ్రామము లేక గ్రామసముదాయమున కొక యూనియన్ బోర్డు ఏర్పడెను వీటిపై తరువాత తాలూకాబోర్డులును వాటిపై జిల్లాబోర్డులును ఏర్పడెను ఈ సంస్థలలో అధికారుల సంఖ్య తగ్గించుటకును, అనధికారుల సంఖ్య వృద్ధిచేయుటకును వీటిపై అధికారమును క్రమముగ రాష్ట్రప్రభుత్వమే వెలాయించుట

కను, నిర్ణయించబడెను క్రమముగ చెరువులు, బావులు, మార్కెట్లు ఒళ్ళకొట్లు మున్నగు అధికారములు యీ సంస్థల కొసంగబడినవి

1919 ఇండియా ప్రభుత్వ చట్టానంతరము 1920 లో యిచ్చట మరియొక స్థానికబోర్డు చట్టమేర్పడినది 1930 చట్టము ననుసరించి తాలూకాబోర్డులు రద్దుచేయబడినవి

ఈ చట్టము ననుసరించి ఒక నిర్ణీతప్రాంతమున కొక ప్రాంతీయ బోర్డు ఉండును ఆబోర్డున కొక స్వత్వము, శాశ్వత పారంపర్య క్రమము సాముదాయకముద్ర కొన్ని ఆస్తిహక్కులు, అధికారము లుండును జిల్లాలోని రోడ్లు, ఆస్పత్రులు సత్రములు, మార్కెట్లు, ఒళ్ళకొట్లు నీటివసతులు రేవులు, ఆరోగ్యము, విద్య, మున్నగు పనులను యీబోర్డులు చేయవచ్చును మునిసిపాలిటీలపై వీటికి అధికారముండదు జిల్లాలోని ప్రాథమిక పాఠశాలలలో దాదాపు అన్నియును ఉన్నత పాఠశాలలలో చాలభాగమును యీ జిల్లాబోర్డుల ఆధీనమందే యున్నవి

జిల్లాలో ఏడాదికి 120 రోజులకు తక్కువగాకుండ నివసించుచు, ప్రభుత్వమునకుగాని స్థానికసంస్థలకుగాని పన్ను చెల్లించు స్త్రీ పురుషుల కందు వోటింగు అర్హత యుండును ప్రభుత్వ పెన్షనర్లు మాజీ మిలిటరీ ఉద్యోగులు యిందు వోటర్లగుదురు ప్రభుత్వోద్యోగులు తప్ప తక్కిన వోటర్లందరు బోర్డుసభ్యత్వమునకు నిలబడవచ్చును ప్రతిజిల్లాబోర్డులో 24గురికి తక్కువకానట్టియు 52కు మించనట్టియు సభ్యులుందురు బోర్డు సభ్యులు తమలో నుండి ఒక అధ్యక్షుని, ఒక ఉపాధ్యక్షుని యెన్నుకొందురు వారిపై విశ్వాసరాహిత్యము(Vote of No-Confidence) ప్రకటించి వారిని తొలగించవచ్చును సభ్యులు బోర్డు పరిపాలన గూర్చి అధ్యక్షునకు వ్రాయవచ్చును తీర్మానములు ప్రతిపాదించ వచ్చును వాటిపై వోటుచేయవచ్చును అధ్యక్షుని ప్రశ్నించవచ్చును సభాతీర్మానములపై తమ భిన్నాభిప్రాయమును (Minute of Dissent) ప్రభుత్వమునకు బంపవచ్చును

ఈ భిన్నాభిప్రాయము (Minute of Dissent) అనుపద్ధతి ఈ [illegible]
[illegible]

కొనుడు సభలోని అధిక సంఖ్యాకులు లా తీర్మానమునకు అనుకూలు రగుటచే ఆ తీర్మానము సభలో నెగ్గిపోవును కాని దీనికి వ్యతిరేకు లగువారిలో ఒకరుకాని, హెచ్చుమందికాని సభ్యులు తీర్మానానంత రము 48 గంటలలోగా తమ వ్యతిరేకభావ మొక "మినిట్" లేక విజ్ఞప్తిరూపమున తమ ప్రెసిడెంటు లేక ఛైర్మనుకు అందజేయుటకు హక్కుకలిగియుందురు అట్టి విజ్ఞప్తినే 'మినిట్ ఆఫ్ డిస్సెంటు" అందురు అట్టి భిన్నాభిప్రాయమును ఆ ప్రెసిడెంటు లేక ఛైర్మను తనకు చేరిన మూడురోజులలోగా తన అభిప్రాయముతో జిల్లాకలెక్ట రుకు పంపించును ఆ కలెక్టరు అందుపై విచారించి తన అభిప్రాయ ముతో దానిని రాష్ట్రప్రభుత్వమునకు బంపును అప్పుడు రాష్ట్రప్రభుత్వ మా తీర్మానము న్యాయసమ్మతముకాని, చట్టసమ్మతముకాని ప్రజా క్షేమమునకు అనుగుణ్యముకాని, కాదని తోచినచో ఆ బోర్డు లేక కౌన్సిలుకు అవకాశము నొసంగి, వారి సమాధానమును గైకొని, అల్పసంఖ్యాక సభ్యవాదము నంగీకరించి, మెజార్టీ తీర్మానమును రద్దుచేయవచ్చును అధికసంఖ్యాకులు న్యాయవిరుద్ధముగా గాని, నిరంకుశముగాగాని, సంచరించు సందర్భములలో యీ పద్ధతి న్యాయ రక్షణకు హేతుభూతమగుచున్నవి ఇట్టిపద్ధతి ఒక్క యీ స్థానిక సంస్థలలో మాత్రమే కలదు శాసనసభలో యీ పద్ధతి ఉండదు

జిల్లాబోర్డుసభలు రెండు నెలల కొకటి అయినను జరుగవలెను ప్రతిసభకు యేడురోజుల నోటీసు అవసరము మొత్తము సభ్యుల సంఖ్యలో కనీసము మూడవవంతైనను సభ్యులు హాజరుకావలెను వరుసగ మూడు సభలకు హాజరుకానివారు తమ సభ్యత్వమును కోలుపోవుదురు కాని కౌన్సిలనుమతితో రెండునాళ్లు వారి సభ్యత్వము పునరుద్ధరింపవచ్చును బోర్డుపరిపాలనా సౌకర్యమునకై సభ్యులు [illegible] వేర్పరచవచ్చును బోర్డు కాలపరిమితి సాధారణముగ మూడేండ్లు ♦

జిల్లాబోర్డు ఉద్యోగులలో ఇంజనీరు హెల్తుఆఫీసరు ముఖ్యులు వీనిని రాష్ట్రప్రభుత్వమే నియమించును

---

♦ మునిసిపల్ కౌన్సిలుసభలకు మూడురోజుల నోటీసు అవసరము జరూరు సమావేశ [illegible]

బోర్డు ఆదాయములో లోకల్ శెస్సులో కొంతభాగమును, లైసెన్సు రుసుములు, ప్రభుత్వగ్రాంటులు ముఖ్యములు వీరికి ప్రభుత్వము ఋణముల నిచ్చును వృత్తిపన్ను, వినోదములపన్ను, యాత్రీకులపన్ను, రేవులు, మార్కెట్లు మున్నగు రుసుములను వీరు వసూలు చేయవచ్చును స్కూళ్ళ గ్రాంటులు, జీతములు వీరి ఆదాయమును వృద్ధిపరచును జిల్లాబోర్డు రైళ్లున్నచోట వాటి ఆదాయము యీ బోర్డులకు లభించును ఉదా గుంటూరు ప్రభుత్వాజ్ఞలకు లోబడి వీరు తమ ఆదాయ వ్యయముల (Budget) నేర్పాటు జేసుకొందురు బోర్డు ధనము ప్రభుత్వ ట్రెజరీలో మాత్రమే నిల్వయుంచుకొనవలయును ప్రతిబోర్డును తన పరిపాలనా నివేదికను ప్రభుత్వమునకు అందజేయవలెను

జిల్లాబోర్డుపై ప్రభుత్వము పలువిధములగు అధికారములు చెలాయించును బడ్జెట్టును ప్రభుత్వము ముందుగ ఆమోదించవలెను జిల్లాకలెక్టరు సామిశెస్సు వసూలుచేసి బోర్డుకొసంగును కొన్ని పరిస్థితులలో ఆతడు బోర్డు తీర్మానములను తాత్కాలికముగ నిలుపుచేయవచ్చును రాష్ట్రప్రభుత్వము కొన్ని తీర్మానములను రద్దుచేయవచ్చును అధ్యక్షుని తొలగించుటకును, బోర్డును రద్దుచేసి పునర్నిర్మించుటకును ప్రభుత్వమున కధికారముండును ప్రభుత్వ ఆడిటర్లు యీ బోర్డు లెక్కలను తనిఖీచేయుదురు

ప్రస్తుతము ఆంధ్రప్రదేశమందలి జిల్లాలు (1) శ్రీకాకుళం, (2) విశాఖపట్టణం, (3) తూర్పుగోదావరి, (4) పశ్చిమగోదావరి (5) కృష్ణా, (6) గుంటూరు, (7) నెల్లూరు, (8) చిత్తూరు, (9) కడప, (10) అనంతపురం, (11) కర్నూలు, (12) మహబూబ్‌నగర్, (13) నల్లగొండ, (14) మెదకు, (15) ఖమ్మం, (16) వరంగల్, (17) హైదరాబాద్, (18) కరీంనగర్, (19) నిజామాబాద్, (20) అదిల్లాబాద్ ఇప్పుడీ జిల్లాలసంఖ్యను పెంచుటకు ఆలోచనలు జరుగుచున్నవి

జిల్లాపాలనలో దేశం మొత్తంమీదను, అందు ముఖ్యముగ మనరాష్ట్రమందును ప్రభుత్వము సంకల్పించిన యొక ముఖ్య సంస్కరణగూర్చి మనము తెలుసుకొనుట యవసరము

మన దేశములో చాలకాలమునుండి గ్రామమునకును, జిల్లాకును నడుమ తాలూకాలు ప్రధానస్థానము నలంకరించుచువచ్చినవి జిల్లాలో కలెక్టరుకు బిమ్మట తాలూకా తహసీల్దారే ప్రధానోద్యోగిగ బరిగణింపబడుచువచ్చెను రివిన్యూ వసూళ్ళకును, జమాబందీకిని, గ్రామోద్యోగుల సమీకరణమునకును యిప్పటికిని యీ తాలూకాలు ముఖ్యపాత్ర వహించుచున్నవి స్థానికపాలనలోగూడ ఆదినుండియు గ్రామపంచాయతీలకును, జిల్లాబోర్డులకును మధ్య వివిధ తాలూకాలలో తాలూకాబోర్డులు ఉండెడివి కాని 1930 సంవత్సరములో యీ తాలూకాబోర్డులు రద్దుచేయబడినవి దరిమిలా ఒక్క జిల్లాబోర్డులు మాత్రమే అమలులో నుండెను కాని ధనాభావముచేతను యితర కారణములవల్లను యీ జిల్లాబోర్డులు రానురాను అసమర్థములై, తమ విధ్యుక్తధర్మమును నెరవేర్పజాలనిస్థితికి వచ్చుటచేత వీనిని రద్దుపరచి, వీనిస్థానే జిల్లాపరిషత్తులను క్రొత్తసంస్థలను మన రాష్ట్రప్రభుత్వ మేర్పరచినది

ఈ మండల పరిషత్తులకు గ్రామములందలి గ్రామపంచాయతీలే పునాదులుగ నుండవలెననియు, తద్వారా జిల్లాలోని పరిపాలన, అభివృద్ధికార్యక్రమములన్నియు ప్రజాప్రతినిధులకె వప్పజెప్పబడవలయుననియు, తుదకు జిల్లాకలెక్టరు కూడ ఈ నూతన జిల్లాపరిషత్తునకు ప్రధాన కార్యనిర్వాహకోద్యోగిగ నుండవలెననియు, యీ నూతన విధానమును సంకల్పించిన శ్రీ బల్వంతరాయ్ మెహతా కమిటివారి ఆశయము ఆ విషయ మెట్లున్నను ఈ జిల్లా పరిషత్తులకు ప్రాథమికయూనిట్లుగ నుండుటకై అన్ని గ్రామములందును గ్రామపంచాయతీలను యేర్పరచిరి గ్రామపంచాయతీలకును, జిల్లాపషత్తుకను నడుమ "బ్లాకుపంచాయతీ సమితు" లను నూతన సంస్థలు నెలకొల్పబడినవి ఇందుకై ఒక జిల్లా వివిధ "బ్లాకు'లుగా విభజింపబడను ఈ బ్లాకులు మునుపటి తాలూకాలకంటె చిన్నవిగాను, ఫర్కాలకంటె పెద్దవిగను ఉండును ఉదాహరణకు- తూర్పు గోదావరి జిల్లాలో యిప్పుడు 10 తాలూకాలున్నవి ఇప్పుడి జిల్లాలో 33 "బ్లాకులు ఏర్పరచుచున్నారు

బ్లాకుసమితిలో ఆ ప్రాంతమందలి గ్రామపంచాయతీ ప్రెసిడెంట్లును, మరి అయిదుగురు నియమిత సభ్యులు నుందురు ఇట్టి నియ

మిత సభ్యులలో ఒక స్త్రీ, ఒక షెడ్యూలు తరగతి సభ్యుడు, ఒక పరపతి సంఘముల ప్రతినిధి, ఇద్దరు సంఘసేవకులు నుందురు బ్లాక్ అభివృద్ధి ఉద్యోగి (Block Development Officer) యీ సమితికి ముఖ్య కార్యకర్తగ నుండును సమితి సలహాల ననుసరించి యీ ఉద్యోగి సమితి కార్యము లన్నింటిని నిర్వర్తించును

సమితి ప్రాంతమందలి శాసన సభ్యులు సమితిసభలలో పాల్గొని, సమితి కార్యములగూర్చి సలహాల నొసంగవచ్చును కాని వోటింగ్ హక్కు ఉండదు ప్రతిసమితియు ఒక అధ్యక్షుని ఎన్నుకొనును

సమితిచేయు పనులు ప్రస్తుతము బ్లాకు అభివృద్ధి సంఘములు చేయుపనులు, బ్లాకు ప్రాంతములలో యెరువులు, విత్తనముల పంపకము (పరపతిసంఘములద్వారా), పశుసంపద, పశువుల ఆస్పత్రులు, సాంఘిక సంక్షేమము, పరపతి సంఘములవిషయమై ప్రభుత్వమునకు వలయు సలహాల నొసంగుట, విద్య, ప్రజారోగ్యము, లెఖలు, గ్రామీణ గృహనిర్మాణము, మంచినీటి సరఫరా, గృహపరిశ్రమలు, చిన్న నీటి వనరులు, విపత్సమయములలో ప్రజాసహాయము, ఆంధ్ర ప్రాంతమందు మద్యపాన నిషేధము, తెలంగాణములో మితపాన ప్రబోధము,మున్నగు పనులను యీ సమితులు చేయును

సమితి ఆదాయములు – బ్లాకు ప్రాంతములోని అభివృద్ధి ప్రణాళికలకు నిర్దేశించబడిన ప్రభుత్వధనములు, గ్రామపరిశ్రమలకై కేంద్ర, రాష్ట్రప్రభుత్వములొసంగుగ్రాంట్లు ప్రజలనుండి వచ్చెడి విరాళములు

———

# 16 స్థానిక పాలనకు హద్దులు

గ్రామపంచాయతీబోర్డులు, కోర్టులు, పట్టణ మునిసిపాలిటీలు, నగర కార్పొరేషన్లు, జిల్లాబోర్డులు, ముఖ్యమైన స్థానిక స్వపరిపాలనా సంస్థలని మనము పైన జదివితిమి ఈ సంస్థల ముఖ్యలక్షణము స్వపరిపాలన, అనగా వీటివ్యవహార నిర్వహణమందు విశేషముగ ప్రభుత్వోద్యోగుల జోక్యములేకుండ ప్రజాప్రతినిధులగు స్థానికసభ్యులే ఆగ్రామ, పట్టణ, నగర, జిల్లాలలోని రోడ్లు, దీపములు, నీటివసతులు, ఆరోగ్యము, ప్రాథమికవిద్య మున్నగు నియమితశాఖల పరిపాలనను సాగించుట

స్థానిక పాలనోద్దేశ్యములు ముఖ్యముగ రెండు (1) ప్రాంతీయ పనులను స్థానిక ప్రతినిధులే స్వంతముగ చేయించుకొనుట ఏ స్థలమందు ఏ యే పనులు ఎప్పుడెప్పుడు ఎటుల చేయించుకొనవలెనో, బయటి ఉద్యోగులకంటె స్థానిక ప్రజలకు, ప్రజానాయకులకు యెక్కుడుగ బోధపడును ఈ పనులలో స్థానికుల పరిచయలాభము, సామర్థ్యములను వినియోగించి, ఆయాపనులను శ్రద్ధగ, చౌకగ, సకాలములో చేయించుకొనుటకు వీలగును (2) ఇటులనే స్థానికపాలనలో ఆరితేరినవారు తమ పౌరధర్మములను, పరిపాలనా రీతులను చక్కగ గుర్తెరిగి, క్రమేణ రాష్ట్రవ్యవహారములందును, దేశవ్యవహారముల యందును యథోచితముగ పాల్గొనుటకు అర్హులైయుందురు ఈ రెండవభాగములో స్థానికసంస్థలను స్వపరిపాలనా శిక్షణాలయములని చెప్పుదుము

స్థానిక పాలనయొక్క ఉద్దేశ్యము లెట్టివైనను ఆచరణలో మాత్ర మీ సంస్థలపై ప్రభుత్వము, ప్రభుత్వాధికారులు పలువిధములగు అధికారములను చెలాయించుచున్నారు అందొక్క మునిసిపల్ పాలనలో యీ ప్రభుత్వాధికార మెటుల సాగుచున్నదో పరిశీలించినచో యీస్థానికస్వపరిపాలన యెంతవరకు సార్థకమగుచున్నదో మనము

తేలికగ గ్రహింపగలము ఇట్టి అధికారములనే గ్రామపంచాయతీలపై జిల్లాబోర్డులపైగూడ ప్రభుత్వము చెలాయించుచున్నది

1 అసలీ మునిసిపల్ సంస్థలే రాష్ట్రప్రభుత్వముయొక్క 1920 చట్టము ననుసరించి యేర్పడినవి ఆ చట్టమందలి అధికారములే యీ సంస్థల అధికారములు అందలి విధులనుకాని, నియమములనుకాని యే మునిసిపల్ సంఘమును ధిక్కరించరాదు ఏ పట్టణమందైనను మునిసిపాలిటీని స్థాపించు అధికారము, వార్డుల నియామకము, వాటిని మార్చు అధికారము, రాష్ట్రప్రభుత్వముదే

2 మునిసిపల్ కౌన్సిలు సభ్యులసంఖ్య, అందలి వివిధవర్గీయుల ప్రాతినిధ్యము, రాష్ట్రప్రభుత్వమే నిర్ణయించును రాష్ట్ర శాసనసభా వోటర్లే మునిసిపల్ వోటర్లు

3 మునిసిపల్ ఉద్యోగులలో కమీషనర్, హెల్తుఆపీసరు, ఇంజనీర్లు, ప్రభుత్వోద్యోగులు వీరిని రాష్ట్రప్రభుత్వమే నియమించును, బదిలీచేయును వీరిపై విశ్వాసములేదని కౌన్సిల్ సభ్యులలో 2-3వంతు తీర్మానించినచో కౌన్సిలు శిఫారసును ప్రభుత్వ మాలోచించును కమిషనరుకు శెలవిచ్చెడి అధికారమును రాష్ట్రప్రభుత్వముదే మునిసిపల్ ఉద్యోగుల సంఖ్య వారి జీతభత్యముల నిర్ణయము, శిక్షణల గూర్చి కౌన్సిలు తీర్పులపై అప్పీలు రాష్ట్రప్రభుత్వముది వీరిలో కొందరిని ప్రభుత్వ మొకచోటనుండి మరొకచోటుకు బదిలీ చేయవచ్చును

4 ప్రతి మునిసిపల్ కౌన్సిలు యేటేట తనఆదాయ వ్యయ పట్టికను (Budget) పరిపాలనా వేదికను (Administration Report), ప్రభుత్వమునకు బంపి వాని యామోదమును బడయవలెను అటుల చేయనిచో ప్రభుత్వము కౌన్సిలునే రద్దుచేయును

5 జిల్లా కలెక్టరు కౌన్సిలుపరిపాలనపై "రిమార్కులు" వ్రాయవచ్చును మునిసిపల్ ఆస్తి లేక పనులను వేటినైనను తనిఖీచేయవచ్చును రాష్ట్రప్రభుత్వముకాని, జిల్లా కలెక్టరుకాని యే మునిసిపల్ రికార్డునైనను పంపమని కోరవచ్చును కౌన్సిలుయొక్కగాని కమీషనరుయొక్కగాని విధులగూర్చి సలహాలీయవచ్చును కమీషనర్ చర్యలపై చెప్పు సమాధానమును కోరి ప్రభుత్వమునకు తెలుప

వచ్చును అత్యవసర సమయములందు కౌన్సిలు తీర్మానములను ఆతడు నిలుపుచేయవచ్చును కౌన్సిలుకాని కమీషనరుకాని చేయ నిరాకరించిన పనులను అత్యవసరసమయములందు కలెక్టరే చేయించి అందు కగు ఖర్చును మునిసిపల్ నిధినుండి వసూలు చేసుకొనవచ్చును

6 రాష్ట్రప్రభుత్వము కౌన్సిలుయొక్క యేతీర్మానమైనను చట్టవిరుద్ధముగాని, అధికారములకు మించిగాని, లేక ప్రజాక్షేమము నకుగాని ఆరోగ్యమునకుగాని, శాంతికిగాని, భంగకరమైనచో అందు గూర్చి కౌన్సిలుయొక్క సమాధానమునుకోరి, ఆ తీర్మానమును రద్దుచేయవచ్చును మునిసిపాలిటీకి అవసరమగు తనిఖీదారులను రాష్ట్రప్రభుత్వమే నియమించును కౌన్సిలుగాని, కమీషనరుగాని యేపనినైనను నిర్లక్ష్యముచేసినచో యింకొకరిచేత అపని చేయించి మునిసిపాలిటీనుండి ఆ సొమ్మును రాష్ట్రప్రభుత్వము వసూలు చేసు కొనవచ్చును ఛైర్మన్‌గాని వైస్ ఛైర్మన్‌గాని బుద్ధిపూర్వకముగ తన విధులనుగాని చట్టనిబంధనలనుగాని, ప్రభుత్వ ఉత్తరువులను గాని నెరవేర్ప నిరాకరించుటగాని, లేక తన అధికారమును దుర్వినియోగపరచుటగాని చేసినచో, రాష్ట్రప్రభుత్వ మాతని తొలగించ వచ్చును ఇటులనే యే కౌన్సిలైనను తన విధులను నెరవేర్చుటకు సామర్థ్యము లేనపుడుగాని, లేక తన విధులను అధికారములను అతిక్రమించినపుడుగాని లేక దుర్వినియోగపరచినప్పుడుగాని, రాష్ట్ర ప్రభుత్వ మా కౌన్సిలును రద్దుపరచి క్రొత్తకౌన్సిలును ఏర్పాటు చేయవచ్చును

7 మునిసిపల్ పన్నుల విధానము రేట్ల నిర్ణయము రాష్ట్ర ప్రభుత్వముపై ఆధారపడి యుండును మునిసిపాలిటీయొక్క పెద్దపను లన్నియు అనగా నీటి రిజర్వాయర్లు, పెద్దరోడ్లు, విద్యుద్దీపములు, మార్కెట్లనిర్మాణము మురుగుకాలువలు, నగరనిర్మాణము, అమలు జరుపుటకుముందు ప్రభుత్వసమ్మతి యవసరము మునిసిపల్ జమాఖర్చులు విద్యాలయములు, యితరపనులను ప్రభుత్వాధికారులే తనిఖీ చేయుదురు ప్రభుత్వానుమతిలేనిదే మునిసిపల్ మార్కెట్లు మూయ రాదు మునిసిపల్ పన్నులు [illegible], ఎట్టివో, ప్రభుత్వ మోదము [illegible] వలెను బాకీలు నిలువలను, [illegible] చేయు

పద్ధతి, వేలములు, దస్తావేజునమోనాలు, ప్లీడరుఖర్చులు, అన్నియు ప్రభుత్వమే నిర్ణయించును ముఖ్యనిబంధనలను ప్రభుత్వముచేయును ఇంకొక మునిసిపాలిటీతో వచ్చుతగవులను ప్రభుత్వమే పరిష్కరించును ఈ మునిసిపల్ పాలనలో రాష్ట్రమునిసిపల్ డైరెక్టరు దాదాపు అన్ని విషయములందును జోక్యము కలుగజేసుకొనుచు సర్వాధికారిగా నుండును ఆతని యాజ్ఞలను జవదాటుటకు ఏకౌన్సిలుకును సాధ్యము కాదు ఇటీవల రాష్ట్రప్రభుత్వమందలి స్థానిక శాఖామంత్రులును యీ సంస్థల పాలనలో కొంత జోక్యము కలుగజేసుకొనుచున్నారు మునిసిపల్ పన్నులను విధించుటకును, సవరించుటకును అయిదేండ్లకొకసారి ప్రభుత్వమే అంచనాదార్లను (Valuation Officers) పంపించును

8 స్థానిక సంస్థలలోని భిన్నాభిప్రాయము (Minute of Dissent) అను పద్ధతి స్వపరిపాలనా సూత్రమునకు విరుద్ధమైనది ఈ పద్ధతి ప్రకారము కౌన్సిల్ సభ్యులలో అల్పసంఖ్యాకులగు యేఒకరిద్దరైనను సభాతీర్మానమైన 48 గంటలలో ఛైర్మనుకు తమ భిన్నభావమును తెలుపవచ్చును ఆపిమ్మట మూడురోజులలోగా ఛైర్మను తన రిమార్కులతో ఆ పితూరీని కలెక్టరుకు పంపించును కలెక్టరు శిఫారసుపై రాష్ట్రప్రభుత్వము మెజారిటీఅభిప్రాయమును మన్నించుటయో లేక నిరాకరించుటయో చేయవచ్చును ఈ రీతిగా మెజారిటీ అభిప్రాయము రద్దగుటకు యీ 'డిసెంటుపద్ధతి" ఉపకరించుచున్నది

మొత్తముమీద పేరుకు స్వతంత్రాధికారమన్నను యీ సంస్థలపై పెత్తనమంతయు రాష్ట్రప్రభుత్వమునకే యుండును కొంతవరకు యిండరి ప్రజాప్రతినిధులకు పలుకుబడి, స్థానికాధికారము లభించుచున్నను, ఈ మునిసిపాలిటీలు రానురాను ప్రభుత్వాంగములై ప్రభుత్వశాఖలుగ మారిపోవుచున్నవి పూర్వము దీనిని స్థానిక స్వపరిపాలన (Local Self Government) యనెడివారు ఇప్పుడు దీనిని స్థానికపాలన యని మాత్రమే పిలుచుచున్నారు (Local Administration) బ్రిటిష్ ప్రభుత్వపురోజులలో యీ సంస్థలను అపనమ్మకముతో జూచినను, స్వతంత్రభారతమందు ప్రజాప్రతినిధుల కెక్కువ అధికారముల నొసంగుటకు సాధ్యకాకమున్నది

# 17 ఆస్తి విషయము (PROPERTY)

మనమింతవరకు పౌరశాస్త్ర మననేమియో, పౌరుడననేమియో, పౌరులెట్టుల సాంఘికజీవనమునకు గడంగుదురో కుటుంబము, తెగ, వర్ణము, మతము కులము, గ్రామము, పట్టణము, సమితి, జిల్లా మున్నగు సాంఘికవ్యవస్థల నెట్లు ఏర్పరచుకొందురో, పౌరహక్కులు విధులు, పౌరసత్వము పొందు విధములగూర్చియు చదువుకొనియున్నాము ఇక యీ సాంఘిక రూపములందు ముఖ్యమగు రాజ్యము, తదనుబంధమగు ప్రభుత్వములగూర్చి పఠించవలసియున్నది కాని ఆ రాజ్యపఠనమునకు గడంగుటకు పూర్వము ప్రతిదేశమందును, అన్ని కాలములందును, పౌరజీవితములో ప్రముఖపాత్రవహించి నేటికిని మానవుల మన ప్రాణములకు యెడతెగని లంకెగనున్న "ఆస్తి' విషయమై యించుక తెలుసుకొనుట యవసరము

మన మింతవరకు చదివిన హంశములలో ప్రతిపౌరునకు కొంత ఆస్తియుండుననియు, అట్టి ఆస్తిహక్కులను సంరక్షించుట ప్రభుత్వ విధి యనియు గ్రహించియున్నాము ఈ ఆస్తి ఒకవ్యక్తికేగాక, గ్రామ పంచాయతీలు, పట్టణ మునిసిపాలిటీలు జిల్లాపరిషత్తులు మున్నగు పౌర సంఘములకును చెందునని మనము చదివితిమి కేవల మీ సంస్థలకే గాక, ప్రపంచమందలి ప్రతి పౌరసంఘమునకును, రాజ్యమునకును, యీ ఆస్తులు, ఆస్తిహక్కులు, కొలదిగనో, గొప్పగనో యుండును

ఆస్తియనగా ఒకవ్యక్తి పౌరుడుగాని, లేక పౌరసంఘముగాని, తన సంపూర్ణ యాజమాన్యమునకుగాని, తాత్కాలిక అనుభవమునకుగాని హక్కుగలిగి, అనుభవించదగిన సొత్తు భూములు ఇళ్ళు, ధాన్యాగారములు, పశుసంపద వస్తువాహనములు, నగలు, బ్యాంకీ డిపోజిట్లు, ఇన్స్యూరెన్సుపట్టాలు గవర్నమెంటు బాండ్లు కంపెనీషేర్లు పేటెంటు హక్కులు కాపీరైట్లు మున్నగునవన్నియు ఆస్తులు

ప్రతిపౌరుడును ఈ ఆస్తులను పొందుటకు యేల ప్రయత్నించునో ఊహింప కష్టసాధ్యముకాదు ఎల్లరకు తినుటకుతిండి, కట్ట బట్ట నివసించుటకు యిల్లు కావలయును ఈ నిత్యావసరములతో పాటు అనేక యితర వాంఛలు అవసరములు జనించుచున్నవి ప్రజలు

వేటాడు రోజులలో వేటకొఱకు గొడ్డళ్ళు, గండ్రగొడ్డళ్లు, అవసరము వంటకు కుండలు, వంటచెరకు కావలెను వినోదములకు కొన్ని, అవసరవస్తువులు మరికొన్ని ఈరీతిగా పౌరుల కోరికలు పెరుగుచు వచ్చినవి మానవులతోపాటు మానవసంఘములును తమ ఆస్తులను పెంచుకొనుచున్నవి ఒక పాఠశాలకు కొంతభూమి, ఇల్లు, పుస్తకములు, బల్లలు, కుర్చీలు, వగైరా కావలెను ఒక అంగడికి తక్కెడ, రాళ్లు విక్రయపు సామానులు, అవి యుంచుకొనుటకు తగు వసతి, ధనము నిల్వచేసుకొనుటకు గళ్ళాపెట్టె లేక ఇనుపపెట్టె మున్నగునవి అవసరము స్త్రీలు అలంకార ప్రియులగుటచే వారికి ముఖ్యముగ బట్టలు, నగలె స్త్రీ ధనము కర్షకులకు పొలము, నాగలి, యెద్దు వ్యవసాయపు పనిముట్లు, పంటగిడ్డంగులు వగైరా అవసరము ఒక రాజ్యమునకు కోటలు, సేనలు, నౌకలు విమానములు, యుద్ధ సామగ్రి, కార్యాలయములు, ధనాగారములు అవసరము వీటి నన్నిటిని సంపాదించుట, అనుభవించుట, అనుభవించగా మిగిలిన వానిని తమ భావి అవసరములకో, లేక వారసులకో, భద్రపరచుట- ఇవి పౌరులు, పౌరసంఘములు చేయుపనులు ఇందు తమకంటె తమ "తదనంతరపు" వారి కొరకు ప్రజలుపడు తాపత్రయము హెచ్చుగనే యుండును

ఆస్తిహక్కులు రెండువిధములు (1) సంపూర్ణ యాజమాన్యము, (2) భుక్తము లేక తాత్కాలిక వినియోగము ఒక పొలము ఒకనికి చెందియుండవచ్చును దాని యజమాని అత డగును కాని అతనివల్ల మరొక ఆసామీ ఆ పొలమును కౌలుకు తీసికొని, కొన్ని షరతులపై కొంతకాలము ఆ పొలముయొక్క ఫలితమును అనుభవించును ఇటులనే ఒకయిల్లు యింకొకరికి అద్దెకీయవచ్చును ఆ సందర్భమందు ఆ యింటి యాజమాన్యము స్వంతదారునిది తాత్కాలికానుభవము అద్దెదారుది ఒకని కలమును మరొకనికి యెరువీయవచ్చును ఒకనిసొమ్ము మరియొకనికి అప్పీయవచ్చును

ఈ రెండు హక్కులను సంఘము గుర్తించి, ప్రభుత్వము రక్షించుట సామాన్యానుభవము

ఆస్తి మూడువిధములని శాస్త్రజ్ఞులు నిర్వచించియున్నారు (1) ఉమ్మడి (Common), (2) సమిష్టి (Collective), (3) వ్యష్టి (Individual)

ఇందు ఉమ్మడి ఆస్తిలో అందుకు సంబంధించిన పౌరు లందరకు సమానహక్కులుండును ఉదాహరణ గ్రామమందలి పచ్చిక బీళ్ళు, వీధులు, పోరంబోకులు, పబ్లిక్ చెరువులు, బావులు, పార్కులు రైళ్లు వగైరా

సమిష్టి ఆస్తియందు కొందరు వ్యక్తులు భాగస్వాములై (Share holders), అ వ్యక్తులమధ్య యేర్పడిన ఒడంబడిక షరతుల ననుసరించి దానియొక్క అనుభవము, లాభనష్టములు, ఆధారపడి యుండును ఉదాహరణ కంపెనీలు, పరపతిసంఘములు, బ్యాంకులు వగైరా

వ్యష్టి ఆస్తియందలి యాజమాన్యమంతయు ఒక్క పౌరుని యందో లేక ఆతని కుటుంబమందో యుండును

పౌరులు చిరకాలమునుండి ఆస్తి హక్కు లనుభవించుచు వచ్చిరి అట్టి ఆస్తికి వారసత్వపు హక్కులుండును కాలానుగుణ్యముగ యిటీవల యీ వ్యష్టి ఆస్తి సాంఘిక క్షేమమునకును, జాత్యభివృద్ధికిని భంగకరమను భావము ప్రబలుచున్నది దీనికి హేతువులను మనము గ్రహించుట అవసరము

(1) మనదేశమందును, ఇటలీ, ఫ్రాన్సు, ఇంగ్లాండు, రష్యా, మున్నగు దేశములలో మతాధికారులును, మతగురువులుగు వారును విశేష ఆస్తులను సంపాదించి, తద్వారా సామాన్యప్రజలపై విశేషాధికారమును సాగించి పీడించుట

(2) ప్రపంచమం దన్నిచోట్లను రాజులు, లేక బెరన్లు (Barons) తమ స్వాధీనమందలి భూమికంతకును యాజమాన్యము వహించి రైతులను, పాటకపుజనులను, తమ బానిసలుగ ఉపయోగించుకొని, వారి జీవితమును దుర్భర మొనర్చెడివారు

(3) ఈ యిడుములు చాలవోయనునటుల, గత రెండువందల యేండ్లనుండియు వెలసిన పారిశ్రామిక యుగమందు ధనికులకును,

పేదలకును తారతమ్య మతిశయించి, ధనికులు అతిధనికులై పేదలస్థితి దుర్భరస్థితికి వచ్చెను

ఈ పారిశ్రామిక వ్యవస్థలో కార్మికులకు గలిగిన మార్పులు గమనించదగినవి

ఒకానొక పరిశ్రమకు ముఖ్యముగ భూమి, ధనము, కార్మికులు, నిర్మాతలు కావలయును ఇందు 10 మంది పెట్టుబడిదార్లుకలసి పదిలక్షల రూపాయలతో నొక ఫ్యాక్టరీని నిర్మించి, అందు 10 వేలమంది కార్మికులకు స్థానమిత్తు రనుకొనుడు దానివల్ల సాలుకు 10 లక్షలు లాభము వచ్చినచో, పదిమంది పెట్టుబడిదార్లును 9 లక్షలకుపైగా లాభము పంచుకొనగా, పదివేలమంది కార్మికులకు ఒక లక్షరూప్యములైనను ముట్టకున్నవి అనగా ప్రతి పెట్టుబడిదారుడు (Capitalist) తొంభై వేలు లాభము గుంజుకొనగా, ఒక్కొక్క కార్మికునకు నూరురూకలైనను ముట్టుట కష్టసాధ్యమగుచున్నది ఈరీతిగ ఒకవైపు కొద్దిమంది కోటీశ్వరులును, రెండవతట్టు కూటికిచాలని 'మిల్లుచేతులు" (Mill hands) తయారగుచున్నారు ఇట్టి అసమానత్వము అమానుషమును, దుర్భరము జనకంటకమును అగుచున్నది

ఈ కారణములచే యిటీవల స్వంత ఆస్తిపై తిరుగుబాటు ఆరంభించి ప్రపంచమందలి ఆస్తులన్నియు ఉమ్మడి యాజమాన్యము నకు తేబడవలెను, వ్యక్తి అవసరములతోపాటు సాంఘిక క్షేమమున కనుగుణ్యముగ వీటిని అనుభవించవలె ననువాదన బయలుదేరెను దీనికి సోవియట్ రష్యా గురుపీఠ మలంకరించెను ఇటీవల చైనాలో గూడ యిట్టి ఉద్యమమే ప్రబలినది

ప్రస్తుత సంఘమందలి పేద, ధనిక అసమానత్వము, అందసంఖ్యాకమగు పేదజనుల దుర్భరపరిస్థితిని గుర్తించినచో యీ వాదనలో కొంతసత్యము లేకపోలేదని మనము గ్రహించగలుగుదుము ఏలయన, పదంతస్తులమేడలో పదిమంది ఒకవైపు నివసించుచుండగా పదివేలమంది సామాన్య జనమునకు నిలువనీడయైన నుండదు ధనిక వర్గముయొక్క ధనము లక్షలు, కోట్లుగ, బ్యాంకులలోబడి మూల్గుచుండగా పాటకప్రజకు కడుపునిండ కూడు, వంటినిండ బట్టకే కరు

వగు చున్నది ఈ ధనికుల ధనము కార్మికవర్గము చెమట యోడ్చి చేకూర్చబడినదే యనియు, మన మీసందర్భమున మరువ జనదు ఇట్టి స్వంత ఆస్తి పద్ధతికి మారుగ ఉమ్మడిఆస్తి యేర్పడినచో ఉన్నయిళ్ళను ప్రభుత్వము ప్రజలందరకు పంచియిచ్చును క్రొత్తగా కావలసిన యిండ్లను కట్టించును అటులనే బట్ట, తిండి, భూములు, పశువులు, మందులు, అన్నిటివిషయములందును—అని కొందరందురు

కాని ప్రయివేటు ఆస్తికి అనుగుణముగ నున్న హేతువులును బలవత్తరమైనవే (1) స్వంతఆస్తి - యిల్లు పొలము - ప్రతి పౌరునకు ముఖ్యావసరము వీనిని పొందవలెననుకోరిక పౌరులలో సహజమైనది సనాతనమైనది ఇట్టి కోరిక తుదకు పశు కీటకాదులలోకూడ కాననగును ఉదాహరణ - చీమలు పుట్టలుపెట్టుకొని, వర్షాకాలమునకు ఆహారమును కూడబెట్టుకొనును పక్షులు గూళ్ళు కట్టుకొనును (2) అట్టిఆస్తి ప్రతిపౌరునకు కొంతవరకు అవసరము తన నిత్య జీవనమునకును, భావి అవసరములకును పౌరునకు యీ ఆస్తి ఒక విధమగు భద్రత నొసంగును తమకేది కావలసినను, చీటికి మాటికిని, ఏతాలూకాకచేరీకో, సత్రముకో, ఆస్పత్రికో పరుగెత్తుట వ్యక్తిక్షేమమునకె భంగకరము రోగ సమయములందును, వృద్ధాప్యమునను, స్వంతఆస్తియెక్కుడు సహాయకారి కాగలదు (3) ఒకానొకయిల్లు లేక పొలము, ఒక పౌరుని స్వంతఆస్తి అయినచో దానిబాగు చేయించుట, సరియగు స్థితిలోనుంచుట ఆ పౌరుని బాధ్యతయగును ఆ పొలమునుండి హెచ్చుపంట పండించినచో ఆ లాభము తనకె దక్కుచున్నచో, ఆరైతుయొక్క శ్రమయు యినుమడించును ఉమ్మడి సత్రములు, ఉమ్మడిపొలములు, ఉమ్మడిగొడ్లవలె 'పుచ్చి చచ్చుటకు' అవకాశముండదు (4) స్వంత ఆస్తి పద్ధతివల్ల ఉత్పత్తి హెచ్చునియు, ప్రతిపౌరునకు తన నిత్యఅవసరములకు ప్రభుత్వముపై ఆధారపడవలవచ్చునో ప్రభుత్వము తన ముఖ్యవిధులను విడచిపెట్టి యీచిల్లర గృహకృత్యములతో కాలక్షేపము చేయవలసి వచ్చుననియు, అట్టి పనులభారమును యేప్రభుత్వమును హెచ్చుకాలము భరింపజాలదనియు, స్వంతఆస్తియుండవలెనను వారి వాదన

ఈ రెండువాదములలో సమన్వయసూత్రము నవలంబించి, వ్యక్తి స్వాతంత్ర్యమునకును సమష్టి క్షేమమునకును భంగములేని మార్గము నన్వేషించుటయే ఆధునికపౌర, రాజకీయ, ఆర్థిక శాస్త్రజ్ఞుల కర్తవ్యము ఏలయన, వ్యక్తులు క్షీణించిన సంఘము – సాంఘిక క్షేమమునకు హానికరమగు స్వంతఆస్తి వాక్కులు, ఈ రెండును నిరుపయోగములేగదా! అంతేకాక కొందరు ప్రజలలో ఆస్తిపై యిప్పుడున్న గాఢమమకారమును, గర్భదరిద్రుల దుర్భర దారిద్ర్యమును కొంతవరకు పోవలసినవే ఇందు నిర్ధనులు ధనవంతులు కాపలెనని మన స్వస్తివాక్యము చెప్పుచున్నది ధర్మము నాలుగు పాదముల నడువవలెనేగాని యిందేయొక్కకాలు కుంటుబడినను సంఘమునకు లోటే ఆయితీరును "అధనా స్సధనా స్సంతు

ఇందు విషయమై యిటీవల మన ప్రభుత్వము దేశములో "సోషలిస్టిక్ ' (Socialist c) పద్ధతి యను నొక సూత్రమును ప్రచురించి అమలులోనికి తెచ్చుటకు ప్రయత్నించుచున్నది ఈపద్ధతిలో వ్యక్తిలాభముకంటె సాంఘిక క్షేమమున కెక్కుడుప్రాముఖ్యత యొసంగబడును భూములు, ఫ్యాక్టరీలు, ఇతరఆస్తులు, ఆదాయము, వీటి అన్నిటిలో యీ సూత్రమునకే ప్రాముఖ్యత నొసంగి సంఘమందలి ఆర్థిక అసమానత్వమును సాధ్యమైనంతవరకు తగ్గించుటకు యత్నించుచున్నారు

ఈ సూత్రమున కనుగుణ్యముగ గత పదేండ్లలో యిచ్చట సంస్థానము లంతరించినవి మహారాజులు రాజులు, సామాన్యపౌరులైపోయిరి జమీందార్లు రూపు మాసిపోయినవి రైళ్ళన్నియు ప్రైవేటు కంపెనీల యాజమాన్యమునుండి ప్రభుత్వాధీనములైనవి రిజర్వుబ్యాంకి, ఇంపీరియల్ బ్యాంకి (ప్రస్తుత స్టేట్ బ్యాంకి), జీవిత భీమా (Life Insurance) కంపెనీలన్నియు జాతీయము చేయబడినవి (Nationalisation) పెద్దపెద్ద భూస్వాములనుండి 50–100 యకరములకు మించిన భూములన్నిటిని ప్రభుత్వమే వశపరచుకొని స్వంత భూములు లేని పేదరైతులకు పంచిపెట్టుటకు వివిధ రాష్ట్రములలో యేర్పాట్లు జరుగుచున్నవి కాని కేవల కమ్యూనిస్టు వ్యవస్థకును,

యీ సోషలిస్టు పద్ధతికిని ముఖ్యతేడా యేమనగా, యీ జమీందార్లు, కంపెనీలు, భూస్వాముల ఆస్తులను వశపరచుకొన్నపుడు ప్రభుత్వము వీరందరికి కొలదిగనో, గొప్పగనో, పరిహారము నొసంగును అట్టి పరిహారము లేకుండా బలవంతముగ యెట్టి ఆస్తులను స్వాధీనము చేసుకొనరాదని రాజ్యాంగ చట్టములోని 31వ సూత్రము శాసించుచున్నది ఈ రీతిగ ఆస్తులను స్వాధీనపరచుటవల్లనేగాక ధనికవర్గముపై హెచ్చు పన్నులను – ఆదాయపు పన్ను, ఆస్తిపన్ను, మరణ సుంకము (Estate Duty), వగైరా విధించి, ధనికుల గుంజువదల్చి, ప్రభుత్వ బొక్కసమునకు ధనమును సమకూర్చుచున్నారు ఇటులనే విమానమార్గములు, కొన్నిచోట్ల యోడమార్గములు, గనులు, తుదకు మోటారు సర్వీసులుకూడ క్రమముగ జాతీయ మొనర్పబడుచున్నవి ఇట్టి సమయమున

> "హరికి నర్థము ప్రాణ మర్పితంబుగనుండు
> వాని కైవల్య మెవ్వనికి లేదు!"

అను భాగవతవాక్యమే యెల్లరకు శరణ్యమని దోచును

# 18 రాజ్యము - రాజ్యవిధులు

## (The State and its Duties)

మానవుని సాంఘిక పరిణామములో రాజ్యము చాల ముఖ్యమైనది సంఘము (Society) రాజ్యము (State) కంటె విశాలమైనది (1) సంఘమందు కేవలము రాజ్యవిషయములేగాక ఆర్థిక, మత, విద్యాది విషయములును వుండును కేవల రాజభక్తి మాత్రమే ఒక మానవుని సాంఘిక విధులను సంపూర్ణమొనర్పజాలదు మానవత్వము పౌరసత్వముకంటె విశాలమైనది (2) సంఘజీవిత మైచ్ఛికమై, అందలి సభ్యుల అన్యోన్య సహకారము, ఆచారములపై ఆధారపడి యుండును కాని రాజకీయములు కచేరిలద్వారా, చట్టములద్వారా, నిబంధనలద్వారా వ్యవహరింపబడును (3) సంఘపాశములు చాల వరకు ప్రేమబంధములు రాజ్యశాసనములు తుదిమెట్టులో దండముపై ఆధారపడియుండును సంఘము ప్రేమించును, జాలిపడును, బ్రతిమాలును, తుదకు కన్నీరు కార్చును కాని రాజ్యము శాసించును, ప్రాణమును దీయును నైతికబలమే సాంఘికబలము దండము రాజ్యచిహ్నము (4) ఇట్లని ఈ రెండింటికిని విరుద్ధభావమెద్దియు నుండదు ఏలయన, రాజ్యము సంఘ సభ్యులకొరకె యేర్పడును సంఘసభ్యుల సమ్మతితోనే సాంఘిక నీతిని, క్షేమమును గుర్తెరిగి రాజ్యము నడుపవలెను ఇదేవిధముగ సాంఘిక ధర్మమునకు భంగము కలిగెడిచో రాజ్య దండమే దానిని పరిష్కరించును ఈ రెంటిని పరమావధి ఒక్కటే అదేమనగా, దేశక్షేమము, మానవాభ్యుదయము, ప్రపంచముక్తి

రాజ్యమనగా నేమి ?

రాజ్యమనగా కొందరు (హెచ్చుమంది) ప్రజలు ఒకే నిర్దుష్టస్థలమందు శాశ్వతనివాస మేర్పరచుకొని, సాధ్యమైనంతలో యితరుల జోక్యము లేకుండగనే ఒక కట్టుదిట్టమగు ప్రభుత్వమును కలిగియుండి

అందలి బహుసంఖ్యాకులగు ప్రజ లట్టి ప్రభుత్వాజ్ఞలను సర్వసాధారణముగ శిరసావహించు ప్రజాసముదాయము *

ఈ నిర్వచనమునుబట్టి ఒకరాజ్యమందీ క్రిందిహంశములు ముఖ్యముగ నుండవలెనని తేలుచున్నది

(1) రాజ్యమున కొక నిర్ణితమగు స్థల మవసరము దేశద్రిమ్మరులగు మూకప్రజ లొక రాజ్యము కాజాలరు ఏదోయొక ప్రాంతమందు వారు స్థిరనివాస మేర్పరచుకొని, యితరులు తమపై దండెత్తివచ్చినప్పుడు దానిని రక్షించుకొనగలిగినవారై యుండవలెను ఆ రాజ్యము పెద్దదా? చిన్నదా? అను విషయ మంత ముఖ్యముకాదు కాని ఆ దేశమందలి ప్రజాపోషణ కది సరిపడియుండుటయు అవసరమే

(2) ప్రజలులేనిదే యే దేశమును రాజ్యము కాజాలదు కావున దేశముతోపాటు ప్రజలును యుండవలెను

(3) వివిధ ప్రాంతములందు చెల్లాచెదురుగ నివసించు మూక గుంపు లొక రాజ్యము కాజాలవు అచ్చటి ప్రజ రాజకీయముగ ఒక ప్రభుత్వము నేర్పరచుకొనవలెను ఈ ప్రభుత్వమునకు వలయు అంగములు, ధనము, రక్షణసేనలును అవసరమే అట్టి ప్రభుత్వము వారిని తగురీతినడిపించి సంఘాభివృద్ధికి తోడ్పడుచుండవలెను ఆ ప్రభుత్వాజ్ఞలను వారు సర్వసాధారణముగ శిరసావహించుచుండవలెను

(4) అన్నిటికంటె ముఖ్యమైనది–అచ్చటి ప్రజలలో నొకరాజరిక భావము (Feeling of Sovereignty) అవసరము ప్రతిరాజ్యమందును ఈ రాజాధికారము కలిగియుండి, శాసనములు చేయుచు, వాని నమలుపరుచుటకు కొందరు అధికారులుందురు ఈ అధికారము

* 'The State says Ga ner is a community of persons more or less num ou permanently occupy ng a definite portion of territory ind pendent or nearly so of e ternal control and possessing an o gan sed Government to wh ch the great body of inhabitants rende hab tual obed ence

సంపూర్ణము, శాశ్వతము, నిరంకుశమైయుండును ఇతర రాజ్యము లీ అధికారముతో జోక్యము కలిగించుకొనజాలవు అన్ని సంఘములు, అందరువ్యక్తులు, యీ అధికారమును శిరసావహించవలసినదే ప్రతి పౌరుడును తన రాజ్యమందు విధిగా సభ్యుడుగ నుండును రాజ్యము తన రాజ్యాధికారమును యితర సంఘములకు పంచియిచ్చుటకు వీలు లేదు ఆ అధికారమును రాజ్యము విడిచిపెట్ట కూడదు రాజ్యమున్నంతవరకు రాజ్యాధికారము శాశ్వతముగ నుండును రాజ్యాధికారము పోయినచో రాజ్యమే అంతరించును కావున యీ రాజరిక భావమే రాజ్యమునకు ప్రాణమువంటిది

(5) రాజ్యమునకు పరపీడనలేని స్వాతంత్ర్యమును అవసరమే రాజ్యాధికార మెటుల చెలాయింప బడవలెనో రాజ్యాంగ చట్టము నిర్ణయించును ప్రజాభిప్రాయము, ప్రజాసమ్మతి, సంఘ సంప్రదాయములు, సాంఘిక గౌరవములు, కొంతవరకు యీ రాజ్యాధికారమునకు హద్దులుగ వర్తించును వీని నతిక్రమించినచో రాజ్యశాసనములే నిరర్థకమై పోవును

రాజ్యధర్మములు విధాయకములు (Essential), అవిధాయకములని (Unessential) రెండువిధములు (1) పరదేశములనుండి రాజ్యమును సంరక్షించుట, విదేశీయరాజ్యాంగ వ్యవహారములు, (2)ఆంతరంగిక శాంతిభద్రతలను కాపాడుట, (3) ఇందుకువలయు నైతిక, రక్షకబలములను సమకూర్చుట, (4) ప్రజాపాలన, పోషణ, (5) ప్రజా హక్కులు, ఆస్తులను సంరక్షించుట, రాజ్యముయొక్క నిత్యవిధులు

రాజ్యముయొక్క ఐచ్ఛిక విధులలో (1) దేశవర్తకము, పరిశ్రమలు, వాణిజ్యము, ఎగుమతి దిగుమతులు, ధనవిషయము, వర్తకపు లైసెన్సులు, మారకము వగైరాలు, (2) రైల్వేలు, ఓడలు, రహదారులు, (3) తంతి, తపాలా, టెలిఫోను, రేడియో, విద్యుచ్ఛక్తి, మున్నగుశాఖలు, (4) ఆరోగ్యము, వైద్యము, వ్యవసాయము, పర

షతి సంఘములు, అనాధశరణాలయములు, (5) విద్య, విద్యాసంస్థలు మున్నగు శాఖలుండును వీనిలో విద్యాశాఖ యిటీవల నిత్యవిధు లలో జేర్చుచున్నారు (6) నవీన రాజ్యములలో జాతీయప్లానింగు, అభివృద్ధి శాఖలును ఈ రాజ్యవిధులలో ముఖ్యపాత్రవహించుచున్నవి

---

# 19. ప్రభుత్వము - ప్రభుత్వవిధులు.

## (Government and its Functions)

ఒక రాజ్యముయొక్క నిత్య, నైమిత్తికవిధులను నిర్వహించుట కేర్పడిన సాధనమును ప్రభుత్వము లేక గవర్నమెంటు అందురు ఆ రాజ్యమందలి శాసనములుచేయుట, వానిని వ్యాఖ్యానించుటకు, అమలుపరచుటకు, యేర్పడిన యంత్రమే ప్రభుత్వము అట్టి ప్రభుత్వము లేనిదే రాజ్యము తనవిధులను నిర్వహింపజాలదు

ప్రభుత్వము పెక్కువిధులతో గూడియుండును (1) దేశమందలి శాంతిభద్రతలను కాపాడుట, (2) రాజ్యరక్షణ, (3) న్యాయపాలన, (4) విద్యాబోధన, (5) ప్రజల ఆర్థిక, సాంఘిక, నైతికాభివృద్ధి, (6) ప్రజలలో దేశభక్తిని పురికొల్పుట, (7) ప్రజాహక్కులను కాపాడుట, యీ ప్రభుత్వవిధులలో ముఖ్యమైనవి

(1) దేశమందలి అత్యాచారులు, దుండగీండ్రు, చోరులు, బందిపోటులు, హంతకులు మున్నగువారినుండి ప్రజలను కాపాడి, వారి మాన, ప్రాణ, ధనములను సంరక్షించుట ప్రభుత్వవిధులలో మొట్టమొదటిది ప్రతిసంఘమందును యిట్టి అత్యాచారులు కొందరుండుట సహజము వీరిసంఖ్య కొలదిగనున్నను వీరు ప్రజాజీవితమునకు కంటకులగుదురు గ్రామమందలి మొహతాదులు వెట్టీలు నగరపోలీసులు మున్నగువారిద్వారా యిట్టి దుండగీండ్రను కనిపెట్టి, పట్టుబడినవారిని బంధించి, శిక్షించి, వీరిని అదుపులోనుంచి, ప్రజలను కాపాడుట ప్రభుత్వముయొక్క విధి ప్రభుత్వమీపని చేయనిచో దేశమరాజకమువాలై ప్రభుత్వమే నశించిపోవును శాంతిభద్రతలవల్ల దేశమందు విద్య, వ్యవసాయము, వర్తకము, వాణిజ్యము లతిశయించి, ప్రజలైశ్వర్యవంతులై సుఖింతురు

(2) ప్రజలలో శాంతిభద్రత లెట్టివో పరదేశపీడననుండిరాజ్యమును సంరక్షించుటయు ప్రభుత్వమున కంత ముఖ్యవిధియే ఏలయన, అనాదినుండియు రాజులు తమలోతాము కలహించుకొని యుద్ధములు చేసుకొనుట పరిపాటి అయినది నేటికిని యెన్ని శాంతిసభలు జరుగు

చున్నను, యెచ్చటనో ఒకచోట యుద్ధములు జరుగుచునేయున్నవి మూడవ ప్రపంచయుద్ధ మెప్పుడువచ్చునో ? అని యెల్లరును భీతావహులై యున్నారు ఇతరులు మనపై దండెత్తి రాకుండుటకు మనకు సేనలవసరము గాన రాజ్యాంగమందు దండము (సేన) ప్రధానమైనది అందుచేతనే రాజనీతిని దండనీతి అని పిలుతురు పూర్వకాలమందీ దండ శాఖలో రథ, గజ, తురగ, పదాతులను చతురంగ బలము లుండెడివి నవీన యుద్ధశాఖలలో విమానములు, నౌకాదళము, ఆగ్నేయాస్త్రములు, శాల్బలములు ముఖ్యములు ఆటంబాంబ్, ఉదజని బాంబులు యిప్పుడన్నిటినిమించిన మారణయంత్రములైనవి కాని యీ బాంబులను యుద్ధరంగమునుండి నిషేధించుటకు యత్నములు జరుగుచున్నవి

(3) ప్రజలలో ప్రజకును, ప్రజకు ప్రభుత్వముకును, సంబంధించిన తగాదాలు, దావాలను నిష్పాక్షికముగ విచారించుటకు వలయు న్యాయస్థానములను ఏర్పాటుచేయుట ప్రభుత్వవిధి పూర్వకాలమందు గ్రామములో పంచాయతీపెద్దలును, దేశమందు రాజులును న్యాయవిచారణ జరిపించెడివారు ఇప్పుడు ప్రతిరాజ్యమందును గ్రామకోర్టులు మొదలు సుప్రీమ్‌కోర్టువరకు న్యాయస్థానములు కలవు రాజ్యచట్టములు, ధర్మశాస్త్రములు, కోర్టుతీర్పులు సదాచారము, సాంఘికనీతి, యీ న్యాయనిర్ణయమునకు ఆధారములు

(4) విద్యాశాఖ, లైబ్రరీలు, రేడియోలు, లలితకళలు, వయోజనవిద్య మున్నగువానిద్వారా ప్రజలలో విద్యాభివృద్ధికిని, విజ్ఞానాభివృద్ధికిని ప్రభుత్వము ప్రయత్నించవలెను ప్రాథమికవిద్య మొదలు యూనివర్సిటీల వరకు యిందుకు సంబంధించిన సంస్థలకు తోడ్పడుట ప్రభుత్వవిధి ఈరోజులలో రేడియోలు, వార్తాపత్రికలు, సినిమాలు కేవల ప్రభుత్వ ప్రచారమునకేగాక ప్రజా ప్రబోధమునకును ఉపకరించుచున్నవి వీనిని నీతియుతముగ అభ్యుదయ మార్గమున నడిపించుట ప్రభుత్వముయొక్క విధి

(5) దేశమందలి ఆర్థికసంపదను కాపాడి, ఐశ్వర్యమును వృద్ధిజేయుట ప్రభుత్వముయొక్క విధ్యుక్తధర్మము ఇందుకు వలయు

వ్యవసాయము వర్తకము, పరిశ్రమలు, నీటివసతులు, రహదార్లు, బ్యాంకులు, నాణెములు, ఓడలు, విమానములను నిర్మించి వీనిద్వారా దేశమందలి ప్రతివానికిని నిలువనీడ, తినకూడు, కట్ట బట్టలను సమకూర్చుచు, ప్రజల ఆరోగ్యమునకు, నైతిక సాంఘికాభివృద్ధులకు ప్రతి ప్రభుత్వము పాటుపడవలెను క్షామనివారణయు ప్రభుత్వ విధులలో నొక్కటియే

(6) ప్రజలలో దేశభక్తిని, రోషవేషములను, త్యాగశీలములను పెంపొందించుచు, చారులద్వారా రాజ్యరహస్యములను తెలుసుకొనుట, ఇతర దేశములలో రాయబారుల నేర్పరచి, పరరాజులతో సఖ్యము గావించి, సమయానుకూలముగ సంధిసమరములను సాగించుట, ప్రతి ప్రభుత్వమునకును ముఖ్యధర్మము

(7) నవీనముగ యేర్పడిన రాజ్యములలో ప్రజాహక్కులను కాపాడుచు, ప్రజలలో నిబిడీకృతమైయున్న జాతిశక్తులను బయటకు తీసి, జాతిజీవితమందలి అన్ని రంగము లందును అభ్యుదయమును, జాతివికాసమును పెంపొందించుటకై జాతీయ పథకము (National Plan) లను యేర్పరచి వానిని సాధించుటయు యిటీవల ప్రభుత్వ ధర్మములలో నొకటి యగుచున్నది ఇందుకొరకే ఆధునిక ప్రభుత్వములు పంచవర్ష ప్రణాళికలను, దశవర్ష ప్రణాళికలను అమలు జరుపుచుందురు

(8) యుద్ధ మేఘావృతమైన ఈ ప్రపంచములలో యుద్ధముల నరికట్టి, ప్రపంచములో శాంతిని సంరక్షించుటయు ప్రస్తుత ప్రభుత్వ విధులలో నొకటై యున్నది

ఈ మున్నగుపనులెల్ల ప్రతిప్రభుత్వమును, ప్రజాభ్యుదయమునకును, రాజ్యరక్షణకును, లోక శ్రేయస్సుకును యత్నించుచుండవలెను

— —

# 20 జాతీయ ప్రణాళిక

## (National Plan)

ఆధునిక రాజ్యములలో నవీనముగ స్వాతంత్ర్యము బడసిన ఇండియా, రష్యా, చైనా, మున్నగు దేశములలో జాతి పునరుద్ధరణకు వలయు నిర్మాణ పథకముల నేర్పరచి, తద్వారా జాత్యభ్యున్నతికి పాటుబడుట ఆయా ప్రభుత్వ భాధ్యతలలో నొకటియై యున్నది

జాతీయ ప్రణాళిక యనగా ఒక దేశమందలి జాత్యభివృద్ధికై యేర్పరచబడిన సాంఘిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిత పథకము కాని సాధారణముగా యిప్పటి జాతీయ ప్రణాళికలన్నియు ఎక్కుడుగ ఆర్థిక ప్రణాళికలే యగుచున్నవి గత 1951 నుండి యిచ్చట అమలులోనున్న జాతీయ ప్రణాళికలో వ్యవసాయము, పరిశ్రమలు, రోడ్లు, రైల్వేలు, విద్యుచ్ఛక్తి, నీటివనరులు, వీనిగూర్చియే హెచ్చుగ నుండును కాని యిచ్చటి మతము, ఆలయములు, కళలు, సారస్వతములగూర్చి విశేషముగా యిందు గానము తుదకు మన కెల్లరకు కావలసిన శారీరక శిక్షణగూర్చి కాని, రాజ్యరక్షణ కవలసరముగు సైనిక నిర్మాణముగూర్చి కాని యీ పథకమందు తావులేదు

కాని యే దేశమందైనను యీ జాతీయ ప్రణాళికలు యేల కావలెను? మన దేశ విషయమే తీసుకొన్నచో, యిచ్చట మనము గత యేడువందల యేండ్లుగ పరరాజ్య పీడనముల బొంది యిటీవలనే స్వాతంత్రము బడయ గలిగితిమి దీని పలితముగ మన దేశీయులు ఆహారము, బట్ట, గృహవసతి, విద్య, వైద్యము, కళలు, రోడ్లు, ఓడలు అన్ని విషయములందును చాల వెనుకబడిపోయిరి ఉదాహరణ 40 కోట్ల జనాభాగల మన దేశములో కెంద్రప్రభుత్వ మునకు ఆదాయము రు 1000 కోట్లు 5 కోట్లకు తక్కువజనాభాగల ఇంగ్లాండుకు సాలీనా రివిన్యూ ఆరువేలకోట్లు మనలో అక్షరాస్యత నూటికి పది కంట్రెండుపాళ్ళు ఇంగ్లాండులో నూటికి తొంబదియైదు ఇట్లనే మన ఆయుర్దాయము, ఆరోగ్యము, ప్రజల రాబడి మున్నగు అన్నివిషయములందును వ్యత్యాస మగుపడును

భారత జాతీయప్రణాళిక మొట్టమొదట 1951లో ప్రారంభించబడినది ప్రథమ పంచవర్ష ప్రణాళిక 1951నుండి 1956వరకు ఇచ్చట అమలులో నున్నది 1956 నుండి 1961 వరకు ద్వితీయ ప్రణాళిక అమలు జరుపబడెను 1961నుండి తృతీయ ప్రణాళిక యిప్పు డమలులో నున్నది

1951నుండియు ఇచ్చట అమలులో నున్న మూడు పంచవర్ష ప్రణాళికలకు సంబంధించిన వివరము లీదిగువ పట్టీనిబట్టి మనము గ్రహింపగలము

ఆదాయము (కోట్లలో)

| సంఖ్య | వివరణ | 1951–56 | 1956–61 | 1961–66 |
|---|---|---|---|---|
| 1 | రివిన్యూ కాతానుండి | 738 | 100 | 550 |
| 2 | రైల్వేల కాతా ,, | | | 100 |
| 3 | ప్రజలవల్ల ఋణములు | 520 | 780 | 800 |
| 4 | చిన్న సేవింగ్సు, ప్రావిడెంటు నిధులు వగైరా | | 630 | 1140 |
| 5 | అదనపు పన్నులు | | 1052 | 1710 |
| 6 | విదేశ సహాయము | [illegible] | 1090 | 2200 |
| 7 | ప్రభుత్వ వ్యాపారములలో మిగుళ్ళు | | | 450 |
| 8 | తరుగు బడ్జెట్లు | 850 | 948 | 550 |
| | మొత్తం | 2244 | 4600 | 7500 |

వ్యయము (కోట్లలో)

| సంఖ్య | వివరణ | 1951 56 | 19ɔ6-61 | 1961-66 |
| --- | --- | --- | --- | --- |
| 1 | వ్యవసాయ కార్యక్రమములు | 361 | 276 | 688 |
| 2 | సాముదాయకాభివృద్ధి, సహకారము | | 253 | 403 |
| 3 | విద్యుచ్ఛక్తి, ఇర్రిగేషన్ | 561 | 866 | 1680 |
| 4 | పరిశ్రమలు, గనులు | 173 | 107ɔ | 2146 |
| 5 | రోడ్లు, రహాదారీు, రైల్వేలు | 497 | 1300 | 1655 |
| 6 | సాంఘిక శాఖలు (విద్య, వైద్యము, నిమ్నజాతులు, సాంఘిక సంక్షేమమువగైరా | 600 | 730 | 1416 |
| 7 | ఇతర శాఖలు | 52 | 100 | 110 |
| | మొత్తం | 2244 | 4600 | 8098 |

ఈ ప్రణాళికా నిర్వహణమునకై యేర్పడిన ప్లానింగు నిర్మాణమునుగూర్చి మనము తెలుసుకొనుట అవసరము దేశమున కంతకు ఒక ప్లానింగుమంత్రి ఆతనిక సహాయులుగ నొక ప్లానింగ్ కమీషన్ యును, మరికొందరు సలహాదార్లును ఉందురు భారత ప్రధాని శ్రీ నెహూౄ యీప్లానింగు కమీషనుకు అధ్యక్షుడు

ప్రతి రాష్ట్రమందును యిట్టి ప్లానింగ్ శాఖామాత్యులును, వివిధ రాష్ట్రములలో రాష్ట్రప్లానింగ్ కమిటీలును యున్నవి రాష్ట్ర మందీ శాఖావ్యవహారములను చక్కదిద్దుటకై "డెవలప్‌మెంటు కమీషనర్' అను నొక ఉన్నతోద్యోగి యుండును

ప్రతి జిల్లాలోను జిల్లాపరిషత్తులును, బ్లాకసమితులు యీ ప్లానింగు పనులను చూచుచుందురు

ఈ పథక నిర్మాణమునందు క్రమముగ గ్రామపంచాయతీలు, మునిసిపల్ కౌన్సిళ్లు, బ్లాకుసమితులు, హెచ్చు బాధ్యత వహించవలెనని యిటీవల చాలమంది కోరుచున్నారు ఇటులనే పరపతి సంఘములును యీ ప్రణాళికా నిర్వాహణమందు ప్రముఖపాత్ర వహింపవలెనని వలువుర ఆశయము

ఈ ప్రణాళికలోని ముఖ్యలోపమేమనగా, ఇందులోచాలభాగము "అప్పుచేసి పప్పుకూడు అన్నట్లున్నది రెండవప్రణాళిక మొత్తం 4600 కోట్లలో రు800 కోట్లు మాత్రమే ప్రభుత్వ రెవిన్యూనుండి వచ్చు చున్నది మిగిలిన 3800 కోట్లు ఋణములో, తరుగులో, విదేశసహాయ ధనమోఅయియున్నది ఈ ఋణములు వీటిపై యేటేట పెరుగు వడ్డీ పైకమంతయు మనము తీర్చుకొనవలదా? ఎట్లు తీర్చెదము? ఎంతమంది అప్పు నొసంగగలరు? ఇందుకు మారుగ యిచ్చట ప్రజలనుండి ఐచ్ఛికముగ నొక జాతీయనిర్మాణనిధిని నెలకొల్పినచో యింతకంటె యెక్కుడుపయుక్తముగ నుండెడిదని తోచును 1965 నాటికి యీ ఋణము దాదాపు 5 వేల కోట్లుండునని అంచనా వేయబడినది

ఏది యెట్లున్నను, ఈ ప్రణాళికలవిజయముపై భావిభారతాభ్యు దయమంతయు ఆధారపడి యుండుననుట నిస్సంశయము ప్రపంచ దేశములును యీ ప్రణాళికల నిర్వాహణమును, ఫలితములను శ్రద్ధగ బరిశీలించుచున్నవి

———

# 21. ప్రభుత్వాంగములు

## (Government & its Organs)

మానవునకు శరీరాంగము లెటులో ప్రభుత్వమునకు అవయవము లట్లే యుండును

ఈ రాజ్యాంగ విభజనలో మన పూర్వులకును ఆధునికులకును కొంత తారతమ్య మున్నది ఉదాహరణ మనువు రాజ్యాంగమును సప్తాంగమని వర్ణించెను

శ్లో॥ స్వామ్యమాత్యౌ పురం రాష్ట్రం కోశదండౌ సుహృత్తథా ।
సప్తప్రకృతయో హ్యేతాః సప్తాంగమ్ రాజ్య ముచ్యతే ॥

అనగా స్వామి లేక రాజు, మంత్రులు, కోట, జనపదము, కోశము, సేన, మిత్రులు—ఈయేడు ప్రకృతులును రాజ్యభాగములు ఈ విభాగమునే యితర భారత రాజకీయవేత్తలు నంగీకరించిరి ఇందు ఆఖరి వానికంటె మొదటివి క్రమముగ ముఖ్యమైనవని మనువు చెప్పెను

కాని పాశ్చాత్య విధానములో ప్రభుత్వాంగములు మూడు (1) శాసనసభ (Legislature) (2) కార్యవర్గము (Executive), (3) న్యాయస్థానములు (Judiciary) వీటిలో శాసనసభలకు అన్నిటి కంటె హెచ్చు ప్రాముఖ్య మొసంగబడుచున్నది వీనిద్వారా ప్రజాభిప్రాయము ప్రకటితమగును దీని ప్రధానకర్తవ్యము శాసనములు చేయుట, సవరించుట ఈశాసనముల నమలుపరచునది కార్యవర్గము అవసరమగునపుడు వీనికి వ్యాఖ్యానమొనర్చి, యిందలి సంశయములను సరిదిద్ది, దేశములో న్యాయపాలన సాగించునది జూడిషరీ ఈ విధానమునే పార్లమెంటరీ విధానమందురు పార్లమెంటరీ ప్రభుత్వములో కార్యవర్గము శాసనసభకు బాధ్యతవహించును అట్టి ప్రభుత్వమును బాధ్యతాయుత ప్రభుత్వ (Responsible Government) మందురు ఈ శాసనసభలు ప్రజాభీష్టముచే ప్రజలవల్లనే యెన్నుకొనబడును గావున యిట్టి కార్యవర్గమును ప్రతినిధి ప్రభుత్వము (Representative Government) అనియు పిలువవచ్చును

శాసనసభలు ఒకటి కాని రెండు కాని యుండవచ్చును ఇంగ్లాండు, అమెరికా (U S A) మున్నగు పెద్దరాజ్యములలో రెండు శాసనసభ లుండును ఢిల్లీపార్లమెంటులో రాజ్యసభ (Council of States), లోకసభ (House of the People) అను రెండు సభలు కలవు చెన్నపురి, యు పి మున్నగు పెద్దరాష్ట్రములలో రెండేసి శాసనసభ లున్నవి – లెజిస్లేటివ్ ఎసెంబ్లీ, కౌన్సిల్ అస్సామ్, ఒరిస్సా మున్నగు చిన్నరాష్ట్రములందు ఒకేసభ యుండును–ఎసెంబ్లీ మన ఆంధ్రరాష్ట్రమందు ఎగువసభ యిటీవలనే యేర్పడినది ఇందు సామాన్యసభ యెక్కుడుగ ప్రజాప్రతినిధిసభగను, పెద్దలసభ ధనికులు, పండితులు భూస్వాములతోను గూడియుండును ఒకసభ యే విషయమందైనను తొందరపడి శాసించకుండునట్లు రెండవసభ వ్యవహరించ వలెనని యీ సభానిర్మాతల ఉద్దేశ్యము కాని పలుచోట్ల రాజులంతరించుటయు, ప్రజాప్రతినిధులే వలయు బాధ్యతతోను సామర్థ్యముతోను వ్యవహరించుచుండుటచే, యీ రెండవసభ అనవసరమను భావము ప్రబలుచున్నది ఇందుకు తార్కాణముగా రెండుసభలున్న చోట్ల ఎగువసభయొక్క అధికారములు క్రమముగ తగ్గించుచున్నారు ఉదాహరణ ఆర్థికగ్రాంటులు, మంత్రుల బాధ్యతకు ఎగువసభకు సంబంధము లేదు

ఈ రెండు సభలలో దిగువసభకు సాధారణముగ రెండు, మూడు లేక అయిదేండ్ల కొకతూరి యెన్నికలు జరుగును ఎగువ సభలు శాశ్వత సభలుగనుండి అప్పుడప్పుడు అందులో కొందరు సభ్యులు మాత్రము మారుటయో లేక నూతన సభ్యు లేర్పడుటయో జరుగును

లెజిస్లేచర్ విధులు ముఖ్యముగ మూడు 1 రాజ్యమున కవసరమగు శాసనములు (Acts) చేయుట అనవసరములగు శాసనములను రద్దుచేయుట, ఉన్న శాసనములలో వలయు మార్పులను (Amendments) చేయుట, 2 రాజ్యావసరములకై ప్రజలపై యెట్టి పన్నులు విధించవలెనో, వసూలైన ధనము నెట్లు వ్యయపరచవలెనో ఋణములు మున్నగు ఆర్థికాధికారములు కలిగియుండుట, 3 తమలోనుండి వొక కార్యవర్గము నేర్పరచి, యీ ధనవిషయము

నను, సైన్యవిషయమున, రాయబారవర్గములు, దేశపాలన, యుద్ధ ప్రకటన, సంధి జేసికొనుట మున్నగు అధికారముల ద్వారా రాజ్యము యొక్క స్వదేశీయ, విదేశీయ వ్యవహారములందా కార్యవర్గమును నడిపించుట ఈ మూడునుగాక ఇంగ్లాండులోని లార్డ్సు సభకు కొంత న్యాయాధికారమును గలదు

ప్రజలచే యెన్నుకొనబడిన శాసనసభలు చట్టములు చేయును వీనిని క్రమముగ అమలుపరచు బాధ్యత కార్యవర్గముది విశాల దృష్టితో జూచినచో, యీ కార్యశాఖలో గ్రామమందలి వెట్టివారు మొదలు కేంద్రాధ్యక్షుడు లేక చక్రవర్తి వరకు అందరు ప్రభుత్వో ద్యోగులునుందురు కాని సామాన్యముగ శాసనసభలకు బాధ్యులై వారి చిత్తానుసారము నడచుకొనవలసిన మంత్రివర్గమును మాత్రమే యీ కార్యవర్గము పేరుతో వ్యవహరించుచున్నారు ఇతర ఉద్యోగు లందరు మంత్రుల ఆజ్ఞానుసారము నడచుకొనుచు, ప్రభుత్వ శాశ్వతోద్యో గులై యుందురు మంత్రులు, శాసన సభలు మారునుగాని, కరణము, కలెక్టరులు ఖాయపు వుద్యోగులే మంత్రివర్గ శాసనసభల విధానమును వీరు శిరసావహింతురు

రాజ్యాధ్యక్షుడు శాసనసభా శాసనములను ఆమోదించుటయే గాక కొన్ని ప్రత్యేక శాసనాధికారములను గూడ కలిగియుండును అందుచే యాతడు శాసనసభలందొక భాగము ఆతడు మంత్రివర్గ మును నియమించును, పరిష్కరించును గాన కార్యవర్గమునందును ఆతడొకభాగమే యగును

మంత్రులు పరిపాలనము సాగింతురు, శాసన సభలను పిలిపింతురు, వాయిదా వేయింతురు, లేక రద్దుచేయింతురు చట్టములను ప్రతిపా దించుట చాలవరకు వీరి బాధ్యత తీవ్ర సమయములందు కార్యవర్గము అధ్యక్షునిచే ప్రత్యేక శాసనములను (Ordinances) జారీ చేయిం చును యుద్ధసమయములందు కార్యవర్గము చాల అధికారములను చెలాయించును శాసనసభా నిర్ణయములకు రాజ్యాధ్యక్షుని సమ్మతి యవసరము కొన్ని సందర్భములలో రాజ్యాధ్యక్షుడు శాసనసభా నిర్ణ యములను రద్దుచేయవచ్చును ఆతడు మంత్రులను నియమించును,

తొలగించును న్యాయపాలన విషయమై జడ్జీలను ఏర్పరచుటలో రాజ్యాధ్యక్షునకును, కార్యవర్గమునకును, కొంత అధికారముండును శిక్షాస్మృతి ననుసరించి దండించబడినవారిని క్షమించు అధికారము రాజ్యాధ్యక్షునిది ఈ విధముగ ఆంధ్రరాష్ట్రావతరణ సూచనగ మన రాష్ట్రమునందలి ఖైదీల నందరికిని మన ప్రభుత్వము విమోచన మొసంగెను మంత్రులు శాసన సభలకు బాధ్యులై, తద్వారా ప్రజల సమ్మతిని బడసి, ప్రజానురంజకముగ పరిపాలనను సాగించవలెను

ఈ ప్రభుత్వాంగములలో మూడవది న్యాయస్థానములు–జ్యూడిషరీ దేశాచారము, రాజ్యశాసనములనుబట్టి ప్రజాహక్కులను నిర్ణయించుట, దోషులను శిక్షించుట, శిష్టులను కాపాడుట, ప్రజల ఆస్తులను భద్రపరచుట, న్యాయపాలన జరిపించుట, వీరి కర్తవ్యము వీరు ప్రజలలో ప్రజకు ప్రజకు ప్రభుత్వమునకు మధ్య న్యాయపాలకులుగ నుందురు పార్లమెంటు శాసనములు, వీటపై వివిధ జడ్జీల తీర్పులు, ప్రజల ఆచారములు, ప్రపంచనీతి, వీటి ననుసరించి యీ న్యాయాధికారులు తమ తీర్పుల నొసంగుదురు ప్రజలలో పలువిధములగు తగాదాలు వచ్చుచుండును కావున యీ శాఖాధికారులు న్యాయమునస్కులై, శాస్త్రపారంగతులై, శాంతి, వివేకము, న్యాయబుద్ధి, నిదానము, మున్నగు సుగుణములు కలిగి, సత్యయుతముగను, నిష్పక్షపాతముగను వ్యవహరించుట అవసరము వీరి తీర్పులనుబట్టి దేశమందలి న్యాయపాలనయు రాజ్యశాసనములును యేర్పడును కావున వీరు బహు జాగరూకతతో ప్రవర్తించుచుండవలెను ఈ శాఖాధికారులను రాజకీయ పార్టీల దృష్టితో నియమించరాదు

---

# 22 అధికార విభజన

## (Separation of Functions)

పూర్వకాలమందు ప్రభుత్వాధికారములలో లెజిస్లేచర్, ఎగ్జిక్యూటివ్, జ్యూడిషరీలు మూడుశాఖలు ప్రత్యేకముగ కేటాయింపబడి యుండెడివి కావు ఉదాహరణ రాజే చాలచోట్ల న్యాయాధికారిగను, మంత్రులు శాసనకర్తలుగను ఉండెడివారు కాని ప్రజాప్రభుత్వములలో యీ అధికారములను యే ఒక్కని చేతిలో నుంచుట ప్రమాదకరమనియు, ప్రభుత్వాంగములలో అధికారములు సంపూర్ణముగ విభజించుట అవసరమనియు ఆధునికులు భావించుచున్నారు ఇట్టి విభజనను ప్రభుత్వశాఖలలో అధికార విభజన (Separation of functions) అందురు

ఈ అధికార విభజనకు ముఖ్య హేతువులు రెండు ఏ ఒక్క అధికారికైనను పెక్కు అధికారములున్నచో, అట్టి అధికారి మిక్కిలి బలిష్ఠుడై, ప్రజలను పీడించుటచే, ప్రభుత్వము నిరంకుశము కావచ్చును దీనివల్ల ప్రజాస్వాతంత్ర్యమునకు భంగము కలుగవచ్చును ఇంతేగాక నేటి ప్రభుత్వవిధానమంతయు అనేక శాఖలతో కూడియుండి, ప్రతిశాఖయందును విశేష ప్రజ్ఞావిశేషములు, ప్రత్యేక పరిజ్ఞానము, అనుభవము లవసరమగుటయు, ఇట్టి అధికార విభజనకు ముఖ్య హేతువగుచున్నది శాసనాధికారమునకు వలయు సాధన విశేషములు వేరు న్యాయాధికారికి వుండవలసిన గుణసంపత్తి వేరు అందుచేత శాసన సభ్యుడు న్యాయాధికారిగ నుండరాదు జడ్జీ శాసనసభలలో కాని, మంత్రివర్గములోకాని యుండకూడదు ఇటులనే మంత్రి న్యాయాధికారి కారాదు ఇట్టి విభజనవల్ల రాజ్యమందు పరిపాలన సమర్థముగ నుండి ప్రజాహక్కులు సురక్షితములై, నిరంకుశత్వము లకును, అన్యాయమునకును తావుండదని వీరి వాదన

మన దేశమందు కాంగ్రెసు నాయకులును, తదితరులును, గత డెబ్బది యేండ్లలో యిట్టి అధికార విభజన అవసరమని ఆందోళన చేయుచు వచ్చిరి ఇందుకు కారణము, లోగడ గవర్నర్ జనరల్ గ నుండిన వారెన్ హేస్టింగ్స్ బంగాళములో రివెన్యూ జూడిషల్

అధికారము లోకే జిల్లా కలెక్టర్లయం దుంచుటచే, నిష్పక్షపాతముగ విచారింపవలసిన మేజిస్ట్రేట్లు తమ రివిన్యూశాఖా పరిచయమును, పోలీసుల మొగమాటమును వినియోగించి, ముఖ్యముగ రాజకీయ కేసులలో అచ్చటచ్చట అన్యాయమన కొడిగట్టుట సామాన్యానుభవము అట్టితరి యీ రెవిన్యూ, న్యాయశాఖలు సంపూర్ణముగ విభజింపబడవలెనని మనవారి వాదన ఇందువిషయమై భారత రాజ్యాంగములో నొక ప్రత్యేక నిబంధ (50) స్థాపించబడుటయే గాక, మనరాష్ట్రమందును వరికొన్ని రాష్ట్రములందును యీ విధానము కొంతవరకు అమలులోనికికూడ తేబడుచున్నది ఇట్టివిధానమందలి మేజస్ట్రేట్లు రెవిన్యూశాఖకు జెందిన జిల్లాకలెక్టర్లకుగాక, న్యాయశాఖకు జెందిన హైకోర్టులకే బాధ్యులై యుందురు

ఈ అధికారవిభజన సంపూర్ణముగ జరిగిన రాజ్యమొక్క— అమెరికా సంయుక్తరాష్ట్రములని చెప్పవచ్చును ఆచ్చట కార్యవర్గమునకు ప్రెసిడెంటు పెద్ద—కాంగ్రెసు శాసనసభ—న్యాయాధికారము సుప్రీముకోర్టు నందుండును ఇతర ప్రజారాజ్యములలో కార్యవర్గములందలి మంత్రులు అచ్చటి శాసనసభలలో సభ్యులై, శాసనసభలకు బాధ్యతవహించి, శాసనసభలోని మెజారిటీపార్టీకి జెంది, శాసనసభామోదమునకు బద్ధులైయుందురు కాని అమెరికన్ పద్ధతిలో యీ రెండుశాఖలకును సంపూర్ణ విభజన యుండును ఉదాహరణ శాసనసభా సభ్యత్వము రెండేళ్ళుమాత్రమే అధ్యక్షపదవి నాలుగేండ్లు అధ్యక్షుని యెన్నుకొనునది అచ్చటి శాసనసభకాదు ప్రజలందరు వోటర్లే అతనిని సరాసరి యెన్నుకొందురు * అధ్యక్షుని కార్యవర్గము శాసనసభకు బాధ్యులగు మంత్రులు కాదు అధ్యక్షు నియమితులగు కార్యదర్శులు అధ్యక్షుడే వారిని భరతరఫు చేయవచ్చును అందుచే అమెరికన్ విధానములో అధ్యక్షుడు కాంగ్రెసు, న్యాయస్థానములు మూడును సంపూర్ణముగ ప్రత్యేకహోదా, గౌరవము, అధికారములు కలిగియున్నవని చెప్పవచ్చును మనదేశమందువలెగాక, అధ్యక్షుని శాసనసభ్యులే ఎన్నుకొందురు మంత్రులు

---

* దీని direct election అందురు

పార్లమెంటుకు బాద్యులైయుందురు సుప్రీంకోర్టు మాత్రము ప్రత్యే కాధికారములను చెలాయించును

ఈ అధికార విభజనాసూత్రము చాలవరకు సహేతుకము అయినను యీ వాదనను తెగేవరకు లాగకూడదు ఏలయన ప్రభుత్వాంగములు భిన్నములైనను ప్రభుత్వమొక్కటే అవయవములు వేరని వాటిని చెడించివేయుట సాధ్యముకాదు ఒక దానికిని ఇంకొక దానికిని అన్యోన్యసంబంధ ముండితీరును ఉదాహరణ- (1) సాధారణముగ శాసనసభలోని మెజార్టీ పార్టీనాయకుడే ప్రధానమంత్రి యగును ఇతరమంత్రులును శాసనసభ్యులే వీరందరు శాసనసభకు బాధ్యులైయుందురు (2) ఇంగ్లాండులోని ప్రభువుల సభకు కొన్ని న్యాయాధికారములున్నవి (3) యుద్ధసమయములలో కార్యవర్గమే అవసరశాసనములు జేయును (4) జడ్జిలను, నియమించు అధికారము సాధారణముగ కార్యవర్గముునకే యుండను (5) జిల్లామునసబులు, సబ్ జడ్జీలు మున్నగు న్యాయశాఖోద్యోగులందరు హైకోర్టు ఆధీనమునందున్నను న్యాయశాఖ ఆదాయవ్యయములను శాసనసభయే మంజూరు చేయును (6) తుదకు అమెరికా కార్యదర్శుల నియామకమునుగూడ కాంగ్రెసుకమిటీలు ఆమోదించవలసి యున్నది కావున యిట్టి ప్రత్యేకపరిస్థితులను గుర్తించి యీ అధికార విభజన గావించుట యుత్తమమార్గము

---

# 23 ప్రతినిధి ప్రభుత్వము, బాధ్యతాయుత ప్రభుత్వము

ప్రతినిధి ప్రభుత్వము (Representative Government) బాధ్యతాయుత ప్రభుత్వము (Responsible Government) అన నేమియో మనము స్పష్టముగ గ్రహించుట అవసరము

పూర్వకాలమందొక రాజో, చక్రవర్తియో, రాజ్యాధికార మంతయు గలిగియుండి, చెలాయించెడివారు 'నావిష్ణు పృథివీపతే' అని సూత్రము–అనగా రాజును మించిన దైవము లేడు రాజే ధర్మమూర్తి, శాసనాధికారి, న్యాయప్రభువు అతడే రాజ్యచిహ్నము ఇతర ఉద్యోగులందరు అతనిసేవకులు, సైనికులు, బంట్లు 'రాజునకు ప్రజ శరీర" మని ప్రజ లాతని శరీరమువంటివారు రాజే రాజ్యమునకు ప్రాణము రాజు కూలినచో రాజ్యము నశించినట్లే

కాని ఆధునిక రాజ్యములన్నియు సర్వసాధారణముగ ప్రజారాజ్యము లగుటచే పూర్వకాలపు రాజ్యభావము లు, సంప్రదాయము లిప్పు డర్థవిహీనమగుచున్నవి ఇప్పటిభావములో రాజ్యాధికారము ప్రజలలో నుండును (Vox Populi Vox Dei) అనగా ప్రజావాణియే దైవవాక్కు– 'సహస్రశీర్షా పురుష '–అనగా బహుమంది యున్నచోట దైవముండును ఒక రాజు బహుమంది ప్రజలకష్టసుఖములను గ్రహించి నిర్వహించుట దుస్సాధ్యము ప్రజలకే తమ కష్టనిష్ఠురములును, యేతన్నివారణోపాయములను, బాగుగ తెలియును అందుచేత ఒక రాజ్యమందలి రాజ్యాధికారమంతయు, ప్రజలలోనే యున్నటుల భావించి, దాని నిర్వహణ బాధ్యతనంతయు ఆ ప్రజలకే వప్పజెప్పుట ఉచితము లాభకరమని ఆధునికుల విశ్వాసము కావుననే ప్రస్తుత రాజ్యములను ప్రజారాజ్యములని పిలుచుచున్నారు

ఆదర్శ ప్రజారాజ్యములో రాజ్యధర్మములన్నియు ప్రజలలో ప్రజలే స్వయముగ నిర్వహించుకొనవలసియుండును అనగా గ్రామమందొక శాసనమో, ఆచారమో, మార్పుకావలసి యున్నచో గ్రామస్థులందరు నొకచోట సమావేశమై నిర్ణయించవలెను ఒకోపని

చేయవలెనన్నచో 'తనవెంటన్ శిరి లచ్చివెంట నవరోధవ్రాత మున్" అన్నరీతిగ ఊరందరును పూనుకొనవలెను యుద్ధమునకు అందరు బయలుదేరవలసినదే పంచాయతీలకు అంతా యుండవలసినదే ఈవిధముగ రాజ్యనిర్వాహణకు అందరు ప్రజలు పెద్దరికము వహించవలసివచ్చును ఏలయన, రాజ్యము ప్రజలందరదీ కనుక

కాని ఆచరణలోమాత్ర మిట్టి సర్వప్రజాపాలన సాధ్యము కాదు ప్రభుత్వవిధులు బహుశములు బహుళాంగములగుటచే, యీ విధులన్నిటిని సరిగా గ్రహించుకొని, నిర్వహించగల విద్యాగంధము గాని శక్తిసామర్థ్యములుగాని, తుదకు సావకాశముగాని ప్రతిపౌరునకు నుండుట కష్టసాధ్యము ఇంతేకాక, ఐదురూపాయల దొంగతనము గూర్చి విచారించుటకు ఊరిలోని ఆబాలగోపాలము సమావేశమగుట వృధా ప్రయాసయేకదా! అందులో వేలకొలది మైళ్ళు విస్తీర్ణము, కోటానుకోట్ల జనసంఖ్యగల పెద్ద రాజ్యములలో యిట్టి సర్వప్రజా రాజ్యము లెట్లు ఆచరణయోగ్యములు కాగలవు?

అందుచేతనే ఆధునికులు ప్రజారాజ్యములందు ప్రాతినిధ్య సూత్రమును (Principle of Representation) ప్రవేశపెట్టిరి ఒక ప్రతినిధి యనగా, కొంతమందిప్రజ తమకార్యనిర్వాహణ కొరకొక పెద్దను ఏర్పరచుకొనుట ఒక గ్రామమందు వేయిమంది ప్రజలున్నచో, ఆ గ్రామపాలనా వ్యవహారమంతయు పదిమంది పెద్దలుగల ఒకపంచాయతీకి వప్పజెప్పినచో, గ్రామమందు ప్రతివాడును తమతమ పనులను నిర్విచ్ఛన్నముగ సాగించుకొనుచుండగ తమ ప్రతినిధులు ఉమ్మడి వ్యవహారములను చూచుచుందురు ఇటులనే ఒక తాలూకాలోని ప్రజ కొన్నిపనులకొరకు కొక తాలూకాసమితి నేర్పరచుకొందురు రాష్ట్ర ప్రజలొక రాష్ట్రశాసనసభను దేశప్రజలొక పార్లమెంటును ఏర్పరచు కొందురు వీరందరు ఆయా గ్రామ, తాలూకా, రాష్ట్ర, దేశ ప్రజలకు ప్రతినిధులగుదురు ఈ వివిధ ప్రతినిధుల నెన్నుకొనుటకు

విపులమును, విస్పష్టమగు ఎన్నిక విధానము లేర్పరచబడును ఈ ప్రతినిధులద్వారా నిర్వహించబడు ప్రభుత్వమును ప్రతినిధి ప్రభుత్వ మందురు

బాధ్యతాయుత ప్రభుత్వములును (Responsible Govt) ప్రతినిధి ప్రభుత్వములే కాని యీ రెండింటికిని కొంత తేడాయుండును ఒక రాజ్యమందు ఎన్నికద్వారాగు ప్రజలు వోట్లద్వారా తమ ప్రతినిధుల నెన్నుకొని శాసనసభ నేర్పరచుకొందురనుకొనుడు ఆ శాసన సభ్యులు తమలోనుండి యొక మంత్రివర్గము నేర్పరచుకొని ఆ రాజ్యమందలి కార్యనిర్వహణభార మంతయు ఆ మంత్రులకు వప్పజెప్పుదురు అట్టి మంత్రులు తాముచేయు పనులకు యజమానులగు శాసనసభ్యులకు బాధ్యతవహింతురు అనగా వారి యిష్టానుసారము తామా పనులను నిర్వహించవలెను తమ కార్యములు శాసనసభ్యులలో అధిక సంఖ్యాకుల కసమ్మతమగుచో, యీ మంత్రులు తమ పదవులకు రాజీనామా యొసంగి, యితర మంత్రులకు స్థాన మొసంగవలెను ఇట్టి ప్రభుత్వ విధానమును బాధ్యతాయుత ప్రభుత్వమందురు సాధారణముగ ఆధునిక ప్రజాప్రభుత్వములన్నియు బాధ్యతాయుత ప్రభుత్వములే

బాధ్యతారహిత ప్రభుత్వములకు కొన్ని ఉదాహరణములు — 19[illegible]కు పూర్వము మన దేశమందలి కేంద్రప్రభుత్వము బాధ్యతా విరహితమైనది అనగా శాసనసభా నిర్ణయములను కార్యవర్గ సభ్యులు పాటించితీరవలెనను నియమము వారికి లేదు 1937కు పూర్వము రాష్ట్రప్రభుత్వములు, కొంతవరకు బాధ్యతాయుతమును, కొంతవరకు బాధ్యతావిరహితమునై యుండెడివి అనగా కొన్ని శాఖలు మంత్రుల పరిమును మరికొన్ని శాఖలు శాసనసభకు బాధ్యులు కాని కార్యనిర్వాహక సభ్యుల యొక్కయు అధీనమందుండెడివి దీనినే ద్వంద్వప్రభుత్వము (Dyarchy) అనెడివారు 19[illegible]0 కి పూర్వము మన

రాష్ట్రప్రభుత్వము లన్నియు బాధ్యతావిరహితములే అప్పటిరాష్ట్ర పాలనకు రాష్ట్రగవర్నర్లే అధికారులు ఆ గవర్నర్లు ఇండియా గవర్నరు జనరలుకును, బ్రిటన్ నందలి ఇండియా కార్యదర్శికిని, బ్రిటిష్ ప్రభుత్వమునకును, బ్రిటిష్ పార్లమెంటుకును బాధ్యులు అనగా ఇచ్చట రాజ్యపాలన భారతీయ ప్రజలకు బాధ్యతాయుతముగ నుండక బ్రిటిష్ ప్రజల ఈప్సితములకును, లాభములకును అనుగుణ్యముగ నుండెడిది

ఇప్పుడు మన దేశమందలి యూనియన్, రాష్ట్రప్రభుత్వములలో చాలభాగము యీ ప్రతినిధిపాలన, బాధ్యతాయుత సూత్రములను అవలంబించుచున్నది

---

# 24 ప్రభుత్వ రూపములు

## ( Forms of Government )

ఆరిస్టాటిల్ అను తత్వవేత్త రాజ్యాధికారము కలిగియున్నవారి ననుసరించి రాజ్యములను (1) ఏక రాజరికము (Monarchy), (2) పలువురు పెద్దలపాలన (Aristocracy) (3) ప్రజారాజ్యము (Polity), అని మూడు విధములుగ విభజించెను వీని వికృతులకు (1) నిరంకుశత్వము (Tyranny), (2) పలువురు పెద్దలపీడన (Oligarchy, (3) మూకరాజ్యము (Democracy) అని ఆతడు పేరిడెను సహజపద్ధతిలో యీ అధికారులు ప్రజాక్షేమమునకై యత్నింతురు వికృత మార్గములందు వారు తమ స్వార్థములను పోషించుకొని ప్రజలకు అపకారము చేయుదురు అరిస్టాటిల్ నాటినుండియు డెమొక్రసీ అను భావము చాల మార్పుజెంది, ఇప్పుడు దాదాపు 'పొలిటీ'తో తులతూగుచు, ప్రపంచమంతకును ఆదర్శనీయమైనది ఇప్పుడు మూకరాజ్యమును Mobocracy యని పిలువవచ్చును

డెమొక్రసీ లేక ప్రజారాజ్యమును Government of the people, by the people, for the people) ప్రజలయొక్క, ప్రజలచే, ప్రజలకొరకు నిర్వహింపబడు ప్రభుత్వమని నిర్వచింతురు ప్రజారాజ్యముయొక్క ముఖ్యలక్షణములు రెండు (1) ఇందు బహు సంఖ్యాకులైన ప్రజలకు లాభముచేకూరును (2) ప్రతిపౌరునకు తన రాజ్యనిర్వహణమందు వోట్లు మున్నగు సాధనములద్వారా ఉచిత రీతిని పాల్గొనుటకు సావకాశముండును-అనగా తన రాజ్య నిర్వహణములో ప్రతిపౌరుడును యథా శక్తి పాల్గొనుటకు అర్హుడని అర్థము ఒక రాజ్యమందలి విధులు చక్కగ నెరవేర్చుటకై అచ్చటి ప్రజలెల్లరు బాధ్యులని ఇందలి సూత్రము ఆ రాజ్యమందలి వివిధప్రజలు తమ బాధ్యతలను చక్కగ గుర్తెరిగి, వాటని సక్రమముగనిర్వహించెడిచో తాము సుఖించుటయు, రాజ్యము సుభిక్షముగనుండి, సురక్షితమగుటయు జరుగును అటులకానిచో, పాలకులు నిరంకుశులై, ప్రజాపీడనకును, తుదకు దాస్యమునకును కారకులగుదురు

ప్రతి పౌరుడు రాజ్యాధికారియగుచో వ్యక్తిస్వాతంత్ర్యము సాంఘికసమత్వము, అంబడక తప్పదు ఏలయన దాని యర్హతను బట్టి ప్రతిపౌరుడును వికసించుటకు స్వాతంత్ర్యావసరము అట్టివ్యక్తి స్వాతంత్ర్యమువల్ల సాంఘికసమత్వ మేర్పడును రాజ్యమందలి యే వర్గీయులును యితర సంఘీయులపై అక్రమాధికారమును సాగింప జాలరు ప్రజారాజ్యము సంపూర్ణముగ సిద్ధించుటకు వనలో రాజకీయ సమత్వముతో పాటు సాంఘికస్వేచ్ఛయు, ఆర్థికసమత్వమును అవసరము

## డెమాక్రసీ యొక్క బాగోగులు

డెమాక్రసీయొక్క బాగోగులగురించి భిన్నాభిప్రాయములు కలవు ఇందలి లాభము లెట్టివనిన —

1 నిజముగ ప్రజారాజ్యములో ప్రభుత్వము ప్రజావసరములను గుర్తించి ప్రజాభీష్టముల కనుగుణ్యముగ నడచును ప్రజలే తమకు యజమానులని గుర్తెరిగి, ప్రజలకు బాధ్యతవహించును ఎవరికిని అన్యాయము జరగనేరదు ప్రజలలో అందరి క్షేమమును గుర్తించబడును ప్రజలు తమ అభిప్రాయములను స్వేచ్ఛగ ప్రకటించుకొనవచ్చును అందుచే ప్రభుత్వమునుండి ప్రజలకు వచ్చెడి ఉత్తరవులే కాకుండా, ప్రజల కోరికలు, కష్టములు, సలహాలు ప్రభుత్వము తెలుసుకొనుటకు అవకాశముండును

2 డెమాక్రసీ ప్రజలలో జ్ఞానాభివృద్ధికి ముఖ్యసాధనము ఎన్నిక సమయములందు ప్రజప్రబోధమునకును, ప్రజావసరములను ప్రభుత్వసభ్యులెరుగుటకును మంచి అవకాశముండును వివిధ రాజకీయ పార్టీలు తమ భావములు, రీతులు, కార్యక్రమములను విపులముగ ప్రజల కెరిగింతురు నిరంకుశపాలనమందలి ప్రజలకంటె ప్రజారాజ్యమందలి పౌరుడు తమ హక్కులందును, బాధ్యతలయెడలను యెక్కుడు జాగరూకులై యుందురు

3 డెమాక్రసీ ప్రజలలో దేశభక్తిని బాధ్యతను పురికొల్పును ప్రతిపౌరుడును "ఈ దేశము నాది ఈ ప్రజలు నావారు

వీరిని పోషించి రక్షించు బాధ్యత యితరులతో పాటు నాపై గూడ నున్న" దని భావించుకొనుటచె ప్రభుత్వము పటుత్వముగ నుండును లంచముల కవకాశము తగ్గిపోవును డెమోక్రసీలో స్వేచ్ఛగ ప్రజలు తమకష్టములను పాలకుల కెరిగించుటకును, వివిధసభ్యులు అన్ని విషయములు తర్కించి పరిష్కరించుటకును వీలుండును అందుచే యుద్ధములు, కలహములు లేకుండ దేశవ్యవహారములు శాంతముగ పరిష్కరించవచ్చును

4 ప్రజాపాలనలో ప్రతిపౌరుడు తన విధుల నెఱుంగుటకు అవకాశముండును ప్రజలలో జ్ఞానాభివృద్ధి హెచ్చుకొలదియు పరిపాలనాసామర్థ్యమును హెచ్చును

5 ప్రస్తుత పరిస్థితులలో ప్రజాపాలనకు భిన్నమగు పరిపాలన యింకొకటి లేకుండుటయు యీడెమోక్రసీకి అనుకూలవాదనయేయగుచున్నది డెమోక్రసీకానిచో నిరంకుశత్వమే (Dictatorship) గతి యగుచున్నది కాని అనుభవముబట్టి యీ నిరంకుశ నాయకులు దేశమునకు తాత్కాలికముగ కొంత యుపకరించినను తుట్టతుదకు వీరివలన ప్రజలకు కీడే మూడుచున్నది అట్టిరాజ్యములలో ప్రభుత్వబాధ్యతయంతయు ఏ కొందిమంది చేతులలోనో యుండుటచే, ప్రజాసామాన్యము చా[illegible]తమై, అజ్ఞానతిమిరమునబడి, అసమర్థులగు[illegible]యు [illegible] క్రమము దేశకంటకములగుటయు సామాన్యానుభవము ఉదాహరణ - నెపోలియన్, కైజర్, హిట్లర్, ముసులోనీల రాజ్యములు

డెమోక్రసీకి వ్యతిరేకులగువారు ప్రపంచమందలి యే రెండు జీవులును ఒకేమాదిరిగా నుండవనియు, అట్టితరి మానవులలో సమత్వ మసంభవ మనియు స్త్రీ పురుష ప్రకృతులే భిన్నమనియు, తలకొక కోటని చెప్పుటలో తెలుపద్దేగాని అందలి పసను గమనించుట లేదనియు, యోగ్యుడు, అయోగ్యుడు, మేధావి, శుంఠ, అందరకు ఒకే

వోటనుట హాస్యాస్పదమనియు, ప్రజా రాజ్యములో ప్రజ్ఞావంతులగు వారికి అర్హస్థానము లభించుట అరుదనియు, సామాన్యపౌరులకు రాజ్యభారము వహించుటకు వలయు తెలివితేటలుకాని, నావకాశము కాని సామర్థ్యముకాని వుండజాలవనియు ప్రభుత్వనిర్వాహణ మొక మహత్తర విషయమనియు దేశరక్ష విదేశవ్యవహారములు ఆర్థిక విషయములు త్వరితగతిని పరిష్కరించవలసిన సందర్భములలో వీటిని ప్రజాప్రభుత్వములు జాగుచేసి పాడుచేయుటకు వీలగుననియు, అజ్ఞానులు అనాలోచనాపరులు, ఉద్రేకపూరితులగు ప్రజాసమూహములపై ఆధారపడి బలిష్ఠమగు ప్రభుత్వమును నెలకొల్పుట అసాధ్యమనియు, డెమోక్రసికి సంబంధించిన యెన్నికలు, సభలు, తామసిక అజ్ఞానరూపములే గాని హేతుబద్ధమగు వివేక రాజకీయమార్గములు కావనియు, దీనిని విమర్శింతురు

ఇందుకు సమాధానము –

1 డెమోక్రసీ కావలెననువారు జీవులందరు అన్ని విధముల సమానులని యెప్పుడును భావించరు ఇందు సమత్వము వారిసామర్థ్య విషయమై కాదు–వారి కొసంగు అవకాశములగూర్చి మాత్రమే అసమర్థుడగు ఒక రాజకుమారుడు రాజ్యాధికారియగుచో ఆ రాజ్యము నశించిపోవును ఇందుకు మనదేశచరిత్రలోనే అనేక తార్కాణము లున్నవి అట్టితరి సమర్థుడగు యే సామాన్యపౌరుడైనను రాజ్యాధ్యక్షుడగుటకు అవకాశ ముండవలెనని మాత్రమే డెమొక్రట్ల వాదన

2 డెమొక్రసీ అనగా అప్రయోజక శిఖామణుల రాజ్యమనుకొనరాదు ఏ మంత్రులైనను అప్రయోజకులైనచో తిరిగి వారిని ఎన్నుకొనకుండుటకు ప్రజలు హక్కుగలిగియుందురు సమర్థులగు ప్రజాసేవకులను ప్రజలెన్నటికిని విడిచిపెట్టరు ఇది మనకు సామాన్యానుభవము

3 ప్రజాపాలన దుర్బలముగ నుండుననుట నిరాధారము యుద్ధ సమయములందు నిరంకుశ రాజ్యములలో పనులు త్వరితముగ జరుగవచ్చును కాని శాంతి అభ్యుదయములకు ప్రజాపాలనలోగల అవకాశములు నిరంకుశ రాజ్యములందుండవు యుద్ధసమయములలో గూడ యీ ప్రజారాజ్యములు తమ సామర్థ్యమును రుజువు పరచుకొనుచున్నవి

4 ప్రజాపాలనలో యెన్నికలు మున్నగువానివల్ల వృథావ్యయమగుననియు ప్రజలలో అవినీతి లంచగొండితనము హెచ్చుననియు చెప్పుదురు కాని యీ లోపములు నిరంకుశ పాలనయందును వుండవచ్చును ఇంతేకాక లంచగొండియగు ప్రజాప్రతినిధిని తొలగించుటకు డెమోక్రసీలోనే హెచ్చు అవకాశములుండును కాని లంచగొండియగు ఒకరాజును తొలగించుట అంత తేలికైనపనికాదు

ప్రజాప్రభుత్వములలో మంత్రుల పాలన (Cabinet Government, అధ్యక్ష ప్రభుత్వము (Presidential Government) అని రెండు రూపములు కలవు మంత్రులపాలనలో రాజు వుండవచ్చును (ఉదాహరణ ఇంగ్లాండు) లేకపోవచ్చును (ఉదాహరణ ఇండియా) ఇచ్చట మంత్రులు తమలో తామొక ప్రధానమంత్రి నాయకత్వము క్రింద ఏకవ్యక్తిగా వ్యవహరింతురు, శాసనసభలకు బాధ్యులై యుందురు అధ్యక్షపాలనలో (ఉదాహరణ అమెరికా) అధ్యక్షుడు ప్రజలచే సరాసరి యెన్నుకోబడి ప్రజలకే బాధ్యత వహించును ఇచ్చట వివిధ శాఖలను పాలించుటకు శాసన సభలకు బాధ్యులగు మంత్రులుండరు అధ్యక్షుడు వివిధశాఖలకు తన కార్యదర్శులను నియమించుకొనును వారు అధ్యక్షునకే బాధ్యులు ఈ పద్ధతిలో శాసన సభకును, కార్యవర్గమునకును అధికార విభజన పరిపూర్ణముగ నుండును మన దేశములో రాజ్యాధికారి అధ్యక్షుడే అయినను ఈతడు దేశమందలి శాసనసభ్యులచే మాత్రమే యెన్నుకోబడి, పార్లమెంటుకు

బాధ్యుడై యుండును కార్యనిర్వహణలో యీతనికి తోడ్పడుటకై శాసనసభకు బాధ్యులగు మంత్రులుందురు

నూతనముగ స్వాతంత్ర్యము బడసిన పాకిస్తాన్ మున్నగు రాజ్యములలో ఇటీవల సైనిక నియంతృత్వములు వెలయుచున్నవి పాశ్చాత్య ఎన్నికపద్ధతి తమకుపనికిరాదనియు రాజకీయ నాయకులు అసమర్థులు, లంచగొండులు, స్వార్థపరులగు చున్నారనియు, సైనిక నియంతలు మాత్రమే రాజ్యపాలనను సక్రమముగ కొనసాగించగలరనియు, వీరి వాదన ఇట్టి నియంతృత్వములు వ్యక్తిస్వాతంత్ర్యమునకు పరమశత్రువులుగ బరిణమించుచుండుట సామాన్యానుభవము ఆ విషయ మెట్లున్నను యీ సైనిక నియంతృత్వములు తాత్కాలిక అవధులై, అచిరకాలముననే ప్రజారాజ్యములుగ బరిణమించగలవని ఆశించవచ్చును

—( )—

# 25 ప్రజా పాలన - రాజకీయ పార్టీలు

## (Popular Government and Political Parties)

డెమోక్రసీ జయప్రదమగుటకు ప్రజాభిప్రాయము ముఖ్యముగ అవసరము. ఏలయన జ్ఞానయుతమును, సత్యయుతమును నిర్భయమగు ప్రజాభిప్రాయము లేనిచో ప్రజారాజ్యము సాధ్యముకాదు.

ప్రజాభిప్రాయము చక్కగా ప్రకటితమగుటకై (1) పత్రికలు, రేడియోలు (2) సభలు, ఉపన్యాసములు, (3) రాజకీయపార్టీలు, (4) విద్యాలయములు, (5) సినీమాలు ముఖ్యసాధనములు. ఇటీవల టెలివిజన్ కూడ యిందుకు కొంతవరకుపకరించుచున్నది.

పత్రికలు ప్రజాభిప్రాయమును నిర్భయముగ ప్రకటించుటకై వీని నిర్వాహణలో ప్రభుత్వము హెచ్చు జోక్యము కలుగజేసుకొనగూడదు. నిరంకుశరాజ్యమందు పత్రికలపై హెచ్చు నిర్బంధము లుండును. పత్రికాస్వాతంత్ర్యము ప్రజారాజ్యమునకు ఆయువుపట్టు. కాని పరదూషణ, అవినీతి మతదూషణలను యే ప్రభుత్వమును సహించదు.

సభలు, ఉపన్యాసములు, ప్రజాపాలనకు ముఖ్యసాధనములగుటచే సభాస్వాతంత్ర్యము వాక్స్వాతంత్ర్యము, పౌరులకెక్కుడవసరములు. ప్రజానాయకులు దేశ అవసరముల గూర్చియు ప్రపంచ పరిస్థితుల గూర్చియు, సభలు, ఉపన్యాసములద్వారా ప్రజలను ప్రబోధించుచుందురు. వీనికితోడు కరపత్రములు, గ్రంథములు సహాయకారులగుచున్నవి. దాస్యదేశములలో జెండాఉత్సవములు, ఊరేగింపులకు మించిన ప్రజాప్రబోధముండనేరదు. నేడు రేడియోలును హెచ్చుగ సహాయకారులగుచున్నవి.

ప్రజాప్రబోధములో ఉద్రేకము, పక్షపాతము, అనృతవాదము ప్రమాదహేతువులు. ఇందలి నిజానిజములను అనుభవముపై ప్రజలే గుర్తెరుగవలసి యుందురు. శాసనవిరుద్ధములగు వ్రాతలను ప్రభుత్వము శిక్షించుచుండును.

ప్రజాపాలనకు ధర్మయుతమగు రాజకీయపార్టీ లవసరము.

ఒక పార్టీ అనగా జాతి అభివృద్ధికొరకు కొన్ని ప్రత్యేక రాజ

కయ సిద్ధాంతములు, పథకములుగలిగి, రాజకీయ వ్యవహారములలో నొక జట్టుగ వ్యవహరించుచు, స్వతంత్రించిపోవు పౌర సముదాయము అట్టి పార్టీలు దేశమందు రెండుకాని, హెచ్చుకాని యుండవచ్చును దేశమం దొకే పార్టీ యున్నచో, ఆపార్టీయొక్క నిరంకుశాధికార మేర్పడును రెండు మూడు పార్టీలున్నచో, ఒకరిపై వేరొకరు పోటీగనుండి, ఒకరి లోపములను రెండవవారు బహిరంగపరచుచు, రాజ్యపాలన క్రమముగను, సౌష్ఠవముగను సాగించుటకు వీలగును రెండు, మూడుకంటె హెచ్చుపార్టీలున్నచో రాజ్యమంతయు ముఠాల మయమై ప్రభుత్వము స్థిరత్వమును కోలుపోయి, పరిపాలనలో ప్రతి స్తంభనల కెక్కుడు సావకాశమేర్పడును అమెరికాలో ముఖ్యపార్టీలు డెమొక్రట్లు రిపబ్లికన్లు, ఇంగ్లాండులో పూర్వము లిబరల్, కాన్స ర్వేటివ్ లు, యిప్పుడు కన్సర్వేటివ్, లేబర్ లు ఫ్రాన్సులో "నానా గోత్రేభ్య" అన్నట్లుండెను మనదేశమందు కాంగ్రెసు బలిష్ఠమగు పార్టి కమ్యూనిష్టు పార్టీ సోషలిష్టు, జనసంఘము, హిందూమహా సభ, స్వతంత్ర మున్నగు యితరపార్టీ లెన్నియో కలవు కాని యిచ్చట బలిష్ఠమగు ప్రతికక్ష యింకను యేర్పడవలసియున్నది

ప్రజా కులు వ్యక్తిభేదములపై నాధారపడక స్పష్టమగు సాంఘిక రాజకీయ ఆర్థిక సిద్ధాంతములపై యేర్పడవలెను అట్టి పార్టీ లున్నచో దేశమందొక పార్టీ కార్యక్రమము విఫలమైనప్పుడు రెండవపార్టీ రాజ్యభారము వహించుటకు సావకాశముండును అట్టి తరి దేశమందు తేపతేపకు విప్లవములకు అవసరముండదు పార్టీలో ఒకే భావములు, సిద్ధాంతములు, కార్యక్రమములుండుటచే, ఆ పార్టీ సభ్యులు, యేకమ్మడిగ తమ సిద్ధాంతములను ప్రజల కెరిగించి ప్రజా ప్రబోధమునకు తోడ్పడుదురు పార్టీ నిర్వహణమందు వీరికి రాజ్య పాలనకు వలయు క్రమశిక్షణ రాజకీయ విజ్ఞానము, వ్యవహార దక్ష తలు అలవడును

ఎన్నికలలో అధిక సంఖ్యాకులుగ గెలుపొందిన పార్టీ వారు ప్రభుత్వభారము వహించి తమ పార్టీ కార్యక్రమమును సాధ్యమై నంతలో దేశమం దమలులోనికి తెత్తురు అట్టివారిని అధికారపార్టీ (Party in Power) అందురు ఎన్నికలలో అల్పసంఖ్యాకస్థానములు

పొందిన పెద్దపార్టీవారిని ప్రతికక్షులందురు (Opposition Party) అధికారపార్టీవారి చర్యలను నిరంతరము కనిపెట్టుచు, విమర్శించుచ, తమ విమర్శలచే ప్రభుత్వమునకు తోడ్పడుట గిరివిధి తమ వాద నలచే ప్రభుత్వ వాదనయందలి లోపములను వీరు ప్రజల కెరిగించు చుందురు అధికారములోనున్న పార్టీ ఓడిపోయినప్పుడు మైనార్టీ పార్టీయే అధికారమునకు వచ్చును కావున మెజార్టీపార్టీ వీరిని న్యూనపరుప యత్నించరాదు అటులనే మైనార్టీపార్టీ వారును ప్రభుత్వమును కేవలము విమర్శించుటయేగాక వారితో తగు సహ కారమును జూపుచుండవలెను యుద్ధసమయములందున క్లిష్ట పరి స్థితులలోను వివిధపార్టీలు సమిష్టిగ రాజ్యభారమును వహించవలసి యుండును (Coalition Government) ఉదా గత యుద్ధకాల ములో బ్రిటన్‌లో జాతీయప్రభుత్వము-ఇటీవల కెరళలోను, ఒరిస్సా లోను ఉమ్మడి మంత్రివర్గములు అట్టి అవసరములు తీరగనే ఆయా పార్టీలు విడిపోవును రాజకీయపార్టీలు దేశక్షేమమున కేర్పడిన భిన్న సాధన మార్గములేకాని, అన్యోన్య కలహములకుగాని, హింసాపూరిత విప్లవములకుగాని హేతుభూతములు కాకూడదు ఏలయన దేశభక్తి అన్ని పార్టీలకు సమానమే

ప్రతిదేశమందును యీ రాజకీయపార్టీ లోకవిధమగు వృత్తి సంఘములుగ బరిణమించి మేధావులకును ప్రత్యేక శాఖలలో నుత్తీర్ణులగు నిపుణులకును యిందు తావులేకుండట సామాన్యాను భవము ఏలయన అట్టి ప్రజ్ఞావంతులు సాధారణముగ రాజకీయము లందు ప్రవేశించరు అందుచే ప్రతి ప్రభుత్వ విధానమందును అట్టి ప్రజ్ఞావంతులకు ప్రత్యేక స్థానముల నొసంగి వారి శక్తిసామర్థ్యములను దేశమునకు వినియోగించుటకై ప్రత్యేకయేర్పాట్లుండును నామినే టెడ్ సభ్యులు, పరోక్ష ఎన్నికలు యిట్టి యేర్పాట్లలో ముఖ్యమైనవి

విద్యాలయములవల్ల గూడ కొంత రాజకీయ ప్రబోధము జరుగు చున్నది విద్యార్థులు హెచ్చుగ ఆవేశపరులగుటచే ప్రతి యుద్యమ మందును వీరు ముందడుగు వేయుచుందురు కాని విద్యార్థిదశలో ప్రతి విద్యార్థియు రాజకీయరంగమందు ప్రవేశించక తన చదువు పైననే శ్రద్ధబూనుట యవసరము సినిమాలు, రేడియోలు కూడ రాజకీయ ప్రబోధమునకు హెచ్చుగ తోడ్పడుచున్నవి

## సమిష్టి బాధ్యత (Collective Responsibility)

ప్రజాపాలనలో వోటర్లగు పౌరులు శాసనసభలకు తమ ప్రతినిధుల నెన్నుకొందురు ఈ శాసనసభ్యుల నుండి మంత్రివర్గ మేర్పడును ఆ మంత్రుల నేర్పరచు బాధ్యత అందలి మెజార్టీ పార్టీ నాయకునిపై యుండును ఆతడే మంత్రివర్గసభలో అధ్యక్షత వహించును మంత్రులు ప్రభుత్వమందలి వివిధశాఖలకు అధికారులైనను మంత్రివర్గమంతయు ఉమ్మడిపాలనకు బాధ్యత వహించును సాధారణముగ మంత్రులందరు కలసి ప్రభుత్వ విధానములను చర్చించి నిర్ణయింతురు అట్టి నిర్ణయములకు వీరందరు సమాన బాధ్యులగుదురు ముఖ్య విషయములలో మంత్రివర్గమువారి ప్రతిపాదనను శాసనసభ త్రోసి వేసినచో మంత్రివర్గమంతయు రాజీనామా నొసంగి నూతన మంత్రివర్గ మేర్పడును ఇట్టి సందర్భములలో అధ్యక్షుడుకాని, గవర్నరుకాని, మంత్రివర్గ నాయకుడగు ప్రధానితో మాత్రమే సంప్రదింప వీలగును మంత్రులలో మంత్రులను విడదీసి, చీలికలు పెట్టుటకు వీలుండదు మంత్రులుచేయు పనులన్నిటికీ మంత్రులందరు ఉమ్మడిగా బాధ్యులగుటచే మంత్రివర్గమంతయు సమిష్టిగను బలవత్తరముగను, సామరస్యముతోను పనిచేయుటకు వీలగును వీరందరకు ప్రధాని నాయకుడుగ వ్యవహరించును ఏ మంత్రినైనను నియమించవలెనని శిఫారసు చేయు అధికారము ప్రధానమంత్రిది ఏ మంత్రియందైనను ప్రధానికి విశ్వాసము లేనిచో ఆ మంత్రి తన పదవినుండి తొలగిపోవలసినదే ప్రధాని తన పదవికి రాజీనామా నిచ్చినచో మంత్రివర్గమంతయు కూలిపోయినట్లే భావించవలెను ఇతర మంత్రులలో ఏ యొక్కరైనను తన పదవికి రాజీనామా నొసంగినచో మిగత మంత్రులు మారనవసరము లేదు మంత్రివర్గసమాలోచనలను సాధారణముగ రహస్యముగ బరిగింతురు ముఖ్యవిషయములను మంత్రులందరు కలసి చర్చింతురు తమ తమ ప్రత్యేక శాఖలలో ఆయా మంత్రులకు వలయు స్వేచ్ఛ యుండును ఒక నిర్ణయమునకు వచ్చినపిమ్మట ప్రభుత్వ నిర్ణయము వివిధమంత్రులు బహిరంగముగ విమర్శింపరాదు ఒకని శాఖలలో యింకొక మంత్రి జోక్యము కలుగజేసికొనుటయు దూష్యమే

# 26 ఎన్నికలు - ఓట్లు

ప్రజారాజ్యములో శాసనసభలకు సాధారణముగ రెండు, మూడు, లేక అయిదేండ్ల కొకసారి ఎన్నికలు జరుగును అమెరికాలో రెండేళ్లు – ఇండియా, ఇంగ్లాండులలో అయిదేండ్లు

ఎన్నిక యనగా ప్రజలలో యీడువచ్చిన విద్యాధికులు, భూస్వాములు, ధనికులు, కార్మికులు మున్నగువా రొకవర్గముగ యేర్పడి, అచ్చటి రాజ్యపాలనకై తమ ప్రతినిధుల నెన్నుకొనుట అట్టి వర్గమును ఎన్నికవర్గ (Electorate) మందురు ఈ ఎన్నికవర్గము వివిధ ఎన్నికలలోని అభ్యర్థులయెడ తమ సమ్మతులను తెల్పు సాధనమునకు వోటు (Vote) అని పేరు వోటనగా ఒకానొక యెన్నికదారు యెన్నికకు నిలచిన అభ్యర్థులలో (Candidates) పౌరులు తమ యభిమతమును తెల్పుట కుపయోగించు సూచన ఈ యభిమతమును కాగితము రూపమునగాని, చేతులెత్తుటవల్లగాని, నోటి మాటవల్లకాని ప్రకటించవచ్చును రహస్యముగ వోట్లనిచ్చు పద్ధతిని రహస్యబేలట్ (Secret Ballot) అందురు

ప్రజారాజ్యమందు వోటు అతిముఖ్యమును, పవిత్రమైనది దీనివల్ల స్థానిక సంఘములకును శాసనసభలకును ప్రతినిధు లేర్పడుదురు వీరినుండి పరిపాలకులు, మంత్రులు యెన్నుకోబడుదురు ఓటర్లు సరియగు ప్రతినిధుల నెన్నుకొననిచో శాసన సభ్యులు, మంత్రులు, అవినీతిపరులు, అసమర్థులు నగుదురు స్వార్థపరులగు అభ్యర్థులు ఓటర్లను మభ్యపరచి లంచములిచ్చి, దుష్ప్రచార మొనర్చి, వారిని తమవైపు త్రిప్పుకొనుటకు యత్నింతురు ఇట్టి పన్నాగములందు చిక్కుకొనకుండుటకై ఓటర్లలో హెచ్చునీతి, విజ్ఞానము, జాగరూకత నిగ్రహము లవసరములు ఓటు అమ్ముటయనగా మానవిక్రయము కంటె హీనమని యెల్లరు గ్రహించవలెను

ఎన్నికలలో ఓటుచేయు అధికారమును సఫ్రేజ్ (Suffrage) అనియు, ఫ్రాంఛైజ్ (Fr nch se) అనియు అందురు ఇందు యీడు వచ్చిన స్త్రీపురుషుల కెల్లరకును ఓట్ల నొసంగు పద్ధతిని వయోజన ఓటింగు పద్ధతి (Adult Suffrage) అందురు నూతన భారత రాజ్యాంగ

ములో ఇరవైయొక్క యేళ్ళు నిండిన స్త్రీపురుషు లెల్లరకును ఓటింగు హక్కు కలదు ఇందు జాతి, మత, కుల, లింగభేదము లుండవు,

ఎన్నికలు ప్రత్యక్షము (D rect) పరోక్షము (Indırect) అని రెండువిధములు ప్రత్యక్ష ఎన్నికలలో ఓటర్ల జాబితాయందలి ఓటర్లే సరాసరి తమ ప్రతినిధుల నెన్నుకొందురు ఉదాహరణ మునిసిపల్ యెన్నికలు, అమెరికా అధ్యక్షునియెన్నిక, లెజిస్లేటివ్ అసెంబ్లియెన్నికలు పరోక్ష యెన్నికలలో యీ ఓటర్లుకొందరు ప్రతినిధుల నెన్నుకొని, ఆ ప్రతినిధులచే శాసనసభ్యు లెన్నుకొనబడుదురు ఉదాహరణ - భారతాధ్యక్షుని యెన్నిక లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుల యెన్నిక ప్రత్యక్ష యెన్నికలలో ప్రజాప్రబోధ మెక్కువ కల్గును కాని అందువల్ల ప్రజ లావేశపరులై అనాలోచనగా ప్రవర్తించవచ్చును పరోక్ష యెన్నికవల్ల అట్టి భయముండదు కాని ప్రస్తుత ప్రజాపాలనలో ప్రత్యక్ష యెన్నికలే యెక్కుడు ఆచారముగ నున్నవి

ప్రజాపాలనలో ఓటర్లకు, ప్రతినిధులకు ఒక్క యెన్నిక సమయమందు తప్ప మరెప్పుడును యెట్టి సంబంధము నుండదనియు, అవినీతిగ ప్రవర్తించు సభ్యుని తరువాత వచ్చెడియెన్నికవరకుఓటర్ల రేమియు చేయజాలరనియు విమర్శింతురు ఈ విమర్శ కొంతవరకు సమంజసమే అయినను, సామాన్యముగ తరువాత యెన్నికలో తిరిగి ప్రజ లెన్నుకొనరేమో అను భయము రాజకీయ జీవితము వాంఛించువారిలో సామాన్యమైన భయముకాదు నీతిపరులగు సభ్యులు యెన్నికలైనపుడప తమ నియోజకవర్గములతో హెచ్చు సంబంధము కలిగియుండి, ప్రజావసరములను తాము తెలుసుకొని, ప్రభుత్వాంశములను ఓటర్ల కెరుకపరచుచు, శక్త్యానుసారము తమయెన్నిక స్థానమునకు (Constituency) సేవజేయుచుందురు ఇంతేకాక ప్రజాపాలనలో ప్రజా ప్రతినిధులగు సభ్యులు తమ యెన్నికదార్లకు తగురీతి జవాబుదారీ వహించుటకై కొన్ని ప్రత్యేక పద్ధతులను పౌరశాస్త్రజ్ఞులు సూచించుచున్నారు అట్టి పద్ధతులలో ముఖ్యమైన నిబంధన - (1) స్థానిక సంస్థలలో మూడు మాసములవరకును, శాసన సభలకు 60 రోజులును సభలకు హాజరుకానివారి స్థానములు ఖాళీయైనటుల భావించుట

(2) ఇనిషియేటివ్ (Initiative) (3) రెఫరండమ్ లేక ప్లెబిసైట్ (Referendum or Plebiscite) (4) రీకాల్ (Recall)

ఇందు సభలకు హాజరుకానివారి విషయమై తగు హేతువు లున్నచో తిరిగి ఒకటి రెండుసార్లు అట్టివారిని పునరుద్ధరించుటయో లేక ప్రత్యేకముగ శెలవొసంగుటయో ఆచారముగ నున్నది 'ఇనిషియేటివ్"లో నియమితమగు ఓటర్లు శాసనసభ్యులతో నిమిత్తములేకయే తమంతట తాము యేచట్టమైనను శాసనసభలో ప్రవేశపెట్టవచ్చును "రెఫరెండమ్" అనగా శాసనసభ కావించు నిర్ణయములను ప్రజామోదము కొఱకు ఓటర్ల యెదుట నుంచుట అట్టి ప్రజాభిప్రాయమే తుదకు శాసనమగును 'రీకాల్" వల్ల ఓటర్లు తమ ప్రతినిధుల చర్యలు తృప్తికరముగ లేనప్పుడు తమంతటతామె వారిని వెనుకకు పిలిపించుట కాని యీ అధికారములన్నియు అతి తీవ్రమగు చికిత్సలనియు, ప్రపంచమందంతటను ఓటర్లు హెచ్చు విజ్ఞులు సుశిక్షితులు కాని ప్రస్తుత సమయమందిట్టి గాఢప్రక్రియలు ముఖ్యముగ పెద్దరాజ్యములయం దాచరణయోగ్యములు కానేరవనియు శాస్త్రజ్ఞుల యభిప్రాయము తుదిమెట్టులో ఏ ప్రతినిధియైనను బాధ్యతారహితముగ ప్రవర్తింపకుండుటకు ఆతని యెన్నికవర్గమందలి ఓటర్లు అప్రమత్తులై యుండుటయే ముఖ్యసాధనము ఇందుకు పౌరసంఘములు ఓటర్ల సంఘములు కొంతవరకు ఉపకరించగలవు కాని వీనిగూర్చి వలయు శ్రద్ధ మన పౌరులలో నున్నటుల గానిపించదు

—(×)—

## పంచాయతీలకు విస్తృతాధికారాలు

ఈ బిల్లు 15,042 పంచాయతీలకు వర్తిస్తుంది ఇందులో 10,246 పంచాయతీలు ఆంధ్ర ప్రాంతంలో వున్నాయి మిగిలిన 4,796 తెలంగాణాలో వున్నాయి

ప్రతిగ్రామానికి ఒక పంచాయతీని ఏర్పాటు చేస్తారని పంచాయతీ రాజ్య ప్రతినిధి ఒకరన్నారు

ఈ బిల్లుపై రెండు మూడు రోజులు చర్చ జరగవచ్చు

మొదట్లో ప్రచురించిన బిల్లు ప్రకారం రెవెన్యూ తలూకా లోని ఏ భాగానికైనా, జనాభా పరిమితి లేకుండా పంచాయితీని ఏర్పాటుచేయవచ్చు కాని సంయుక్త పరిశీలక సంఘం వారు దానిపై సమగ్రంగా చర్చించి 500 జనాభా గల గ్రామాలకు పంచాయతీ ఏర్పాటు చేయాలని సూచించారు

ఈ కొత్త బిల్లు ప్రకారం మూడేండ్ల కొకసారి బదులుగా 5 ఏండ్ల కొకసారి ఎన్నికలు జరుగుతాయి

సంయుక్త పరిశీలక సంఘం సూచించినట్లు ఈబిల్లులో పంచాయతీ ఎన్నికలు రహస్య ఓటింగ్ పద్ధతిపై జరుగతాయి

ఆంధ్ర, తెలంగాణాలకు ఒకే రకపు శాసనాలను అమలు చేసేందుకు వీలుగా ఈ బిల్లు తయారైంది 1950 ఆంధ్రప్రదేశ్ గ్రామ పంచాయతీ చట్టం ఈ బిల్లుకు ప్రాతిపదిక

తెలంగాణా ప్రాంతంలో, 1956 హైద్రాబాద్ జిల్లా మునిసిపాలిటీల చట్టం ప్రకారం ఏర్పాటయిన టౌన్ కమిటీలను పంచాయతీలక్రింద పరిగణిస్తారు 5 వేలకు మించి, 15 వేలకు లోపుగా జనాభా వున్న ప్రాంతాలలో కమిటీలు ఏర్పాటు చేశారు ఇవి ఆంధ్ర ప్రాంతంలోని 1వ తరగతి పంచాయతీకి సమానం

పారిశ్రామిక, కార్మిక వాడల్లో ప్రతి గ్రామ పంచాయతీకి ఒక గ్రామ సభను ఏర్పాటు చేయడానికి కూడ ఈ బిల్లులో అవకాశం కల్పించారు ఈగ్రామ సభల్లో గ్రామంలోని ఓటర్లంతా సభ్యులుగా వుంటారు ఏడాదికి రెండుసార్లు వారు సమావేశమవుతారు

ఈ కొత్త బిల్లు అమలయిననాటి నుంచి పదేండ్ల వరకు షెడ్యూల్డు కులాలకు, షెడ్యూల్డ్ జాతులకు పంచాయతీలలో స్థానాలు రిజర్వు చేస్తారు 7 గురు సభ్యులున్న ప్రతి పంచాయతీలోను ఒక మహిళకు 9 మంది కాని అంతన్నా అధికంగా గాని

సభ్యులున్న పంచాయతీలో ఇద్దరు మహిళలకు స్థానాలు రిజర్వు చేస్తారు

సర్పంచ్, ఉపసర్పంచ్‌లో విశ్వాసరాహిత్య తీర్మానాన్ని ప్రతిపాదించేందుకు కూడా అవకాశం కల్పించారు పంచాయతీల కాలపరిమితిని పెంచడంవల్ల ఈ అవకాశం కల్పించారు

రిజర్వు చేయని అటవీ ప్రాంతాలపై పంచాయితీలకు అధికారముంటుంది మత సంస్థల ఆస్తులు, పోరంబోకులు శ్మశానాలు, పశువుల దొడ్లు, బండ్లు నిలిచే స్థలాలు మొదలైనవన్నీ పంచాయతీ అధికారానికి లోబడి వుంటాయి

ఈ పంచాయతీలకు ఇండ్లపన్ను, వృత్తిపన్ను, ఆస్తిమారకంపై పన్ను మొదలైనవాటిని విధించే హక్కు కూడా వుంటుంది

---

# 27 రాజ్యాంగచట్టము

## (Constitution)

ప్రతి రాజ్యమందును రాజ్యనిర్వహణమునకై కొన్ని ప్రధాన సూత్రములుండును ఆ రాజ్యమందలి వివిధాంగములు, అనగా శాసన సభలు ఒకటో, రెండో, వాని సభ్యత్వము, ఎన్నికల విధానము, అధికారులు అధికారములు, మంత్రి తేర్పగు పద్ధతి, వారిని తొలగించు విధానము? న్యాయస్థానములు, వాని వివరములు, అధికారములు, ఇందొండొరులకుగల అన్యోన్య సంబంధములు విధులు, హక్కులు, ఆర్థిక విషయములు, యింక సంబంధించిన నిబంధనలన్నియు గ్రంథస్థము చేయబడియుండను ప్రజారాజ్యములలో పౌర హక్కులు గూడ విస్పష్టమొనర్చబడుచుండవి ఇట్టి సూత్రములు నిబంధనలు లేనిచో ఏయే సమయములందే యే శాఖవారేయే పనులను చేయవలెనో స్పష్టముగ తెలియకుండుటయేగాక, అధికారవర్గమునుండు వారు వారి చిత్తానుసారము ప్రభుత్వ నిర్వహణమును జరిపించుటయు తటస్థించును కావున రాజ్యధర్మము (Law) ను శాసించి సాంఘిక న్యాయము ప్రజాస్వాతంత్ర్యమును కాపాడుటకు సూత్రప్రాయముగనైనను రాజ్యాంగ విధులను గ్రంథస్థముచేయుట అవసరము దీనినే ఆ రాజ్యముయొక్క రాజ్యాంగ చట్టము లేక కాన్‌స్టిట్యూషన్ అందురు

రాజ్యాంగచట్టమనగా ఒక రాజ్యమందలి అంగములు లేక భాగములు (అనగా శాసన సభలు, కార్యవర్గము, న్యాయస్థానములు), వాని నిర్మాణము, విధులు, అధికారములను విపులపరచి శాసించు నిబంధనాదికము ఈ చట్టమే ప్రజలకు, ప్రభుత్వమునకు గల సంబంధమును, బాధ్యతలను, స్పష్టీకరించి ప్రభుత్వ విధుల ప్రజాహక్కులు, పరిపాలనా విధానమును ఆర్థిక విషయములను నిరూపించును

రాజ్యాంగ చట్టములు రెండు విధములు — (1) లిఖితములు (written), (2) అలిఖితములు (unwritten) అమెరికా ఫ్రాన్సు రాజ్యాంగములు లిఖితములు వీటిలో ఈరాజ్యాంగ విధానమంతయు గ్రంథస్థము చేయబడియుండును అలిఖిత రాజ్యాంగములో యీ నిబం

నిబంధనలన్నియు సంపూర్ణముగ గ్రంథస్థము చేయబడక, శాసనసభా చట్టములు, దేశాచారములు, పెద్దలతీర్పులు మున్నగువానిపై ఆధారపడియుండును. ఇంగ్లాండు రాజ్యాంగమీ రెండవతరగతికి చెందినది. భారతసంప్రదాయములో రాజధర్మమంతయు స్మృతులలో లిఖితమై యుండెడిది. ఈ స్మృతిశాసనము లనుల్లంఘనీయములు. ఇప్పటి మన రాజ్యాంగము లిఖితమే.

రాజ్యాంగ చట్టములు (Rigid, Flexible), అనగా, తేలికగ మార్చుటకు వీలులేనివి సులభముగ మార్చ వీలైనవి, అని యింకొక విభజన మున్నది. 'రిజిడ్' రాజ్యాంగమును మార్చుటకు హెచ్చు తతంగ మవసరము. ఉదాహరణ ప్రత్యేక సమావేశములు సభ్యులలో నాల్గింట మూడవంతులుకాని, మూడింట రెండువంతులుకాని సభ్యులు సమ్మతించుట వగైరా. 'ఫ్లెక్సిబిల్' రాజ్యాంగమును సామాన్య సందర్భములలోవలె సభ్యులయొక్క సాధారణ మెజారిటీచేత మార్పు చేయవచ్చును. అమెరికా రాజ్యాంగ చట్టము 'రిజిడ్' తరగతి, బ్రిటిష్ చట్టము 'ఫ్లెక్సిబిల్'. ఇండియాలో పూర్వకాలమునుండియు స్మృతులు మార్చుటకు కఠిన నియమము లేర్పడుటచే వాటిని అసలు మార్చుటకే అవకాశములేదని భావించెడివారు. కాని యిదిపొరపాటు. భారతీయ స్మృతులు కాలానుగుణ్యముగ అనేకమార్పులు జెందుటయే కాక, అట్టిమార్పులు చేయుటకు తగు అవకాశములును స్మృతులయందే ఉండెడివి. ఉదాహరణ అవతారములు, ధర్మపరిషత్తులు, [illegible] మొత్తముమీద భారతీయ స్మృతులు 'రిజిడ్' పద్ధతి ననుసరించెనని చెప్పవచ్చును. ఇప్పటి భారత రాజ్యాంగము కొంతవరకు 'రిజిడ్' వ కొంతభాగము 'ఫ్లెక్సిబిల్' యీ రెండుపద్ధతులను ననుసరించుచున్నదని మనము ముందు చదువుదుము.

—o—

# 28 జాతీయత

(Nationalism)

ప్రపంచములో మానవులలోని గుణకర్మలనుబట్టి వర్ణము, వృత్తినిబట్టి కులము, గ్రంథములను బట్టి మతసిద్ధాంతములు, రాజ్యాధికారమునుబట్టి రాజ్యములు, యెటుల యేర్పడినవో, జాతులును, జాతీయతయు అట్లే యుద్భవించినవి

"నేషన్" లేక "జాతి" యనగా, పుట్టుకలవల్ల ఏర్పడిన వర్ణమని చెప్పవచ్చును లేటిన్ భాషలో "Natus అనగా పుట్టిన అని అర్థము సంస్కృతమందు "జ లేక పుట్టుటనుండి "జాతి శబ్ద ముద్భవించెను కావున శబ్దార్థముచే 'జాతి" యనగ జన్మవల్ల ఏర్పడిన ఒక ప్రజా సముదాయమని చెప్పవచ్చును * కాని కాలక్రమేణ యీ 'జాతి అను పదమున కొక జన్మభావమేకాక మరికొన్ని యితర భావములను ఆరో పించబడుచున్నవి ప్రాంతీయైక్యత, ప్రజలలోని ఐక్యభావము, ఏకభాష, మతము, విజ్ఞానము, ఆచారసంప్రదాయములు, ఆర్థికలాభము, రాజకీయావసరములు మున్నగు విశేషణము లీ జాతి లక్షణములుగ భావింపబడుచున్నవి కాని సాధారణముగ యీ లక్షణములన్నియు ఒకే జాతియందు మనము కానము ఉదాహరణ అమెరికా సంయుక్తరాష్ట్రములలో (U S A) వివిధ దేశీయులగు ప్రజలు కలరు స్విట్జర్లాండు త్రిభాషాప్రాంతము మతే స్వాతంత్ర్యమతిశయించిన కొలదియు జాతీయతా లక్షణముల నుండి మతము వైదొలగుచున్నది ఉదాహరణ రష్యా తుదకు జాతీయతకు ప్రజలలోని ఐక్యభావమే ప్రధాన లక్షణముగ బరిగణించుచున్నారు

కావున ఒకానొక ప్రజ తామొకే వర్గమునకు జెంది, ఇతర జాతులవారితో భిన్నభావము, రీతులు కలిగియుంటిమని భావించెడిచో, అట్టి ప్రజ నొక ప్రత్యేక జాతి యనుచున్నారు వారికొక దేశము, విజ్ఞాన సంప్రదాయములు, ఏకభాష, మతము, మున్నగు యితర లక్షణములున్నవో, ఈ జాతీయతా పోషణకును, అభివృద్ధికిని అవి సహాయకారులగు కు సాధారణముగ ఒకే జాతివారొకే రాజ్యమం

"A people havıng a common orıgin"

దుండుటకు ప్రయత్నించుచురు ఆధునికులు జాతీయతకు స్వాతంత్ర్యమును అవసరమని చెప్పుచున్నారు ఉదాహరణ ప్రస్తుత సంయుక్త రాజ్య మండలిలో పరాధీన రాజ్యములకు తావు లేదు

ప్రపంచమందీ జాతీయతాభావము గత మూడువందల యేండ్లలో ఐరోపాలో హెచ్చుగ నభివృద్ధి జెందెను పోర్చుగీస్, డచ్, ఇంగ్లీషు, ఫ్రెంచి, జర్మన్, వర్తక పోటీలును, రాజ్యకాంక్షలును, ఈ భావమునకు మూలహేతువు లయ్యెను ఈపోటీలో బ్రిటన్ నందలి ఆంగ్ల, శాక్సన్, నార్మన్, వెల్షు, స్కాచ్, కెంటు, ఉపజాతులారును కలసి ఒకే "బ్రిటిష్ జాతియయ్యెను వీరి అన్యోన్య స్వార్థలాభములు వీరిలోని భిన్నత్వమును మరగుపరచెను ఈ రీతిగనే ఇటలీ, జర్మనీ, రష్యాలు చాలాకాలము ప్రయత్నించి మేజినీ, బిస్మార్కు, ఫ్రెడరిక్కుల నాయకత్వముక్రింద ఏకజాతిత్వమును సాధింపగలిగినవి నార్వే స్వీడన్లును, స్పెయిన్, పోర్చుగలు రాజ్యములును ఒకే ప్రాంతము నాక్రమించినను చారిత్రాత్మకముగ, భిన్నరాజుల పరిపాలనవల్ల భిన్న జాతులుగ పరిగణింపబడుచున్నవి ఇదే విధముగ చిన్న దేశములైన బెల్జియం, హాలండు, డెన్మార్కు, స్విట్జర్లాండు, ఆస్ట్రియా, హంగెరి, గ్రీసు, రుమేనియా మున్నగు దేశములు తమ ప్రత్యేక జాతీయతను ప్రకటించుకొన్నవి గ్రీసు రష్యాల నానుకొనియున్న తుర్కీదేశము మత, చారిత్రక భేదములచే ఒక ప్రత్యేకజాతి అయినది దీనినిబట్టి ఆశియాలోకూడ ఇండియా, చైనా, ఆఫ్ఘనిస్తాన్, బర్మా, పర్షియా అరేబియా, ఇండోనీషియా, జపానులు ప్రత్యేక జాతీయతను ఆశించుచున్నవి రెండువేల సంవత్సరములనుండి పాలస్తీనాలో యూదులనువారు రాజ్యభ్రష్టులు, దేశభ్రష్టులైనను, మతవిశ్వాసముచేత తమ జాతీయతను కాపాడుకొని నేడు తమ పూర్వరాజ్యమగు ఇజ్రైలును తిరిగి పొందగలిగిరి ఇందుకు మారుగ గత యేడువందల ఏండ్లనుండియు ఇండియాలో పుట్టిపెరిగినను మతాంతరులైన కారణముచే, తామొక భిన్నజాతివారమని పోరాడిన భారతీయ ముసల్మానులు 1947 లో పాకీస్తాన్ రాజ్యముచు ఒడసిరి దీనినిబట్టి యెంత విమత" యుగమైనను (Non religious or Secular) యీ కాల

యందుగూడ మతభావమెట్లు జాతీయతకు తోడ్పడుచున్నదో మనము గ్రహింపగలము కాని ఆధునికరాజ్యము లన్నింటిలో మతసహన మొక ముఖ్యలక్షణముగ గాన్పించుచున్నది

మొత్తముమీద పాశ్చాత్య జాతీయత గత మూడువందల యేండ్లలో ఐరోపా ప్రజలను కొంతవరకు ఉన్నతస్థితికి దెచ్చినను, ఆసియా, ఆఫ్రికావాసులు మాత్ర మీ భావముక్రింద హతమారి పోయిరనుట అతిశయోక్తి కానేరదు ఐరోపాఖండమందును, యీ జాతీయత అనేక కలహములకును, యుద్ధములకును హేతుభూతమై, భిన్నజాతీయతా భావమునకు తోడుగ యింకొక అంతర్జాతీయతగూడ మానవాభ్యుదయమున కవసరమని పలువురు తత్త్వవేత్తలు, రాజకీయవేత్తలు, భావించుచున్నారు ఐరోపా అంతయు నొకె సమ్మేళనా రాజ్యము (Federation) కావలెనని యిప్పుడు వారిలో బుద్ధిమంతులు కొందరి ఆశయము ఇటులనే ఆసియా సమాఖ్యకై లోగడ దేశబంధు చిత్తరంజనదాసును, అమెరికా సమాఖ్య కొరకు రూజ్‌వెల్టు అధ్యక్షుడును కొంతవరకు యత్నించిరి ప్రపంచమందలి అన్నిజాతులును కలసి ఐక్యరాజ్యమండలిద్వారా తమ వ్యవహారములను పరిష్కరించుకొనవలెననియు నేడు వివిధ జాతులు యత్నించుచున్నవి ఒకే రాజ్యమందలి అల్పసంఖ్యాకులగు అన్య జాతీయులకు ప్రత్యేక రక్షణ లొసగబడుచున్నవి

---

# 29. ఇండియా ఒక జాతి యగునా?

గత యేభై యేండ్లలో ఇండియా ప్రతికక్షులగు బ్రిటీషువారును, మసల్మానులును, "ఇండియా ఒక దేశముకాదు భారతీయులొక జాతివారు కారు ఇచ్చట భిన్నజాతులు, మతములు, భాషలు, సంప్రదాయము లుండుటచే, ఇది ఐరోప వంటి ఒక ఖండము లేక ఉప ఖండము" అనెడివారు ఈ సాకుతో బ్రిటీషువారిచ్చట తమ పరిపాలనను సాద్యమైనంతవరకు సాగించుకొనిపోయిరి ముసల్మానులును బ్రిటీషువారి అండచూచుకొని, భారతావనియొక్క తూర్పు పశ్చిమ భాగములను విడదీయుంచుకొని, తమ ప్రత్యేక "జాతీయత" కొరకు పకిస్తానము నేర్పచుకొనిరి 'పాకిస్థాన్' అనగా అరబ్బీ భాషలో పవిత్రస్థానమని యర్థము యథార్థమునకు యావద్భారత ఖండమును కర్మభూమియే యని పెద్దలు చెప్పుదురు కావున ఇండియా ఒక దేశమో? లేక ఖండమో? భారతీయులొక జాతివా రగుదురో? కారో? మనము విచారించుట యవసరము

ఇండియా ఒక జాతియేనని యిటీవల రూఢిగ జెప్పినవాడు, డాక్టరు రాధాకుముద్ ముఖర్జీ ఆతని తర్వాత ఆనిబిసెంటు దొరసాని ఇందుగూర్చి ఒక గ్రంధము వ్రాసెను అంతకు పూర్వమే 1885 లో భారతజాతీయకాంగ్రెసు (Indian National Congress) స్థాపించబడి మన జాత్యైక్యతకొరకు ప్రశంసనీయమగు సేవ జేసినది కాని యిటీవల మాత్రము వీరు దేశవిభజనకు 'విధిలేక" అంగీకరించిరి, కాని యిచ్చట రెండుజాతుల సిద్ధాంతములో వారి కిప్పటికిని నమ్మికలే దందురు

ఇండియా ఒక దేశముకాదు, ఇదియొక ఖండమనువా రీదిగువ రీతి వాదింతురు

1 ఇండియా చాల పెద్దదేశము, దాదాపు ఐరోపాఖండములో రష్యాపోను మిగతాభాగమంత విస్తీర్ణముగలది

2 ఇచ్చట జనాభా దాదాపు 50 కోట్లు అనగా రమారమి

ఐరోపా అంత బ్రిటన్ జనాభా 5 కోట్లు, ఫ్రాన్సు 6 కోట్లు, జర్మనీ 8 రష్యా 20, అమెరికా U S A 18 కోట్లు

3 ఇచ్చట భాషలును పెక్కుగలవు హిందీ, బెంగాలీ, తెలుగు మున్నగు ముఖ్యభాషలు పదునాలుగు చిన్నభాషలు రెండు వందలకు మించియుండును

4 మతములలో యిచ్చట హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, శిఖ్ఖు, పారశీకాది మతభేదములున్నవి

5 జాతులలో ఆదిమవాసులు ద్రావిడులు, ఆర్యులు మంగోలులు, పహ్లవ, యవన, శకాదిజాతులు, అరబ్బులు, ఆంగ్లాది వివిధ జాతుల మిశ్రమ సంఘము – మన ప్రస్తుత భారత సంఘము

6 ఆచార వ్యవహారములందును, సంగీత సాహిత్యములు, భాషాలిపులందును, యిచ్చట ఉత్తరదక్షిణాది భేదములు ముఖ్యములు

7 చారిత్రాత్మకముగ బ్రిటిష్ శకమువరకు ఇండియా యెన్నడును ఒకే బావుటాక్రిందకు రాలేదు బ్రిటిషువారి హయాములో ఏర్పడిన దేశైక్యత వారితోనేపోయెను కావున ఇండియా ఒక జాతికాదు కనీసము హిందూముస్లింజాతులకైనను యిది అట పట్టని వీరు వాదింతురు

ఇక ఇండియా ఒకెజాతి అనువారి వాదన యెట్టిదనగా —

1 ఇండియాలో అన్ని ప్రాంతములకు ముఖ్యమగు మతగ్రంథ మొక్కటే "శ్రుతి ప్రమాణం", అనగా వేదమే ప్రమాణము అన్ని చోట్లను వేదములు నాలుగే వేదాంగములు ఆరు ఉపనిషత్తులు, పురాణేతిహాసములు, స్మృతిధర్మములు మంత్రతంత్రాదులు, గీతలు, దర్శనములు నొక్కటే

2 అచ్చట త్రిమూర్తులు, దేవతలు ఒక్కటే రామకృష్ణాది అవతారములు, 24 కేశవనామములు, దుర్గ, లక్ష్మీ, సరస్వతులు, హనుమాన్, గణేశులు యెల్లెడలను ఆరాధనీయములు

3 సాంఘికవ్యవస్థలో యిచ్చట వెలసిన వర్ణాశ్రమపద్ధతి మరెచ్చటను లేదు ఉపనయనము, గాయత్రీమంత్రము, వివాహ విధానము తదితర సంస్కారములు, ఒక్కటే

4 ఇచ్చట సంవత్సరములు, నెలలు, వారములు, నక్షత్ర ములు, వీటివరుసలు ఒక్కటే సంవత్సరాది 15 రోజుల తేడాతో ఉత్తరదక్షిణాములు కొక్కటే ఉత్సవములు, నదులు, పుణ్యక్షేత్ర ములు ఒక్కటే శ్రీరామనవమి, కృష్ణాష్టమి, బుద్ధజయంతి, వినాయకచతుర్థి, దసరా దీపావళి, సంక్రాంతి, వగైరా పుణ్య తిథులును, కాశీ, గయ, ప్రయాగ, హరిద్వారము, ద్వారక, పూరి, తిరుపతి, శ్రీశైలము, శ్రీరంగము, బదరిక, భద్రాద్రి, సింహాద్రి, మున్నగు పుణ్యతీర్థములును సర్వజనసమాదరణీయములు

5 రాజ్యాంగవిషయమై ఇప్పటి గ్రామ, ఫిర్కా, తాలూకా, జిల్లాలు మనువుకాలమునాటి గ్రామ, దశగ్రామ, శతగ్రామ, సహస్ర గ్రామపద్ధతి నుండి వచ్చినవే ఇచ్చటి పంచాయితీ పద్ధతి, సప్తాంగ సూత్రము, పరిషత్తుమార్గము, దండనీతి అన్నియు ఒక్కమూస నుండి వచ్చినవే

6 ఇచ్చటి సంగీతము, జ్యోతిషము, నాట్యము, వైద్య శాస్త్రము చతుష్షష్టి కళలు, వ్యవసాయ రీతులు, వృత్తులు, పన్నుల విధానము, పితృకర్మలు, కర్మతత్వము, పునర్జన్మయందలి విశ్వాసము, పురుషార్థములు, మోక్షాసక్తి, అన్ని ప్రాంతములకు వర్తించును

7 చారిత్రాత్మకముగ యిచ్చటి మహాసంకల్పములోని చెప్పన్న (56) రాజ్యములు, "భారతవర్షే బారతఖండే యను సంధ్యా సంకల్పము, అశ్వమేధయాగము, రాజసూయయాగముల వల్లనే కాక, అశోకుడు, ఆంధ్ర చక్రవర్తులు, కుషానులు, గుప్తరాజులు, అల్లాయుద్దిన్, అక్బరు, ఔరంగజేబు, శివాజీ మున్నగు వారెల్లరును

ఏకభారత సామ్రాజ్యమునే ఆదర్శముగ గైకొని, దాదాపు సఫలత జెందిరి

ఇందు కొన్ని విషయములలో ప్రాంతీయభేదము లున్నను, జాత్యైక్యతనింకను బలపరచుట యెంత అవసరమైనను, భారతీయులలో జాత్యైక్యత స్థిరమైనదని మనము భావించవచ్చును భారతీయులకును ఇతరజాతులకును అనేక విషయములందు తేడా లగుపడుచున్నవి కనీసము మహమ్మదీయులు మన దేశమునుండి విడిపోయిన ఎమ్మట శేషించిన హైందవజాతియైన నొక్కటికాదనుట హాస్యాస్పదము అల్ప సంఖ్యాకవర్గముల మాట యెట్లున్నను యిచ్చట నూటికి తొంభైమంది భారతీయులనుట నిస్సంశయము ఇట్టి భారత జాతీయతను సర్వవిధముల బలిష్ఠపరచుటకై యిటీవల కొన్ని యత్నములు జరుగుచుండుట ముదావహము ఇట్టి యత్నములలో కేంద్రప్రభుత్వమేర్పరచిన జాత్యైకీకరణ సమితి (National Integration Council) ముఖ్యముగ పేర్కొనదగినది

## 30 అంతర్జాతీయత - శాంతిరక్షణ

ప్రపంచమంతయు యిప్పుడు కొన్ని జాతులు, రాజ్యములు, మతములు, వర్గములుగ విభజింపబడియున్నది

గత మూడువందల ఏండ్లనుండియు ఐరోపా జాతీయులు, ఆసియా, ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా ఖండములపై దండ యాత్రలు చేసి, లేక వలసపోయి, తమబలమును, రాజ్యములను, నాగరికతను స్థాపించుకొనిరి దీని ఫలితముగ ఆసియా, ఆఫ్రికాఖండ వాసులడుగంటిపోవుటయు తటస్థించెను ఇటీవల గత యేబదిఏండ్లలో వీరు తమ చైతన్యమును కొంతవరకు కోలుకొనుచున్నారు

రాజకీయముగ రాజ్యవిస్తరణకై రాజులొండొరులు కలహించుకొనుట చారిత్రాత్మక విషయము

అనాది సిద్ధముగ మతములలో అంతఃకలహము లుండుచు వచ్చినను, మహమ్మదియమతము రాజ్యవిషయములతో ఏకీభూతమైన ప్పటినుండియు ఐరోపాలో క్రైస్తవ మహమ్మదీయులకును, ఆసియాలో ముస్లిమ్ ముస్లిమేతరులకును తీవ్రమగు యుద్ధములు చెలరేగి, కోటానకోట్ల ప్రజలు నశించరి తిరిగి యిప్పుడు ప్రపంచమందలి మహమ్మదీయ జాతులన్నియు ఏకమగుటకు కొన్ని ప్రయత్నములు జరుగుచున్నవి

ఆర్థికముగ ప్రపంచమంతయు ధనిక, పేదవర్గములుగ విభజింప బడుచు, ఒకే దేశమందలి కోటీశ్వరులకును, కూడులేనివారికిని ప్రపంచమందలి "కేపిటలిస్టు", "కమ్యూనిస్టు" రాజ్యములకును నిరంతర పోరాటము సాగుచున్నది ఇందమెరికా యొక వర్గమునకును, రష్యా రెండవదానికి నాయకత్వము వహించుచున్నవి

గత యేభైయేండ్లలో రెండు ప్రపంచ సంగ్రామములు జరిగినవి వీటిలో కోటానకోట్లు ప్రజలు మడసిరి అర్బుదముల ఆస్తి బూడిదపాలో, నీటిపాలో అయ్యెను మానవుల మానవత్వమంతరించెనో యన్నట్లు పైశాచిక శక్తులు ప్రబలినవి రెండు ఆటంబాంబులతో నిరాయుధులగు రెండు లక్షల ప్రజలు ఒక్క హిరోషిమా, నాగసాకీలలోనే నశించిరి తిరిగి యీ ఆటమ్ బాంబులవస

రము లేయే కొరియా, ఇండోచైనా యుద్ధములెట్లనో సమసిపోయి నవి ఇటీవల సూయజ్‌పై దండయాత్ర సాగెను బెర్లిన్, జర్మనీ సమస్యలు క్లిష్టాతిక్లిష్టముగ సిద్ధమైనవి నిత్యము మారణ యంత్రములు సృష్టింపబడుచున్నవి

ఇట్టి పరిస్థితులలో మూడవ ప్రపంచయుద్ధ మెప్పుడు వచ్చునా ? యని పలువురు భయపడుచున్నారు అట్టి యుద్ధములు రాకుండ జేసి "ప్రపంచమందలి ప్రజలెల్లరు సోదరులే, శాంతియుతముగ మన సమస్యలను మనము పరిష్కరించుకొందము", అని ప్రయత్నించు వారును లేకపోలేదు ఇట్టి ప్రయత్నములలో 1920లో స్థాపింపబడిన అంతర్జాతిసమితి 1945 లో యేర్పడిన ఐక్య రాజ్యమండలి (U N O) యీ రెండు సంస్థలును ముఖ్యములు ఈ రెండును యుద్ధ సమయములందే ఏర్పడినను, వీని పరమావధి ప్రపంచ శాంతి, మానవ స్వాతంత్ర్యము, సమత్వములు

ప్రపంచములో అశాంతికిని, యుద్ధములకును, మూలకారణము లెవ్వియో గ్రహించినచో ఈ యుద్ధములను నివారించు మార్గములను మనము కనుగొనగలము

మానవులలో కలహకారణములు మూడు 1 మతావేశము, 2 రాజ్యకాంక్ష, 3, ధనలాభము

అంతర్జాతీయముగా శాంతి సౌభ్రాతృత్వములను నెలకొల్పుటకు కలహకారణములైన యీ మత, రాజ్య ధనములను నిర్మూలించుటలవసరమని కొందరు చెప్పుదురు కాని యిది సరికాదు మత విషయములలో అన్యోన్య సహనభావముతో యెవరి మతమును వారనుసరించుచు, ప్రపంచమంతకును ఒక నూతన సమన్వయధర్మమును పెంపొందించుట యొక్కటే యిందుకు శరణ్యమని తోచును ఈ పద్ధతినే యిటీవల చర్చిల్, ఐసెన్‌హోవర్ ప్రభృతులు సహజీవన పద్ధతి (Doctrine of Co existence) అని ప్రకటించిరి, నెహ్రూ, చౌఎన్‌లైలు 'పంచశీల" యని వర్ణించిరి *

---

* 'పంచశీల" యనగా (1) వివిధ రాజ్యములు ఉండొయుం రాజ్యభాగములను అధికారవ లను గౌరవించుకొనుట (2) ఒకరిపై యింకొకరు దాడిచేయకుండుట (3) అంతరంగిక వ్యవహారములందు జోక్యము కలుగజేసుకొనకుండుట (4) సమానత్వము, అన్యోన్య సహాయము (5) శాంతియుత సహజీవనము

ఇటులనే రాజ్యవిషయములం దొకజాతి యింకొకజాతిని బానిసలుచేయు పద్ధతిని రూపుమాపవలెను లోగడవిషయము తెల్పియున్నను, బ్రిటన్ ఇండియాపై యిక అధికారమును చెలాయించలేనని గ్రహించుటచేతనే అంతటి మహాసామ్రాజ్యమును 1947 లో యిచ్చుటనుండి ఒక్కత్రుటిలో విడిచిపోయెను ఫ్రాన్సు, ఇండోచైనాలోను మనదేశమందలి పుదుచ్చేరి మున్నగు స్థావరములనుండియు తన బావుటాను తొలగించుకొని పోయెను గోవాలో పోర్చుగీసు రాజ్య మిటీవలనే అంతరించెను కాని ఆల్జీరియా మున్నగుచోట్ల యింకను యీ కొలోనియల్ పద్ధతి కొనయూపిరితో పెనగులాడుచున్నది

ఆర్థికవ్యవహారములలో పూర్వకాలపు పద్ధతులు ప్రపంచమందంతటను చాల భాగము మార్పుచెందినవి అన్ని దేశములందును మునుపటి 'జేరన్లు, రాజుల పద్ధతి అంతరించుచున్నది కాని క్రొత్త పారిశ్రామిక విధానములో కొందరు కోటీశ్వరులై, వారి ఐశ్వర్యముతో ప్రపంచమందలి పేదలను పీడించుచున్నారు ఈ సందర్భమందుగూడ ప్రపంచ ప్రజలలో ఒక నూతన ఆర్థిక సమన్వయ సూత్ర మవసరము అందు ముఖ్యముగ ధనికులగు పారిశ్రామికులు తమ యొద్ద పనిచేయు కార్మికులను తమకుపకరించు పనిముట్లుగ జూడక, వారిని తమ బిడ్డలుగ భావించి, వ్యవహరించుట అవసరము

కాని యీ వివిధ వర్గములను సంఘములను వలయు సమన్వయ మార్గమునకు తెచ్చుటెట్లు? వీరందరును 'యెవరికివారే-యమునా తీరే' అన్నట్లు యెవరిపని వారు మునిగి తేలుచుండగా ప్రపంచ శాంతి మానవ సౌభ్రాతృత్వము సమానత్వము యెట్లు నెలకొల్ప వడగలవు?

ఇందుకై [illegible]2 లో అంతర్జాతీయ సమితి 'L ague of Nations) యును 19[illegible] లో యేర్పడిన యు ఎన్ ఓ (ఐక్యరాజ్య మండలి) యు కొంత కృషి చేయుచున్నవి

యు ఎన్ ఓ లో [illegible] రాజ్యము లున్నవి వీనిలో అమెరికా రష్యా [illegible] ఇంగ్లాండు మున్నగు ప్రముఖ రాజ్యములు కలవు యు [illegible] [illegible] ఈ ఆదర్శమును [illegible] [illegible] [illegible] లక్ష్యము

చేయుచున్నారు యు ఎన్ ఓ సేనలు కొరియాలో తుదకు యుద్ధమునకు గూడ గడంగినవి పాలస్తీనాలో, కాశ్మీరులో పశ్చిమాశియాలో, నేడు కాంగోలో, యితరచోట్ల శాంతిరక్షణకై వీరు ప్రయత్నించుచున్నారు

ఈ యు ఎన్ ఓ కు తోడుగ ప్రపంచ శాంతిభద్రతలను కాపాడుటకై వివిధ రాజ్యములలో పలు సమిష్టి యత్నములు సాగుచున్నవి అందు పూర్వపు బ్రిటిష్ సామ్రాజ్యస్థ రాజ్యములగు ఇంగ్లాండు, కెనడా ఆస్ట్రేలియా మున్నగు రాజ్యములు భాగస్వాములై యొక కామన్ వెల్తు (Commonwealth) నేర్పరచుకొన్నవి ఇందు ఇండియా పాకిస్తానులుకూడ భాగస్వాములై యున్నవి అటులనే అమెరికా (U S A), కెనడా, బ్రిటన్, ఫ్రాన్సు మున్నగు 13 అమెరికా-ఐరోపా రాజ్యములు ఉత్తర అట్లాంటిక్ సంధిసమాఖ్య (North Atlantic Treaty Organisation—NATO) నేర్పరచుకొన్నవి పసిఫిక్ రక్షణకై అమెరికా (U S A), ఆస్ట్రేలియా, న్యూజిలాండు రాజ్యము లింకొక సంధిచేసుకొన్నవి రష్యా చైనాలొక సమాఖ్యగ వవ్యహరించుచున్నవి మధ్యప్రాంత రక్షణకై టర్కీ, ఇరాన్, ఇంగ్లాండులు కలసి బాగ్దాద్ సంధి నేర్పరచుకొన్నవి వీనిలో పాకిస్థాన్ గూడ చేరినది ఇంతేకాక అమెరికన్ ఫెడరేషన్, యూరోపియన్ కౌన్సిల్, ఆసియా సమాఖ్య మున్నగు ప్రాంతీయ సంస్థల నేర్పరచుటకు యత్నములు జరుగుచున్నవి

కాని యిట్టిసంస్థ లెన్ని యున్నను, మానవుని హృదయమందు మానవత్వమంకురించి ఎల్లరు మానవులు ఏకోదరులు, తమలో తాము కలహించరాదు, అనుభావ ముదయించినగాని ప్రపంచశాంతియు, లోకకళ్యాణము చేకూరుట కష్టసాధ్యము ప్రస్తుతస్థితిలో అన్నిచోట్లను అసంఖ్యాకులగు ప్రజలు కొద్దిమంది రాజకీయవేత్తల చేతులలో కీలుబొమ్మలవలె నున్నారు అట్టితరి ఆత్మోపలబ్ధికై వారులు తమ పౌరధర్మమును గుర్తెరిగి, కేవల జాతీయపౌరులుగ మాత్రమే కాక ప్రపంచపౌరులుగ గూడ వ్యవహరించినగాని యీ పరిస్థితి మారుటకు నెమ్మ అవకాశముండదు చక్రస్సాగిర పర్యంతమ్మగు ఈ ప్రాపంచిక పౌరభావమే అంతర్జాతీయ శాంతి ముఖ్యకీలకము, సాధనమైయున్నది

# 31. కామన్‌వెల్తు
## ( COMMONWEALTH )

ప్రపంచమందలి జాతీయతాసూత్రమునకు భంగములేకుండా, వివిధజాతులలో అంతర్జాతీయసహాకారము, తోడ్పాటును సాధించుటకు ఇటీవల యేర్పడినసంస్థలలో (బ్రిటిష్) కామన్‌వెల్తు (Common wealth) యొకటి అని మనము లోగడ చదివియుంటిమి ఇప్పుడీ కామన్వెల్తులో 1 బ్రిటన్, 2 కెనడా, 3 పాకిస్తాన్, 4 భారత రిపబ్లిక్, 5 సింహళము, 6 ఆస్ట్రేలియా 7 న్యూజిలాండు, 8 రోడీషియా, 9 ఘనా 10 మలయా, 11 నైగీరియాలను రాజ్యములు సభ్యత్వము గలిగియున్నవి వీటిహోదాలు అధికారములు అన్ని విధముల సరిసమానమని నిర్ణయించబడినది

స్వాతంత్ర్యము, న్యాయము, ఆర్థికక్షేమము—వీటిపై ఆధారపడి బాధితులగు మానవకోటిలో శాశ్వతశాంతి నేర్పరచు మహత్కార్యములో ప్రాక్ప్రతీచీసమ్మేళనాచిహ్నమగు ఒక ఆశాజ్యోతిగా నుండుటయే యీ కామన్‌వెల్తు యొక్క ప్రధానోద్దేశ్యమని ప్రకటించబడినది ఆర్థికముగను, సాంఘికముగను, రాజకీయముగను, యిందలి సభ్యరాజ్యములు సంపూర్ణస్వాతంత్ర్యము గలిగియుండును కామన్వెల్తు వ్యవహారములందు వీరిలో సరిమానత్వముండును అనగా యెక్కువ తక్కువలుండవు ఇందొకరి ఆంతరంగిక వ్యవహారములలో మరొకరు జోక్యము కలుగజేసుకొనరాదు

ఈ కామన్వెల్తు వ్యవహార నిర్వహణకై ఒక లెజిస్లేచర్ కాని, ఎగ్జిక్యూటివ్ కాని యుండవు అవసరముబట్టి అప్పుడప్పుడీకామన్వెల్తు సమావేశములు వివిధ దేశములలో జరుగును మొదట యీ సమావేశములు లండన్‌లో మాత్రమే జరుగుచుండెడివి వాటికి బ్రిటిష్ ప్రధాని అధ్యక్షత వహించెడివాడు 1950 జనవరిలో యీ సమావేశము సింహళము నందలి కొలంబోలో జరిగెను ఆ సభకు సింహళ ప్రధాని అధ్యక్షత వహించెను దరిమిలా సభలన్నియు తిరిగి లండన్‌లోనే జరుగుచున్నవి

ఈ సమావేశ నిర్ణయములు సభ్యరాజ్యములకు కేవలము శిఫారసులు మాత్రమేకాని శాసనములు కావు

ఈ కామన్వెల్తుకు బ్రిటిష్ రాజ్ఞి "సంజ్ఞాపూర్వక అధిపతి" లేక పెద్ద (Symbolic Head) గ నుండును ఈ మెకెట్టి ప్రత్యేకాధికారములు నుండవు ఇందలి సభ్యులు తమ అన్యోన్యలాభము కొరకును, U N O ఆదర్శములకు లోబడి ప్రపంచ శాంతికిని కృషి చేయుదురు

ఈ కామన్వెల్తు ఆర్థికముగ ఎగుమతి దిగుమతులు, సుంకముల నిర్ణయము, అమెరికన్ డాలర్ల మారకము మున్నగు హంశములలో ఇందలి వివిధ సభ్యులకు కొంతవరకు ఉపయుక్తముగ నున్నను, ప్రస్తుత పరిస్థితులలో ప్రపంచరక్షణ కీ సంస్థ యెక్కుడు ప్రయోజనకారి యగునని తోచదు ఏలయన, ఇందలి సభ్యరాజ్యములు ప్రపంచమంతయు వ్రాకియున్నవి ఈ రాజ్యములే యు యన్ ఓ లో కూడ సభ్యత్వము బడసియున్నవి తిరిగి ఉత్తర అట్లాంటిక్ సమాఖ్యయందును, బాగ్దాద్ సంధిలోను, పసిఫిక్ సంస్థలోను విడివిడిగా సభ్యత్వము బొందియున్నవి అట్టితరి యీ కామన్వెల్తు ప్రత్యేకముగా సాధించు శాంతిలక్ష్యములుగాని, అట్ట రక్షణకు వలయు సాధనములుగాని వీరివద్ద విశేషముగా గాన్పింపవు ఈ రాజ్యములలో దక్షిణాఫ్రికా శ్వేతేతర జాతులయెడ అవలంబించుచున్న 'అపర్థాయిడ్' (Aparthoid) అను రాక్షసవిధానము ప్రపంచైక్యతకు, కామన్వెల్తు ఐక్యతకు వేరుపురుగుగ బరిణమించుచున్నది అపర్థాయిడ్ అనగా దక్షిణాఫ్రికా రాజ్యములో తెల్లవారు నల్లజాతులను చట్టములందును, వోటింగు హక్కులలోను, బడులందును, నివాసములు మున్నగువానియందును, అస్పృశ్యులుగ జూచుట ఈ కారణముచేత దక్షిణాఫ్రికా కామన్వెల్తు సభ్యత్వమునుండి తొలగించబడెను ఇటులనే ఇండియా పాకిస్థానుల అన్యోన్యకలహము లీసంస్థను బలహీనపరచక మానవు ఇంతేకాక, యీ కామన్వెల్తు కొక సాధికారియగు పెద్దకాని, ఒక శాసనసభ, కార్యవర్గము, న్యాయస్థానము, వలయు ఉమ్మడిధనముకాని సేనలుకాని లేనందున యీ సంస్థ కేవలము లాంఛన ప్రాయముగనో, లేక అలంకారముగనో మాత్రమే పరిణమించుచున్నది దీని నిప్పుడొక 'సాంఘిక క్లబ్బు" గ కొందరు భావించుచున్నారు

# 32. ఐక్యరాజ్యమండలి (U N O)

వివిధ రాజ్యములలో మానవకోటియొక్క ఆర్థిక, సాంఘిక, రాజకీయాభ్యుదయములకై పాటుపడుచు, యావత్ప్రపంచమందును ప్రజలలో ఏకీభావమును పెంపొందించి, యుద్ధముల నరికట్టుటకుగాను గత నలుబదియేండ్లలో రెండు మహోద్యమములు బయలుదేరినవి అందొకటి ప్రథమ యుద్ధానంతర మేర్పడిన నానాజాతి సమితి (League of Nations) రెండవది ఐక్యరాజ్యమండలి (United Nations Organisation) ఇందు నానాజాతిసమితి ప్రథమయుద్ధానంతరము 1920 లో నవతరించి, ప్రపంచశాంతి రక్షణకును, అంతర్జాతీయ సహకారమునకును కొంత సేవచేసి, ద్వితీయ యుద్ధారంభమున 1939 లో అంతరించెను

U N O రెండవయుద్ధ కాలమందుదయించెను దీనికిమూలకారకులు, అప్పటి అమెరికా అధ్యక్షుడు రూజ్ వెల్టు, బ్రిటిష్ప్రధాని చర్చిలుగారలు అమెరికా, బ్రిటన్, రష్యా చైనా ప్రతినిధులు ముందుగ దీని ప్రణాళికను ప్రకటించిరి ఐక్యరాజ్యమండలి మొదటిసారి ది 25 4-45 న శాన్ఫ్రాన్సిస్కోలో కూడెను ది 24-10-45 నుండి కథాప్రారంభమయ్యెను అందుచేతనే యేటేట 24వ అక్టోబరు యు యన్ ఒ ఉత్సవదివసముగ బరిగణింప బడుచున్నది ప్రస్తుత మీ సంస్థలో 104 రాజ్యములు చేరినవి ఇండియా మొదటి నుండియు యీ సంఘమందు సభ్యత్వము గలిగియున్నది యుద్ధములో ఓడిపోయిన జర్మనీ కింకను యిందు సభ్యత్వము లేదు

ఐక్యరాజ్యమండలి యుద్దేశ్యము లేవనగా (1) ముందువచ్చే పురుషాంతరములను యుద్ధముల బారినుండి రక్షించుట, (2) మానవహక్కులందును గౌరవమర్యాదలందును, స్త్రీ పురుషాదుల యొక్కయు, చిన్న పెద్ద జాతులయొక్కయు సమాన హక్కులను, విశ్వాసములను, పునరుద్ధరించుట, (3) న్యాయము, సంధి ఒడంబడికలు, అంతర్జాతీయ నిర్ణయములను అమలు జరుపుటకు వలయు పరిస్థితులను కల్పించుట, (4) విశాలమగు స్వాతంత్ర్యములో సాంఘికాభివృద్ధి, జీవిత ప్రమాణములను పెంపొందించుట ఈ ఉద్దేశ్యము

లను నిర్వహించుటకై వలయు సూత్రములను అంగీకరించి, పద్ధతుల నవలంబించి, సైనికబలమును అందరి క్షేమము కొరకు మాత్రమే ఉపయోగించుట, అందరు ప్రజలయొక్క ఆర్థిక, సాంఘికాభివృద్ధికిని అంతర్జాతీయ సంస్థలను వినియోగించుట

ఈ సంఘలక్షణములు ముఖ్యముగ నాలుగు (1) అంతర్జాతీయ శాంతిభద్రతలను కాపాడుట, (2) ప్రజలయొక్క సమాన హక్కులు, స్వయంనిర్ణయ సూత్రములపై (Self determination) ఆధారము చేసు కొని వివిధ జాతులలో స్నేహభావమును పెంపొందించి, ప్రపంచ శాంతిని బలపరచుట, (3) ప్రాపంచిక ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక సమస్యలను పరిష్కరించుటలో అంతర్జాతీయ సహకారమును సమ కూర్చి, జాతి, లింగభేదములు లేకయే ఎల్లరు మానవులకు జీవిత హక్కులు, ప్రాథమిక స్వత్వములు చేకూరునట్లు పాటుపడుట, వీనిని ప్రోత్సహించుట, (4) ఈ ఉద్దేశ్యములు సాధించుటకై వివిధ జాతులు చేయు పనులను క్రోడీకరించు కేంద్రముగ వ్యవహరించుట

ఈ సంస్థయొక్క ప్రధానాంగములు ఆరు - 1 సాధారణ సభ (General Assembly), 2 భద్రతా సంఘము (Security Coun cil), (3) అంతర్జాతీయ న్యాయసభ, (4) ఆర్థిక సాంఘిక సభ, (5) ట్రస్టీసభ, (6) కార్యవర్గము (Secretariat)

సాధారణ సభ - యు యస్ ఓ యొక్క సాధారణ సభలో సంఘ సభ్యులందరకు ప్రాతినిధ్యముండును ఒక్కొక్క సభ్యరాజ్య మునకు 5గురకు మించని ప్రతినిధులుందురు ఈ సంఘమునకు సంబం ధించిన అన్ని విషయముల గూర్చి ఈ సభ చర్చించవచ్చును సంఘ బడ్జెటును నిర్ణయించును ప్రతిసభ్య రాజ్యమునకును యిం దొక్కటే వోటుండును ముఖ్యవిషయములలో 2/3 మెజారిటీ అవసరము ఇతర విషయములలో సాధారణ మెజారిటీ చాలును ఏడాది కొకసారి యీ సభ కూడవలెను అవసరమైనచో ప్రత్యేక సమావేశములు జరుప వచ్చును ప్రతి సమావేశమునకు ఒక అధ్యక్షుని యెన్నుకొందురు అవసరమగు అనుబంధ సంస్థలను యీ సభ ఏర్పరచుకొనవచ్చును

భద్రతాసంఘము - భద్రతాసంఘమందు 11గురు సభ్యులుందురు ఇందు చైనా, ఫ్రాన్సు, రష్యా, బ్రిటను, అమెరికాలు (U S A) అయిదును శాశ్వత సభ్యులు వీనిలో చైనా విషయమై జంగ్ కై షేక్ ప్రభుత్వమును గుర్తించవలెనా? లేక కమ్యూనిస్టు చైనానా? అను విషయమై తీవ్రముగు భేదాభిప్రాయములు పెరిగినవి మిగత ఆరుగురను సాధారణసభ రెండేళ్ల కొకసారి యెన్నుకొనును భద్రతాసంఘ మేటేట సాధారణ సభకు నివేదిక పంపును ఇందలి ప్రతి సభ్యున కొక్కవోటుండును ఈ సంఘ తీర్మానములు సంఘమందలి శాశ్వత సభ్యులు అయిదుగురును, అదనముగ మరి యిద్దరును, అనగా ఏడుగురికి తక్కువకాని సమ్మతులతో అంగీకరించబడును శాశ్వత సభ్యులు అయిదుగురిలో యే ఒక్కరైనను యీ సంఘ వ్యవహారమంతయు భగ్నపరచుటకు అధికారము గలిగియున్నటుల దీనివల్ల మనము గ్రహింపగలము దీనినే 'వీటో' (Veto) అందురు ఈ అధికారమును వినియోగించి రష్యా యీ సంఘమందు తరుచు ప్రతిష్టంభనకు గడంగుచున్నది అంతర్జాతీయ శాంతిభద్రతలకు భంగము వాటిల్లునప్పు డిందుకు సంబంధించిన పార్టీలను, తమ తగాదాలను శాంతిమార్గమున పరిష్కరించుకొనవలెనని భద్రతాసంఘము నిర్ణయించును ఉదాహరణ పాలస్టీన్, కాశ్మీర్, సూయజ్, అంతర్జాతీయ శాంతిభద్రతలను నెలకొల్పుటకై (U N O) సభ్యులెల్లరు తగు సహకారము నొనర్చి ధనమును, సేనలను సప్లయి చేయవలయును అవసరమని తోచినచో (U N O) సైనికబలముకూడ ఉపయోగించవచ్చును (ఉదాహరణ కొరియా) ందుకై భద్రతా సంఘమువారి యాజమాన్యమున ఒక మిలిటరీ శాఖ నుండవచ్చును సూయజ్ లోను, కాంగోలోను యిటీవల వీరి పోలీసు దళముగూడ నెలకొల్పిరి

(U N O) పనులను నిర్వహించుటకై ఆర్థిక సాంఘికసభ, ట్రస్టీ (ధర్మకర్తల) సభ అంతర్జాతీయ న్యాయసభయు నుండును వీనికితోడు ప్రాంతీయముగ ఆరోగ్యము, ఆహారము మున్నగు ప్రత్యేక పనులకు సంబంధించిన వివిధశాఖలు గలవు అంతర్జాతీయ న్యాయసభ హాలండునందలి హేగు పట్టణమందుండును

కార్యవర్గము - UNO కార్యవర్గములో ఒక సెక్రటరీ జనర లును యితర ఉద్యోగులు నుందురు సెక్రటరీ జనరలును సాధా రణసభ నియమించును ఆతడు UNO యొక్క ముఖ్య పరిపాల నాధికారి ఈతని ఉద్యోగ కాలపరిమితి అయిదేండ్లు

UNO సంస్థకు వలయు ధనమంతయు యిందలి సభ్యరాజ్య ములే చెల్లించవలెను

యు యన్ ఒ చేసిన ముఖ్యపనులు -

ఐక్యరాజ్యమండలి చేసిన ముఖ్యపనులు వివిధవర్గములుగ విభ జింపవచ్చును (1) రాజకీయభద్రతావిషయములు, (2) ఆర్థికములు, (3) సాంఘిక వైజ్ఞానికములు (4) ధర్మకర్తృత్వములు, (5) న్యాయ విషయములు, (6) ప్రత్యేకశాఖల పనులు

వీటిలో రాజకీయభద్రతావిషయములలో యు యన్ ఒ సంస్థ యింతవరకు ఇరాన్ (పెర్షియా), ఇండోనీషియా, సిరియా, లెబనాన్, గ్రీస్, పాలస్తీన్, ఈజిప్టు, కొరియా సూయజ్ ఫార్మోజా కాంగో, కాశ్మీరు, మున్నగు విషయములలో జోక్యము కలుగజేసు కొనెను ఇందులో ఒక్క కొరియాలో మాత్రము యు యన్ ఒ సేనలు సరాసరి యుద్ధభూమిలో ప్రవేశించవలసివచ్చెను సూయజు లోను, లెబనాన్ లోను సమితి పర్యవేక్షణను, సూయజులో సమితి పోలీసు దళమును కొంతకాలము పనిచేసిరి

ఆర్థికవిషయమై యు యన్ ఒ ఆధ్వర్యమున ఆహారవిష యములు, ముఖ్యముగ వెనుకబడిన దేశములలో ఆర్థికాభివృద్ధికై ధనసహాయము, నిరుద్యోగులకు వృత్తులుజూపుట, లెఖడో క్రయం రవాణావిషయములు, మున్నగు శాఖలలో ప్రశంసనీయమగు పనులు జరుగుచున్నవి ప్రపంచబ్యాంకు అనేక దేశములకు ఎందలాదికోట్లు ధనసహాయముచేయుచున్నది ఐరోపా, ఆసియా, దూరప్రాచ్యము, లాటిన్ అమెరికా మున్నగు ప్రాంతములలో ప్రత్యేక ఆర్థికవిచారణ సంఘములును పనిచేయుచున్నవి

సాంఘిక వైజ్ఞానికములలో - మానవహక్కుల ప్రకటన, కాందిశీకుల విషయము సాంఘిక సంక్షేమము, శాస్త్రీయపరిశోధనలు యీ సమితి చేయుచున్న కొన్ని ముఖ్యమైనపనులు ప్రజారోగ్యమును

బాగుచేసి క్షయ, మలేరియా, కలరా, మున్నగు అంటువ్యాధుల బారినుండి మానవకోటిని రక్షించుటకై యీ సమితి ఆధ్వర్యముననే ప్రపంచ ఆరోగ్యశాఖ W H O కృషిచేయుచున్నది

ధర్మకర్తృత్వవిషయమై యు యస్ ఒ వారు కెమెరూన్సు, క్రొత్తగయానా, టంగనీయికా, టోగోలాండ్, సామో, సోమాలీలాండు మున్నగు రాజ్యములలో పరిపాలన కొనసాగించిరి

వివిధ రాజ్యములలో న్యాయసంబంధమైన భేదములు కలిగినప్పుడు అంతర్జాతీయ న్యాయసమితి వానిని పరిష్కరింపయత్నించుచున్నది

యు యస్ ఒ ఆధర్వ్యమున లేబరుశాఖ, ఆహారవ్యవసాయ శాఖ ఆర్థిక, సాంఘిక వైజ్ఞానికశాఖ విమానశాఖ, అంతర్జాతీయ బ్యాంకింగ్ శాఖ, పోస్టల్ యూనియన్, ఆరోగ్యశాఖ, కాందిశీకుల శాఖ టెలివిజన్ శాఖ, వాతావరణశాఖ మున్నగు ప్రత్యేకశాఖలు పనిచేయుచున్నవి

U N O ఛార్టరులో 111 సూత్రములున్నవి ఇది చైనీస్, ఫ్రెంచి, రష్యన్, ఇంగ్లీషు, స్పేనిష భాషలలో వ్రాయబడెను ఈ ఛార్టరు మార్చుటకు సాధారణసభలో మూడింట రెండువంతుల వోట్లు అవసరము

U N O యొక్క పతాకము నీలి, తెలుపు (Blue&White) రంగులలో నుండును ఇందు ప్రపంచగోళము, ఇరుప్రక్కల రెండు వరికంకులు ఉండును దీని ప్రధాన కార్యాలయము అమెరికాలో న్యూయార్కు వద్ద ఏర్పాటుచేయబడినది ఇందు కనుబంధముగ వివిధ ఖండములలో ప్రాంతీయ కార్యాలయములను భద్రతాసంఘము మేర్పరచ వచ్చును

ఈ సంస్థయందలి కొన్ని ముఖ్యలోపములను కుర్తించుట యవసరము (1) లోగడ జాతిసమితిలోవలెనే వీనును జర్మనీకి సభ్యత్వమొసంగుటకు జాప్యము చేయుచున్నారు (2) ఈ సంస్థలోని ప్రధాన రాజ్యములగు అమెరికా (U S A) రష్యా (U S S R) లు

తమలో తమకుగల ఆదర్శ భేదములవలన యీ సంస్థ కార్యక్రమ మంతయు ఛిన్నాభిన్నమై, కొన్ని కొన్ని సందర్భములలో రెండు రాజ్యములు యిరుప్రక్కల యుద్ధసన్నద్ధులగుట తటస్థించు చున్నది (3) ఇందలి భద్రతాసంఘమందు 11 గురు సభ్యులలో 5 గురు శాశ్వత సభ్యులగుట యితరజాతు లందరకు అన్యాయమే హిట్లరు చేతులలో భస్మీకృతమైన ఫ్రాన్సుకు, జపానుచేతిలో హారతి కర్పూరమువలె హరించిన ఛెంగ్ కై షేక్ చైనాల కిందు శాశ్వత సభ్యత్వమున నవ్వు హాస్యాస్పదము తుదకు అమెరికా, రష్యాలకు గూడ సరాసరి ఎన్నికలో యిందు స్థానములు సంపాదించుకొనుటహో న్యాయమార్గములా, గౌరవమార్గము (4) భద్రతా సంఘ మందలి 'వీటో' పద్ధతి ఈ సంఘ సామరస్యమునకును, వ్యవహారమునకును భంగకరముగుచున్నది (5) ఈ సంస్థలో ఆసియా, ఆఫ్రికా రాజ్య ముల కింకను సరియగు గౌరవప్రపత్తులు లభించుటలేదు (6) వివిధ ఖండములలో దీనికి ప్రాంతీయ కార్యాలయములును, కీలకస్థానములు, స్వతంత్రసేనలు, ధనము అవసరము (7) ఈ సంస్థ దస్తావేజు (Charter) సంస్కృత, అరబ్బీ భాషలలో గూడ లిఖించబడి యీ భాష లను అంతర్జాతీయ భాషలుగ నంగీకరింపవలెను (8) ఇందలి ప్రాతి నిధ్యమును లోపభూయిష్టముగనే యున్నది ప్రతి చిన్న పెద్ద రాజ్యమునకు ఒకే వోటనుట అర్థరహితమగు సరిసమానత్వము ఇట్టి లోపములున్నను, ప్రస్తుత పరిస్థితులలో ప్రపంచశాంతికిని అంతర్జా తీయ సహాకారమునకును, యీసంస్థను సంస్కరించి బలపరచుట తప్ప మానవకోటికి గత్యంతరము లేదు ఈ లోపములను నివరించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి ఇటీవల కొన్ని ఆఫ్రికా రాజ్యములను యిందు సభ్యత్వము బడసినవి

# 33 భారతరాజ్యాంగము

ది 15 8-1947కు పూర్వము బ్రిటిష్ ఇండియాలో భారతీయ పౌరసత్వము లేదు ఇచ్చటి ప్రజలెల్లరు బ్రిటిష్ పౌరులే వారి రాజభక్తి (Loyalty) బ్రిటిష్ రాజులకు

కాని ది 15-8-1947 నుండి ఇచ్చట భారతీయ పౌరసత్వమవతరించెను ఇప్పుడు మన మందరము భారతీయ పౌరులము పౌరసత్వముతో పాటు నాటినుండియు యిచ్చట బ్రిటిష్ బావుటాకూడ అంతరించి, చక్రధ్వజము వెలసినది నాణెములపై ముద్రయు మారిపోయెను ది 26-1-1950 నుండి ఇండియాకొక నూతన రాజ్యాంగ (Constitution) మేర్పడి, భారతరాజ్య మొక రిపబ్లిక్ (Republic) రాజ్యమయ్యెను

ఈ రాజ్యాంగమును సిద్ధపరచినది భారత రాజ్యాంగ పరిషత్తు (Indian Constituent Assembly) దీని అధ్యక్షుడు డాక్టరు రాజేంద్ర ప్రసాద్ ది 26-1-1950న యీతడే ప్రథమ భారత అధ్యక్షుడయ్యెను ఈతనిని రాష్ట్రపతియని అందురు

ఈ రాజ్యాంగమునుబట్టి భారతదేశ మొక "యూనియన్ ఆఫ్ స్టేట్సు" (Union of States) అయ్యెను ఈ యూనియను నొక రిపబ్లిక్‌గ బరిగణింతురు - అనగా దీనికొక శాశ్వత రాజుగాని, చక్రవర్తిగాని యుండరు, ఎన్నికాధ్యక్షుడు (President) మాత్రముండును ఈతడే మన సర్వసైన్యాధిపతి ఐదేండ్ల కొకసారి యీతనిని ఎన్నుకొందురు

ఈ యూనియన్‌లో 16 'స్టేట్లు', 6 యూనియన్ ప్రదేశములు గలవు వీనిపేర్లు మనము ముందు చదువుదుము ఈ రాష్ట్రముల సరిహద్దులలో మార్పుచేయుటకును నూతన రాష్ట్రములను నిర్మించుటకును పార్లమెంటుకు మాత్రమే హక్కుండును

కేంద్ర శాసనసభకు పార్లమెంటు అందురు (Parliament) ఇందు రెండు సభలుండును దిగువసభను 'లోక్‌సభ' (House of the People) అనియు, ఎగువసభను 'రాజ్యసభ' (Council of States) అనియు వ్యవహరింతురు

ప్రజాసభలో మొత్తము 520 మంది సభ్యులుందురు ఇందు 500 మంది సభ్యులు రాష్ట్రములనుండి వయోజన వోటింగు పద్ధతిపై (Adult Suffrage) ప్రజలే యెన్నుకొందురు ఈ వోటర్ల సంఖ్య దాదాపు 20 కోట్లుండును ఇంత హెచ్చుసంఖ్యగల వోటర్లు ఎన్నికలలో పాల్గొనుట మానవ చరిత్రలో నవీనము మిగిలిన 20మంది సభ్యులు యూనియన్ ప్రదేశములనుండి వత్తురు రాజ్యసభలో 250కి మించని సభ్యులుందురు వీరిలో 12మందిని మాత్రము రాష్ట్రపతి నామినేట్ చేయును

ఎన్నికలలో నెగ్గిన మెజార్టీపార్టీనుండి అధ్యక్షుడు మంత్రి వర్గము నేర్పరచును ఈ వర్గనాయకుని ప్రధానమంత్రి (Prime Minister) అందురు ఆతని నాయకత్వమున మంత్రివర్గము దేశపాలనను సాగించును

అఖిల భారత న్యాయస్థానమును 'సుప్రీమ్ కోర్టు" (Supreme Court) అందురు ఇందొక ప్రధాన న్యాయమూర్తి, పది మందికి మించని యితర జడ్జీలు నుందురు వీరిని యూనియన్ అధ్యక్షుడు నియమించును భారత ప్రభుత్వమునకును, రాష్ట్ర ప్రభుత్వములకును మధ్యవచ్చు తగాదాలను ఈ సుప్రీమ్‌కోర్టు పరిష్కరించును రాష్ట్ర హైకోర్టులనుండివచ్చు తీర్పులపై సుప్రీంకోర్టుకు "అప్పీలు (Appeal) అధికార ముండును సుప్రీంకోర్టు తీర్పులను దేశములోని అన్ని కోర్టులు శిరసావహించవలసినదే

(1) ఆంధ్రప్రదేశ్, (2) బీహారు, (3) మహారాష్ట్ర, (4) మధ్య ప్రదేశ్, (5) మద్రాసు, (6) మైసూరు, (7) పంజాబు, (8) ఉత్తర ప్రదేశ్, (9) పశ్చిమ బెంగాల్ ఈ తొమ్మిది రాష్ట్రములలో రెండేసి శాసన సభలుండును - లెజిస్లేటివ్ కౌన్సిల్, ఎసెంబ్లీ మిగతా రాష్ట్రములలో ఒక్క అసెంబ్లీ మాత్రమే వుండును ది 1-11-1956 న ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ శాసనసభలో 302 మంది సభ్యులున్నారు వీరిలో షెడ్యూలు తరగతులయొక్కయు, మన్యపు ప్రజలయొక్కయు ప్రతినిధులకు ప్రత్యేకముగ స్థానములు నిర్దేశింపబడినవి ఇచ్చటి లెజిస్లేటివ్ కౌన్సిల్ క్రొత్తగ యేర్పడినది ఇందు 90 మంది సభ్యులు ప్రతి రాష్ట్రమున కొక హైకోర్టు వుండును

భారత రాజ్యాంగచట్టములో పౌరసత్వము జాతి, కుల, వర్ణ, లింగ, స్థలభేదములతో నిమిత్తము లేకుండ ... సేయబడెను న్యాయము (Justice), స్వాతంత్ర్యము (Liberty) సమత్వము (Equality), సౌభ్రాతృత్వము (Fraternity), ... ప్రధాన లక్ష్యములుగ ప్రకటించబడినవి ... పౌర హక్కులు హామీ చేయబడినవి రాజ్యాంగము ... విషయ ములనుండి పూర్తిగా విడదీయబడినవి దీనిని ... (Secular State) మందురు

స్వాతంత్ర్యభారతముతోపాటు ది 15-8-1947 న యిచ్చట అవతరించిన భారతీయ జెండాను 'చక్రధ్వజ' మందురు ఈ పతా కము కేసరి, తెలుపు, ఆకుపచ్చ రంగులుగల త్రివర్ణపతాకము, ఇందలి మధ్యభాగమున నీలిరంగుతో 24 దళములుగల అశోక (ధర్మ) చక్రము చిత్రింపబడియుండును ఈధ్వజమును భారతీయ పౌరులెల్లరు శిరసావహించి, యీ ధ్వజగౌరవమును తమ ప్రాణము లతో సంరక్షించవలయును ఒక్క విదేశీయ రాయబారులు తక్క యితరు లెవ్వరును పరరాజ్య పతాకముల నిచ్చట ప్రతిష్ఠింపరాదు, ఊరేగింపరాదు

---o---

## 34 నాలుగు ఆదర్శములు

మన సంప్రదాయములో ధర్మ, అర్థ, కామ, మోక్షము లను నాలుగు పురుషార్థములు చెప్పబడినవి ఇప్పటి భారత రాజ్యాంగ చట్టముయొక్క సంకల్పమందు (Preamble) భారతీయ ప్రజల ఆదర్శములిట్లు వర్ణింపబడినవి

(1) భారతరాజ్య మొక సంపూర్ణాధికారముగల ప్రజారాజ్యము (Sovereign Democratic Republic) గ నుండును

(2) ఈ రాజ్యపౌరులందరకు ఈ దిగువ లక్ష్యములను సమకూర్చవలెను

(౧) న్యాయము (Justice)

(౨) స్వాతంత్ర్యము (Liberty)

(౩) సమత్వము (Equality),

(౪) సౌభ్రాతృత్వము (Fraternity)

ఈ లక్ష్యములలో ఈ దిగువ వివరములు యేతత్సంకల్పమందే నిరూపించబడినవి

(1) న్యాయమనగా సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయము

(2) స్వాతంత్ర్యమనగా, భావస్వాతంత్ర్యము, భాషాస్వాతంత్ర్యము విశ్వాసస్వాతంత్ర్యము మతస్వాతంత్ర్యము, ఆరాధనాస్వాతంత్ర్యము

(3) గౌరవ అవకాశములందు సమత్వము, అవకాశము ననుసరించి గౌరవించట

(4) వ్యక్తిగౌరవము జాత్యైక్యతలకు భంగములేని సౌభ్రాతృత్వము

ఇంతలో ప్రజారాజ్యముగూర్చి మన మింతకు పూర్వమే చదివి యుంటిమి ఈ అధ్యాయములో న్యాయము, స్వాతంత్ర్యము, సమత్వము, సౌభ్రాతృత్వమను నాలుగు లక్ష్యములగూర్చి చర్చించుకొనుట అవసరము ఏలయన ఇవియే మన జాతి ఆదర్శములుకదా!

పౌరదృష్ట్యా, ప్రపంచచరిత్ర నొకతూరి సింహావలోకన మొనర్చు కొన్నచో కొన్ని అద్భుతమగు విషయములు తేలుచున్నవి

భారతీయులు మొదటినుండియు మోక్షము చే పరమావధిగా భావించుచువచ్చిరి మోక్షమనగా దేహబంధనములనుండి ఆత్మ విమోచనమని ఉపనిషత్తులు చెప్పుచున్నవి హిందూ జైన మతముల కీ మోక్షమే ఆదర్శము వాటిభేదము మార్గభేదము మాత్రమే మన పూర్వులీమోక్షశబ్దమును ఇహపరసాధనముగ గ్రహించెడివారు

ఈమోక్షపదవి పాశ్చాత్యులలోగూడ ఆనాదినుండియు పరమ లక్ష్యముగనే భావించబడుచు వచ్చెనని తోచును వారీ మోక్షమునకు (Salvation) విమోచనమని పేరిడిరి కాని క్రమముగ పాశ్చాత్యులు ఆత్మవిమోచనకంటె భౌతికస్వేచ్ఛ కెక్కుడు ప్రాముఖ్యత యొసంగుచువచ్చిరి వారు దీనిని 'లిబర్టీ' (Liberty), లేక 'ఫ్రీడమ్' (Freedom) అని పిలచిరి

ఐరోపాఖండమందీ 'లిబర్టీ'ని యెక్కుడుగ ఆరాధించిన రాజ్యము పురాతన రోమ్, ప్రజాస్వాతంత్ర్యమునకై అచ్చటి పౌరులు టార్క్విన్ అను రాజును పారద్రోలిరి సీజరును హతమార్చిరి, రిపబ్లిక్ రాజ్యమును స్థాపించిరి

రాజకీయముగ పురాతన రోమ్ వెలిగించిన స్వాతంత్ర్యజ్యోతి అనేక రాజ్యములకు ఆదర్శప్రాయమైనను క్రమేణ స్వార్థపరులగు నిరంకుశ పాలకులు, సామ్రాజ్యవాదుల చేతులలో నది క్షీణించిపోయి, తుదకు మిణుకుమిణుకుమని అంతరించుస్థితికి వచ్చినది

ఆధునిక యుగమందు ది స్వాతంత్ర్యజ్యోతిని పునరుద్ధరించిన ఖ్యాతి అమెరికా (U S A) వాసులది 1776 సంవత్సరములో వీరు బ్రిటిష్

అంతకుపూర్వము మానవకోటి ఆరాధించుచున్న "లిబర్టీ" "ఈక్వాలిటీ", "ఫ్రెటర్నిటీ"లకు తోడు "జస్టిస్" అని నూతనాదర్శమును చేర్చుటయేగాక, యీ ఆదర్శమునకు ప్రథమస్థానమును ఒసంగబడినది అన్యాయములో మునిగియున్న యీ ప్రపంచములో "జస్టిస్" మన దేశము మానవకోటి కొసంగిన ఉత్తమాదర్శము

ఇదెంతయు సమంజసముగ నున్నది

ఏలయన 'పరిపాలయంతాం న్యాయేన మార్గేణ మహీమ్ మహీశాః అని చిరకాలమునుండి యిచ్చట స్వస్తివాక్యము అనగా యీ భూమియందు రాజులు న్యాయమార్గములో పాలింతురుగాక! రాజ్యవిషయమై యీ న్యాయపాలన ఒక్కటియే మన పూర్వులు అభిలషించినది!

సమత్వముగురించి యింకొక్కమాట మన ప్రజలలో ఆర్థిక, సాంఘిక, రాజకీయ విషయములలో జాతి, మత, కుల, స్థల, లింగ భేదములను పాటింపకూడదని భారతరాజ్యాంగము చాటుచున్నది ఇది కేవలము నవీనమని మనము భావింపరాదు సంపూర్ణాద్వైత తత్వమును ప్రకటించిన శ్రీ శంకరాచార్యుల వారే-

యస్యాంతర్నాదిమధ్యం నహికరచరణంనామగోత్రం నసూత్రం నో జాతి ర్నైవవర్ణా నభవతి పురుషో నా నపుంసమ్ నచస్త్రీః

నాకారం నైవకారం నహి జనమరణం నాస్తిపుణ్యం నపాపం
తత్వంనో తత్వమేకం సహజసమరసం ॥

అని జాతి, వర్ణ, లింగాది భేదమునేగాక పుణ్య, పాప తారతమ్యములను గూడ ఖండించియుండిరి అట్టి మహాద్వైతసిద్ధియే భారతీయ పరమలక్ష్యము

కావున 'జస్టిస్", "లిబర్టీ", "ఈక్వాలిటీ", "ఫ్రెటర్నిటీ"- యీ నాల్గును మనజాతి ఆదర్శములు, మానవాదర్శములు

వీనిని మనము శ్రద్ధతో పఠించి, జపించి, ఆచరించవలయును

—o—

# 35 భారతీయ పౌరసత్వము - పౌరహక్కులు

పౌరదృష్ట్యా మనదేశములో ది 15-8 1947 తేదీ చాల ముఖ్యమైనదని మనము లోగడ జదివితిమి ఆనాడు మనకు భారతీయ పౌరసత్వమబ్బెను-జాతీయజండా అవతరించెను-స్వతంత్ర భారత ముద్భవించెను-రూపాయలపై ముద్ర మారెను ది 26-1-50 నుండియు యిచ్చట రిపబ్లిక్ రాజ్యాంగము ప్రతిష్ఠింపబడెను ఇందు భారతీయ పౌరసత్వముగూర్చి మన మీ అధ్యాయమందు జదువుదుము

(1) ఇండియాలో పుట్టినవారు, (2) తలిదండ్రులలో యెవ్వరైన ఇండియాలో పుట్టినవారు, (3) 1950 కి పూర్వము కనీస మైదు సంవత్సరములైనను భారతదేశమందు నివసించినవారు, (4) పాకిస్థాన్ నుండి ఇండియాకు వచ్చిన శరణార్థులు, (5) తాముగాని, తమ తలిదండ్రులలో నొకరుగాని తాతముత్తాతలలో నొకరుగాని, ఇండియాలో జన్మించినవారును, యీ రాజ్యాంగమననుసరించి భారతీయ పౌరసత్వమునకు అర్హులు దీనిని బట్టి యితర దేశములకు వలసబోయిను భారతీయులను భారతీయపౌరసత్వమునకు అర్హులేయగుదురు భారతపౌరులలో యెవ్వరైనను ఐచ్ఛికముగ యే విదేశపౌరసత్వమునైనను స్వీకరించినచో అట్టివారు భారతీయపౌరసత్వమును కోలుపోవుదురు

భారతపౌరుల కీ దిగువ ప్రాథమిక హక్కులను రాజ్యాంగ చట్టము ప్రసాదించినది

(1) చట్ట సమత్వము (**Equality before Law**) –

ఇందు చట్టమనగా (**Law**) శాసనసభలు చేయు శాసనములు, అవసర చట్టములు (**Ordinances**), ఉత్తరువులు, నిబంధనలు, ఉపనిబంధనలు, ప్రభుత్వ ప్రకటనలు, ప్రజల ఆచారములు, అలవాట్లు అని వివరింపబడెను రాజ్యశాసనములలో పౌరులలో జాతి, మత, వర్ణ, లింగ, స్థలభేదములు పాటింపబడకూడదు అంగడులు, పబ్లిక్ హోటళ్లు వినోదశాలలు, బావులు, చెరువులు, స్నానఘట్టములు, రోడ్లు, రాజ్యపోషణలోనున్న పబ్లిక్ స్థలములలో యెల్లరకు ప్రవేశ ముండవలెను కాని స్త్రీలకును, బిడ్డలకు అవసరమగు ప్రత్యేక

సదుపాయములు చేయవచ్చును ఉద్యోగ విషయములలో యెల్లరకు సమానావకాశముండును అస్పృశ్యత నిషేధించబడెను షెడ్యూల్ తరగతులవారికిని, ఆంగ్లోఇండియన్లకును, వెనుకబడిన తరగతులవారికిని మాత్రము ప్రభుత్వము కొన్ని ప్రత్యేక సదుపాయములను చేయవచ్చును

(2) స్వాతంత్ర్యమునకు హక్కు (Right to freedom) -

పౌరు లందరకు వాక్స్వాతంత్ర్యము, శాంతియుతముగ సభలు చేసుకొను హక్కు, సంఘముల నేర్పాటు చేసుకొను హక్కు, దేశమంతట స్వేచ్ఛగా తిరుగుటకు హక్కు, దేశమం దెచ్చటనైన నివసించుటకుహక్కు, ఆస్తిహక్కు, వృత్తి స్వాతంత్ర్యపు హక్కు లొసంగబడినవి కాని రాజ్యరక్షణ, మిత్రరాజ్యములతో సంబంధము, ప్రజా శాంతి, నైతిక విషయము, కోర్టు ధిక్కారము, వ్యక్తిదూషణ మున్నగు సందర్భములందు ప్రభుత్వము కొంతవరకు యీ హక్కులను తగ్గించవచ్చును చట్టరీత్యా తప్ప యేపౌరునిగాని బంధించకూడదు కాని యిందువిషయమై కొన్ని ప్రత్యేక నిషేధములును విధింపబడినవి

(3) మత స్వాతంత్ర్యము (Religious Freedom) - ఏమతస్థులైనను తమ యిచ్ఛవచ్చిన మతసంస్థలను స్థాపించుకొనవచ్చును తమ మతవ్యవహారములను యథేచ్ఛగా నడిపించుకొనవచ్చును తమ స్వంత ఆస్తులను కలిగియుండి వ్యవహరించుకొనవచ్చును కాని పబ్లికు విద్యాసంస్థలలో మతబోధ పనికిరాదు అన్యమతస్థులను దూషింపకూడదు

(4) విద్యాహక్కులు - ప్రత్యేక భాష, లిపి, విజ్ఞానముగల యేవర్గీయులైనను తమభాష, లిపి, విజ్ఞానములను స్వేచ్ఛగాపోషించుకొనవచ్చును అల్పసంఖ్యాక వర్గములవారు తమ యిచ్ఛవచ్చిన విద్యాసంస్థలను నెలకొల్పుకొనవచ్చును

(5) ఆస్తిహక్కు - తగు ప్రతిఫలము లేనిదే ఎవ్వరి ఆస్తిని ప్రభుత్వము స్వాధీనపరచుకొనరాదు కాని యీ ప్రతిఫలము యిటీవల కొంతవరకు పరిమితము చేయబడినది

(6) రాజ్యాంగ సంబంధమగు న్యాయహక్కులు - ఈ ప్రాథమిక హక్కులలో వేనికైనను భంగము వాటిల్లినచో యే పౌరుడైనను సుప్రీమ్ కోర్టులో వ్యాజ్యమాడి, ప్రభుత్వము నోడించి, తన హక్కులను స్థిరపరచుకొనవచ్చును

ఈ ప్రాథమిక హక్కులేగాక, రాజ్యాంగ చట్టమందు ప్రజాక్షేమమునకై మరికొన్ని సూత్రములు శిఫారసు రూపముగ (Directive Principles) శాసించబడినవి (1) జాతి జీవితమందు సాధ్యమైనంతలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ సమత్వమును పెంపొందించుట, (2) పౌరులెల్లరకు తగు జీవనాధార ముండునటుల జూచుట, (3) ఆర్థిక సమత్వము (4) గ్రామ పంచాయతీల స్థాపన, (5) నిర్వ్యాపారులు, వృద్ధులు, రోగులు వికలాంగులకు సాధ్యమైనంతవరకు సహాయము చేయుట, (6) కార్మికులకు తగు వేతనములు లభింపజేయుట (7) పౌరులెల్లరకు ఒకే సివిలు చట్టము నేర్పరచుట, (8) 1965 లోపుగ 15 ఏండ్లలోపుగల బాలబాలికలకెల్లరకు విధిగా ఉచిత విద్య నొసంగుట, (9) వెనుకబడిన కులములు, జాతులవారికి ప్రత్యేకవిద్య ఆర్థికసౌకర్యాలు, (10) ప్రజారోగ్యము - మద్యపాన నిషేధము, (11) వ్యవసాయాభివృద్ధి పశురక్షణ (12) పురాతన విగ్రహముల రక్షణ (13) న్యాయ కార్య శాఖల విభజన, (14) ప్రపంచ శాంతిభద్రతలు, అంతర్జాతీయ మైత్రి, వివిధ జాతుల మధ్య తగాదాలను మధ్యవర్తిద్వారా పరిష్కరించుకొనుట, (15) పశుపోషణ, గోసంరక్షణ మున్నగు పనులను ప్రభుత్వము ప్రోత్సహించవలెను

# 36 యూనియన్ ప్రభుత్వ స్వరూపము

## యూనిటరీ — ఫెడరల్

రాజ్యాంగములు యూనిటరీ (ఐక్య) ఫెడరల్ (సమ్మేళన) అని రెండు విధములు ఇందు భారతరాజ్యాంగము నేర్పరచుటకుముందు మన రాజ్యాంగవేత్తలీ రెండు విధానములలో దేనిని అవలంభించుటయా? అని చాలకాలము జిజ్ఞాసపడిరి ఈ సమస్యకు సంబంధించిన ముఖ్యాంశములు రెండు (1) అంతకుపూర్వ మిచ్చుటనుండిన బ్రిటిష్ ఇండియా, స్వదేశసంస్థానములను సమైక్యమొనర్చు టెట్లు? (2) ఇట్లేర్పడిన కేంద్రప్రభుత్వమునకును, యేతద్భాగస్వాములగు రాష్ట్రములు లేక సంస్థానములకును మధ్య యెట్టి సంబంధ మేర్పడవలెను? ఎట్టి అధికార విభజన జరుగవలెను?

అసలీ యూనిటరీ లేక ఐక్యరాజరికమునకును (Unitary) సమ్మేళనా (Federal) రాజ్యమునకును గల తారతమ్యమేమి?

ఐక్యరాజ్యమందు ప్రభుత్వాధికారమంతయు ఒకేచోట కేంద్రీకరింపబడును అందు రాష్ట్రములుండవచ్చును కాని ఆ రాష్టములను కేంద్రప్రభుత్వమే యేర్పరచును ఈ రాష్ట్రములు కేంద్రసంస్థకు ఏజంట్లు లేక ప్రతినిధులుమాత్రమే యగును కాని వాటికి ప్రత్యేక వ్యక్తిత్వమెద్దియు నుండదు ఈ రాష్ట్రప్రభుత్వము లన్ని విషయములందును కేంద్రప్రభుత్వాజ్ఞలను శిరసా వహించవలసినదే కేంద్ర ప్రభుత్వమొసంగిన అధికారములు, గౌరవప్రతిష్ఠలే రాష్ట్రములకు జెందును ఐక్యరాజ్యమందు కేంద్రమునకు సరిసమానులు లేరు 1833 నుండి 1919 వరకు మన దేశపాలన యూనిటరీ ప్రభుత్వమునకు నమూనా దేశమందలి యే చిన్నపనికైనను గవర్నరుజనరల్ ఆమోదము అవసరము బ్రిటన్ రాజ్యాంగము యూనిటరీ

ఇందుకుమారుగా ఫెడరల్ లేక సమ్మేళనన రాజ్యమందు కొన్ని రాష్ట్రములేకాక చిన్న చిన్న స్వతంత్ర రాజ్యములను భాగస్వాములుగ నుండును భాషయందును, జాతిలక్షణములు, మతసిద్ధాంతములందును, యీ రాజ్యములు భిన్నములైయున్నను, ఒకేసంప్రదాయము

కొన్ని ఉమ్మడిసంబంధములు ఆర్థికలాభములు లేక రాజకీయ అవసరములు కలిగియుండి తమతమ అన్యోన్యక్షేమమునకుగాని, లేక శత్రువుల బారినుండి రక్షించుకొనుటకుగాని, కొన్ని ప్రత్యేక పనులకై యీ వివిధ రాజ్యములొక సమ్మేళనమును (Federation) వాంఛింపవచ్చును ఇందుకై యీ రాజ్యములు తమ వ్యక్తి అధికారములను కొంతవరకు వదలుకొని, ఒక విశాలరాజ్యము నేర్పరచుకొనవచ్చును ఇట్టి పస్థితులలో అ రాజ్యములమధ్య ఒక విధమగు ఒడంబడిక యేర్పడును ఆ ఒడంబడిక ఆధారముగ ఒక ఫెడరల్ రాజ్యాంగమేర్పడి, అందు భాగస్వాములగు చిన్న రాజ్యములయొక్కయు, కేంద్రప్రభుత్వముయొక్కయు అధికారములు స్పష్టీకరించబడును ఈ రీతిగ ఫెడరల్ రాజ్యమందు కేంద్రప్రభుత్వము యొక్క అధికారములు పరిమితమైయుండును ఇందలి చిన్న రాజ్యముల హక్కులు రాజ్యాంగముచే హామీచేయబడును అట్టి రాజ్యాంగమువల్ల భిన్నత్వములో ఏకత్వము లభించును కేంద్రమునకును, యూనిట్లకును, విభజించగా మిగిలిన శేషాధికారములు (Residuary Powers) కొన్ని సమ్మేళనములలో కేంద్రమందును మరి కొన్నింటిలో రాష్ట్రమందును యుండును ఫెడరల్ రాజ్యములకు ఉదాహరణ – అమెరికా (U S A), కెనడా, అస్ట్రేలియా

ఇండియాకు ఫెడరల్ రాజ్యాంగము మంచిదా ? లేక యూనిటరీ రాజ్యమా ? యను ప్రశ్నకు వివిధశాస్త్రజ్ఞులు భిన్నరీతుల సమాధాన మిచ్చిరి

(1) నైసర్గికముగ ఇండియా ఏకఖండము (2) ఇచ్చట ఏకఛత్రాధిపత్యమే రాజకీయముగ మనరాజుల ఆదర్శము (3) చారిత్రాత్మకముగను సంస్కృతియందును యిచ్చటి రాష్ట్రప్రజలకును సంస్థానములకును విశేషభేదము లెదు (4) దేశరక్షణ, ఆర్థికావసరములకు బలమగు కేంద్రమవసరము ఈ కారణములచే భారతదేశమునకు ఐక్యరాజ్యమే అవసరమని పలువురు వాదింతురు

ఇందుకు భిన్నముగ (1) మనదేశము సువిశాలమైనది, (2) ప్రజలలో మతమందును భాషలలోను, సంప్రదాయములందును చాల భేదములున్నవి, (3) చారిత్రాత్మకముగ యిటీవలన గవర్నర్ల రాష్ట్ర

ములకును, స్వదేశసంస్థానములకును చాల తారతమ్యమున్నది ఈ హేతువులచే యిచ్చట ఫెడరల్ రాజ్యమే ఉచితమని మరికొందరి అభిప్రాయము

ఈ రెండు వాదనలలో మన రాజ్యాంగవేత్తలు సమ్మేళనా సూత్రమునే వరించిరని చెప్పవచ్చును

భారత రాజ్యాంగము సమ్మేళనా సూత్రము నవలంబించె ననుటకు యీ దిగువ హంశములు తార్కాణము (1) ఇచ్చట స్వదేశ సంస్థానము లన్నియు దేశరక్షణ విదేశ రాజనీతి, రహదారులు మున్నగు విషయములలో తమ యధికారమును కేంద్రప్రభుత్వముచ కొసంగివైచి, భారతీయ పౌరసత్వమును, జాతీయ జెండాను స్వీకరించినవి ఇందు కాశ్మీరుకు మాత్రమొక ప్రత్యేకత యొసంగబడెను (2) ఇందలి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వముల మధ్యగల అధికారములు స్పష్టముగ కేటాయింపు చేయుటయేగాక, కేంద్రముతోపాటు రాష్ట్రములకును ప్రత్యేక రాజకీయ స్వత్వములు, శాసనాధికారములు ఒసంగబడినవి (3) కేంద్ర రాష్ట్ర ప్రభుత్వముల మధ్యను, ప్రభుత్వ పౌరహక్కులగూర్చియు ఇచ్చట లిఖితరూపమగు రాజ్యాంగ మేర్పడెను (4) కేంద్రమునకును, రాష్ట్రములకును మధ్య తగాదా లేర్పడుచో వాటిని పరిష్కరించుటకు ప్రత్యేక ఉన్నత న్యాయ స్థాన (Supreme Court) మేర్పడెను ఈ కారణములచే ఇండియా ఒక ఫెడరల్ రాజ్యమని చెప్పవచ్చును

కాని భారత ఫెడరేషన్‌కును, తదితర ఫెడరేషన్లకును కొన్ని ముఖ్యవిషయములలో తారతమ్యమున్నది (1) అమెరికాలో పౌరులకు కేంద్రమందును, రాష్ట్రమందును రెండు పౌరసత్వములుండును కాని ఇండియాలో ప్రత్యేక రాష్ట్రియ పౌరసత్వము లేవు (2) అమెరికాలో వివిధ రాష్ట్రములు తమ ప్రత్యేక రాజ్యాంగమును ఏర్పరచుకొనవచ్చును ఇండియాలోని రాష్ట్రముల కట్టి అధికారము లేదు

(3) కొన్ని ఫెడరేషన్లలో వివిధ రాష్ట్రములందు భిన్నచట్టములు, శాసనము లుండవచ్చును కాని ఇండియా కంతకు ఉన్నత న్యాయ స్థాన మొక్కటే, సివిల్, క్రిమినల్ చట్ట మొక్కటే, కెంద్ర ఉద్యోగ వర్గము నొక్కటే రాష్ట్రి హైకోర్టు లన్నియు సుప్రీంకోర్టు తీర్పులను శిరసావహించవలసినదే (4) భారతాధ్యక్షుడు కెంద్ర పార్లమెంటు విషయములలో నేగాక రాష్ట్రివ్యవహారములలోగూడ జోక్యముకలుగ జేసుకొని వ్యవహరించుటకు యిచ్చట సావుకాశమున్నది ఆతడే రాష్ట్రి గవర్నర్లను నియమించును కొంతవరకు యీ గవర్నర్లు రాష్ట్రిపతికె బాధ్యులు (5) ఇతర ఫెడరల్ రాజ్యాంగములవలె గాక భారత రాజ్యాంగమును అత్యవసర సమయములందు తేలికగా మార్చు టకును వీలుకలదు

సారాంశముగ, భారత రాజ్యాంగ మొక స్టేట్ల యూనియన్ (Union of States) అమెరికా (U S A) రాజ్యాంగ మొక యునైటెడ్ స్టేట్సు, బ్రిటన్ అమెరికా ( U S A ) లతో పోల్చి చూచి నచో భారతరాజ్యాంగము ఐక్యరాజ్యమునకును, సమ్మేళనారాజ్యమున కునుమధ్య స్థితి నలంకరించుచున్నదని చెప్పవచ్చును

———

# 37. యూనియను ప్రభుత్వము

## ౧ పార్లమెంటు

భారత రాజ్యాంగములో కేంద్ర శాసన సభలను పార్లమెంటు అందురు ఇందు అధ్యక్షుడు, రాజ్యసభ ( Council of States ) లోక్‌సభ (House of the People) అను మూడు భాగములుండును

భారత యెన్నికలకు వయోజన వోటింగు విధానము ప్రాతిపదిక (Adult Suffrage) అనగా 21 సంవత్సరములు దాటిన భారతీయ పౌరులెల్లరు యిందు వోటు చేయ నర్హులు ఇందు స్త్రీ పురుష భేదము కాని, జాతి, మత, వర్ణ భేదములుకాని యుండవు 10 యేండ్లవరకు షెడ్యూలు తరగతులవారికిని, షెడ్యూలు జాతులవారికిని, కొన్ని యెన్నిక స్థానములు ప్రత్యేకింపబడినవి ఈపద్ధతి యిప్పుడు 1970 వరకు పొడిగించబడినది

లోక్‌సభలో 520 మంది సభ్యులుందురు యిందు 20 మంది యూనియన్ ప్రదేశ ప్రతినిధులు, మిగత 500 మందిని రాష్ట్రములందలి వోటర్లు సరాసరి యెన్నుకొందురు ఈ యెన్నికకై 5 లక్షలు మొదలు 7½ లక్షలవరకు జనాభా కల యెన్నిక వర్గములుగ (Constituencies) దేశమంతయు విభజింపబడినది ఈ యెన్నికలు జరిపించుటకు దేశమంతకు ముఖ్య ఎన్నికోద్యోగి (Chief Election Commissioner) యుండును ఆతనికి సహాయులుగ వివిధ రాష్ట్రములలో సహోద్యోగులుందురు ప్రభుత్వాజ్ఞలతో నిమిత్తము లేకుండా స్వతంత్రించి వ్యవహరించగల ఎన్నికోద్యోగులుండుటచే ఎన్నికలు నిష్పక్షపాత పద్ధతిని జరుగుటకు సావకాశముండును

సామాన్యముగ లోక్‌సభ జీవితము ఐదు యేండ్లు, కాని యీ లోపుగ దానిని రద్దుచేయుటకుగాని, అత్యవసర సమయములలో ఒక్కొక్కసారి ఏడాదిచొప్పున పొడిగించుటకుగాని వీలుండును అట్టి అవసరసమయము దాటినపిమ్మట ఆరునెలలలోగా క్రొత్త యెన్నికలు జరుగవలెను

రాజ్యసభలో 250 కి మించని సభ్యులుందురు ఇందు దేశమంతటి విద్యాధికులు, కళావేత్తలు శాస్త్రవేత్తలు, సంఘసేవకులనుండి 12 గురను అధ్యక్షుడు నామినేట్ చేయును మిగిలిన సభ్యుల ఎన్నిక పరోక్ష యెన్నిక రాష్ట్రశాసనసభ్యులు వీరిని యెన్నుకొందురు వీరిలో దాదాపు మూడవ వంతు సభ్యులు ప్రతి రెండేండ్లకు మారుచుందురు

అధ్యక్షుడు పార్లమెంటు సభలను సమావేశపరచును ఈ సమావేశములు కనీసము ఆరు నెలల కొకటిమైన జరుగవలెను సమావేశములకు నియుక్తసంఖ్య (Quorum) నూటికి పది హాజరైన సభ్యులలో వోటుచేసినవారిలో మెజారిటీనిబట్టి సమస్యలు పరిష్కరించబడును లోక్ సభాధ్యక్షుని 'స్పీకరు (Speaker) అందురు అతనికి సహాయముగ నొక డిప్యూటీ స్పీకరుండును రాజ్యసభ అగ్రాసనాధిపతిని ఛైర్మన్ (Chairman) అందురు రాజ్యసభకు భారత ఉపాధ్యక్షుడే అగ్రాసనాధిపత్యము వహించును ఆతని సహోద్యోగిని డెప్యూటీ ఛైర్మన్ అందురు ఈరెండు సభలయొక్క సభ్యులను M P లని పిలుతురు Members of Parliament) రాజ్యసభ సభ్యులకు 30 ఏండ్లును, లోక్ సభకు 24 ఏండ్లు వయస్సు ఉండవలెను ఈసభ్యులు పార్లమెంటులో స్వేచ్ఛగా మాట్లాడవచ్చును వీరికి వలయు జీతభత్యము లొసంగబడును

ఆర్థిక విషయములలో చిత్తుచట్టములు (Bills) లోక్ సభలో మాత్రమే ప్రవేశపెట్టబడును ఇతరచట్టములన్నియు ఏసభలోనైనను ప్రవేశపెట్టవచ్చును ఈ చట్టములను రెండు సభలును ఆమోదించవలెను రెండింటికిని అభిప్రాయభేదము వచ్చినపుడు అధ్యక్షుడు రెండు సభలయొక్క సమిష్టిసమావేశము నేర్పాటు చేయవచ్చును అట్టి సంయుక్తసమావేశమందు హాజరై ఓటుచేయువారిలో మెజార్టీ తీర్మానమునుబట్టి చట్టనిర్ణయము జరుగును

ఆర్థికబిల్లులు లోక్ సభలో అంగీకరింపబడినపిమ్మట రాజ్యసభకు పంపబడును రాజ్యసభ అట్టి బిల్లులను 14 రోజులలోపుగ తన శిఫారసులతో తిరిగి పంపించవలెను అట్టి శిఫారసును లోక్ సభ అంగీకరించ

వచ్చును, లేక నిరాకరించవచ్చును లోక్‌సభయొక్క తుదినిర్ణయమే పార్లమెంటు శాసనముగా భావించబడును

ఏటేట అధ్యక్షుడు భారతప్రభుత్వముయొక్క ఆదాయ వ్యయముల అంచనాలను పార్లమెంటుయెదుట నుంచును దీనిని (Annual Financial Statement) అందురు ప్రభుత్వముకోరెడి గ్రాంటులను లోక్ సభ ఆమోదించవచ్చును, నిరాకరించవచ్చును, లేక తగ్గించవచ్చును నూతనపన్నులు ఆర్థిక బిల్లు (Finance Bill) రూపముగ లోక్‌సభ యెదుట చర్చకు వచ్చును బడ్జెట్టు ఆమోదమునకు పూర్వము తాత్కాలిక వ్యయములను పార్లమెంటు ఆమోదించవచ్చును దీనివల్ల ఆర్థికబిల్లును సుదీర్ఘముగ చర్చించుటకు పార్లమెంటుకు అవకాశముండును సంవత్సర మధ్యలో 'సప్లిమెంటరీ' డిమాండులను పార్లమెంటు మంజూరు చేయును

# 38 యూనియన్ ప్రభుత్వము

## అ కార్యవర్గము

ఇండియా లేక భారతరాజ్యమున కొక అధ్యక్షుడు, ఒక ఉపాధ్యక్షుడు నుందురు అధ్యక్షుని రాష్ట్రపతి యని అందురు

భారతప్రభుత్వము పార్లమెంటరీ విధానము ననుకరించటచే యిక్కటి కార్యవర్గము శాసనసభకు సంపూర్ణముగ బాధ్యత వహించును ఈ పద్ధతి అమెరికా పద్ధతికి భిన్నముగను బ్రిటిషు పద్ధతికి అనుగుణ్యముగను నుండును

భారతాధ్యక్షుని పార్లమెంటునందలి యెన్నిక సభ్యులును, రాష్ట్ర శాసనసభలలోని దిగువ సభాసభ్యు లందరు కలసి యెన్ను కొందురు అమెరికా అధ్యక్షు యెన్నికవలె యిది సరాసరి యెన్నిక కాదు అధ్యక్షుండగుటకు 35 ఏండ్ల వయస్సు అవసరము అధ్యక్షపదవి సాధారణముగ 5 ఏండ్లు అతడు తిరిగి యెన్నికకు నిలువవచ్చును నెలకు 10 000 రూ॥ యాతని వేతనము అధ్యక్షుని ఉద్యోగ కాలమందు అతనిపై పెట్టి క్రిమినల్ చర్యలు జరుపకూడదు అతనిని అరెస్టు చేయరాదు అతనిపై సివిల్ చర్యలు జరిపించుటకు ముందు రెండు నెలల నోటీసు అవసరము

యూనియన్ కార్యవర్గాధికారము మరియు భారత ధ్యక్షునియందుండును భారత సర్వసేనాధిపత్యమును ఆతనిదే శిక్షితులగు నేరస్తులను క్షమించుటకుగాని వారి శిక్షలను తగ్గించుటకుగాని అధికారమాతనిది రాష్ట్రగవర్నర్లు విదేశములందలి రాయబారులు, సుప్రీమ్ కోర్టు హైకోర్టుజడ్జీలు బాత అటార్నీ జనరల్ కంట్రోలర్ ఆడిటర్ జనరల్ ఎలెక్షన్ కమీషనర్లను భారతాధ్యక్షుడే నియమించును రాజ్యసభలో పండ్రెండుగురు సభ్యులను అధ్యక్షుడు నియమించును కాని యీ ముఖ్యగు పనులన్నియు సాధారణముగ ప్రధాన మంత్రి సలహాపైననే ఆతడు చేయును

భారతాధ్యక్షునకు గల శాసనాధికారములు – ఈతడు పార్లమెంటు సభలను సమావేశపరచును, వాయిదా వేయించును, రద్దు

చేయును ప్రతి పార్లమెంటు సమావేశమునకు ప్రారంభమున ఈత డుపన్యసించును ఉభయసభల సంయుక్త సమావేశములు జరుప వచ్చును ఏ సభలకైనను హాజరై అచ్చట ఉపన్యసించవచ్చును పార్లమెంటు శాసించిన చిత్తు శాసనములను అతడు ఆమోదించ వచ్చును లేక నిరాకరించవచ్చును లేక పునరాలోచనకు పంప వచ్చును ఆర్థిక గ్రాంటులను యీతడే శిఫారసు చేయవలెను

పార్లమెంటు సమావేశములో లేనప్పుడు అధ్యక్షుడు అత్యావసమగు "ఆర్డినెన్సులు" జారీచేయును పార్లమెంటు సమావేశము కాగానే అట్టిఆర్డినెన్సులు పార్లమెంటు యెదుట నుంచబడవలెను పార్లమెంటు సమావేశమునకు ఎమ్మట ఆరువారములవరకు మాత్రమే అట్టి ఆర్డినెన్సులు అమలులో నుండును

ఈతడు కేంద్రమునకును, రాష్ట్రములకును మధ్య ఆర్థిక సంబంధములగూర్చి విచారించుటకు ఆర్థిక కమీషన్ (Finance Commission) నియమించును కేంద్రప్రభుత్వమునకు సంబంధించిన యూనియన్ ఉద్యోగసంఘమును (Public Services Commission) నియమించును షెడ్యూలు జాతులు, ప్రాంతముల అభివృద్ధిని పరిశీలించుటకు కమీషన్ ఏర్పరచును వెనుకబడినజాతులవారి అభివృద్ధి పరిశీలించుటకొరకు కమీషన్ నియమించును 5 ఏండ్లకొకతూరి దేశభాష విషయమై కమీషన్ నియమించును అల్ప భాషావర్గముల వారి హక్కులకు సంబంధించిన కమీషనరును నియమించును

దేశమునకు రాజ్యరక్షణకును, ఆర్థిక అవసరములకును, దేశమందెక్కడైనను శాంతిభద్రతలను కాపాడుటకును ఏరాష్ట్రమందైనను రాజ్యాంగశాసనము కుంటుబడినచో ప్రభుత్వవ్యవహారము సక్రమముగ నడుపుటకు ప్రమాదస్థితిని ప్రకటించి ఆ ప్రాంతీయ పాలనకు వలయు ఏర్పాటులు చేయును కొన్ని ముఖ్యమగు రాష్ట్రశాసనములకు రాష్ట్రపతి సమ్మతి అవసరము

రాజ్యాంగ శాసనమును అమలుపరచుటలో యెట్టి చిక్కులు తటస్థించినను వాటిని తొలగించుటకు అధ్యక్షునకు అధికారము గలదు

నూతన రాష్ట్రముల నేర్పరచుటకును రాష్ట్రపరిహద్దులను మార్పుటకును అధ్యక్షుడే పార్లమెంటు యెదుట చట్టమును ప్రతిపాదించును

యూనియన్ రాజ్యనిర్వహణమందు తనమంత్రుల సలహాపై రాజ్యాధ్యక్షుడు కార్యభారము నంతయు వహించును

ఏ అధ్యక్షుడైనను రాజ్యాంగమునకు భిన్నముగా ప్రవర్తించినచో పార్లమెంటు అతనిని తొలగించవచ్చును ఈపద్ధతిని (Impeachment) అభిశంసనము అందురు అట్టి తీర్మానమునకు 14 రోజుల నోటీసు అవసరము పార్లమెంటు సభలలో యే సభలోనైనను అట్టి అభిశంసనమును ప్రవేశపెట్టవచ్చును దానిని ఆ సభలో కనీసము నాల్గవవంతు సభ్యులైనను ముందుగ సమ్మతించవలెను అచ్చట ఆతీర్మానము హాజరైన సభ్యులలో 2/3 మెజార్టీతో నెగ్గినయెడల రెండవసభ దానినిగూర్చి విచారించును ఆ తీర్మాన మచ్చటగూడ నెగ్గినచో అధ్యక్షుని వెంటనే తొలగింతురు

అధ్యక్షుడు జబ్బుపడినప్పుడు కాని రాజీనామా నొసంగినప్పుడు కాని, దేశాంతరముపోయినప్పుడు కాని తన పదవికి రాజనామా యొసంగినప్పుడు కాని ఆతనిస్థానే ఉపాధ్యక్షుడు అధ్యక్షుపనులను నిర్వహించును భారతఉపాధ్యక్షుని పార్లమెంటునందలి ఉభయ సభల సభ్యులు యెన్నుకొందురు ఈతని తొలగించుటకును పార్లమెంటుకు అధికారముండును ఈతడు రాజ్యసభకు అధికారరీత్యా అగ్రాసనాధిపతిగ నుండును

యూనియన్ కార్యనిర్వహణలో అధ్యక్షునికి సలహానిచ్చుటకొరకు మంత్రివర్గము (Council of Ministers) ఉండును వీరినాయకుడు ప్రధానమంత్రి (Prime Minister)* అధ్యక్షుడు ప్రధానమంత్రిని నియమించును ప్రధానమంత్రి సలహాపై యితర మంత్రులు నియమించబడుదురు మంత్రివర్గమంతయు సమష్టిగా లోక్ సభకు బాధ్యత వహింతురు యూనియన్ వ్యవహారములగూర్చియు, తాము ప్రతిపాదించదలచిన చిత్తుచట్టములగూర్చియు (Bills) మంత్రివర్గ నిర్ణ

* భారత ప్రధానిని Prime Minister అనియు రాష్ట్ర ప్రధానులను Chief Ministers (ముఖ్యమంత్రులు) అనియు గుర్తెరుగవలెను

యములను ప్రధానమంత్రి అధ్యక్షునకు తెలుపవలెను ఇందుగూర్చి అధ్యక్షుడు కోరిన సంజాయిషీ నాతడు అందజేయువలెను పార్లమెంటులో సభ్యుడు కానివానిని మంత్రిగ నియమించినచో ఆరుమాసముల లోపుగ ఆతడు పార్లమెంటు సభ్యత్వమును సంపాదించవలెను అటుల కానిచో ఆతని మంత్రిత్వము పోవును మంత్రులందరును రహస్యప్రమాణమును గైకొనవలెను

# 39 యూనియను ప్రభుత్వము

## 3 సుప్రీమ్ కోర్టు

ప్రజారాజ్యము సక్రమముగ నడవవలెనన్నచో సమగ్రమను, స్వతంత్రమునగు న్యాయస్థానము లవసరము భారతి రాజ్యాంగములో కేంద్ర న్యాయస్థానమును సుప్రీమ్‌కోర్టు (Supreme Court) అని యెలుతురు

సుప్రీమ్ కోర్టుకు ఒక ప్రధాన జడ్జి పదిమందికి మించని యితర జడ్జీలు నుందురు వీరందరను యూనియన్ అధ్యక్షుడే నియమించును ప్రధానజడ్జీని యమించుటలో భారతాధ్యక్షుడు సుప్రీమ్‌కోర్టు నందలి యితర జడ్జీలను, రాష్ట్రహైకోర్టు జడ్జీలలో తన యిచ్ఛవచ్చినవారిని సంప్రదించవచ్చును ఇతర జడ్జీల నియామకము విషయమై ప్రధాన జడ్జీతో విధిగా సంప్రదించవలెను ఈ జడ్జీలు 65 సంవత్సరములు నిండువరకు ఉద్యోగములో నుందురు పార్లమెంటు కోరికపై అధ్యక్షుడే జడ్జీలను తొలగించవచ్చును ప్రధానజడ్జీజీతము నెలకు రు 5 000, ఇతర జడ్జీలకు రు 4 000

సుప్రీమ్‌కోర్టు సాధారణముగ ఢిల్లీలోనుండును అధ్యక్షుని అనుమతితో ప్రధాన జడ్జీ యీ కోర్టును మరెచ్చటనైనను ఏర్పరుప వచ్చును

భారత ప్రభుత్వమునకును రాష్ట్రప్రభుత్వములకును, రాష్ట్ర ప్రభుత్వములలో రాష్ట్రప్రభుత్వములకును మధ్యవచ్చు తగాదాలలో సుప్రీమ్‌కోర్టుకు 'ఒరిజినల్" అధికారముండను చట్టవిషయము లందును, సివిల్ క్రిమినల్ వ్యాజ్యములలోను యీ కోర్టుకు హైకోర్టులనుండి 'అప్పీలు" అధికారము కలదు

సివిల్ కేసులలో 20 వేల రూపాయలకు తక్కువకాని దావాల లోను, యితర ముఖ్యదావాలలోను సుప్రీమ్‌కోర్టుకు హైకోర్టు తీర్పులపై అప్పీలు అధికారముండును

క్రిమినల్ కేసులలో యీ దిగువ మూడురకముల కేసులలో సుప్రీమ్‌కోర్టుకు అప్పీలుచేయవచ్చును 1 దిగువకోర్టు విడుదల

చేయగా, హైకోర్టు శిక్షించి మరణదండన విధించిన కేసులు, (2) దిగువ కోర్టునుంచి పై కోర్టుకు మార్పు చేయించుకొని అచ్చట మరణశిక్ష విధించిన కేసులు, (3) సుప్రీమ్ కోర్టుకు అప్పీలు చెయ్యకొన వచ్చునని హైకోర్టు నిర్ధారించిన కేసులు

సుప్రీమ్‌కోర్టుకు యితర అధికారములును కొన్ని కలవు యే ముఖ్యవిషయము గూర్చియైనను అధ్యక్షుడు సుప్రీమ్ కోర్టు అభిప్రాయమును కోరవచ్చును

సుప్రీమ్‌కోర్టు తీర్పులను దేశమందన్ని కోర్టులు శిరసావహించి తీరవలసినదే

దేశమందలి చట్టములు, నిబంధనలన్నిటిని కాలానుగుణ్యముగ బరిశీలించి సంస్కరించుటకు తగు సలహాలిచ్చుటకై "లా కమిషన్" **(Law Commission)** ఒకటి పని చేయుచున్నది

---

# 40 రాష్ట్రములు

## యూనియన్ ప్రాంతములు జోనల్ కౌన్సిళ్ళు

భారతయూనియన్‌లో రెండు తరగతుల ప్రాంతము లున్నవని మనము లోగడ చదివితిమి వీనిగూర్చి మన మిప్పుడు విపులముగ తెలిసికొనవలసియున్నది

ఇప్పటి స్టేట్లు లేక రాష్ట్రములు పదిహేను

| | | |
|---|---|---|
| 1 | ఆంధ్రప్రదేశ్ | (తెనుగు) |
| 2 | అస్సామ్ | (అస్సామీ) |
| 3 | బీహార్ | (బీహారీ) |
| 4 | గుజరాత్ | (గుజరాతీ) |
| 5 | కేరళ | (మళయాళము) |
| 6 | మహారాష్ట్ర | (మహారాష్ట్రము) |
| 7 | మధ్యప్రదేశ్ | (హిందుస్థానీ) |
| 8 | మద్రాస్ | (తమిళము) |
| 9 | మైసూరు | (కన్నడము) |
| 10 | ఒరిస్సా | (ఓఢ్రము) |
| 11 | పంజాబ్ | (పంజాబీ, హిందీ) |
| 12 | రాజస్థాన్ | (హిందీ) |
| 13 | ఉత్తరప్రదేశ్ | (హిందీ) |
| 14 | పశ్చిమబెంగాల్ | (బెంగాలీ) |
| 15 | జమ్మూ-కాశ్మీర్ | (కాశ్మీరీ) |

ఇందు మొదటి పదునాల్గును గవర్నర్ల రాష్ట్రములు ఏలయన, వీనిపై గవర్నర్లు అధ్యక్షత వహింతురు జమ్మూ - కాశ్మీరు పెద్దను మాత్రము సదర్-ఇ రియాసత్ అని పిలుతురు వీరందరి ఉద్యోగ కాలపరిమితియు అయిదేండ్లు గవర్నర్లను యూనియన్ అధ్యక్షుడు నియమించును ఈ పదిహేనునుకాక, అస్సాములోని నాగజాతుల

వారి కొరకొక ప్రత్యేక "నాగరాష్ట్రము" నేర్పరచుటకు యత్నములు జరుగుచున్నవి

ఈ పదహారు "స్టేట్సు" కాక, మన దేశములో మరి యారు యూనియన్ ప్రదేశములు (టెరిటరీలు) కలవు వాని పేర్లు

1 ఢిల్లీ,
2 హిమాచలప్రదేశ్,
3 మణిపూర్,
4 త్రిపుర,
5 అండమాన్, నికోబార్ దీవులు,
6 లక్కదీవ్, మినికోవ్, అమిన్ దీవులు

పై రాష్ట్రములన్నియు దాదాపు ఏక భాషా రాష్ట్రములుగ నున్నవి ఈ యూనియనుకును, రాష్ట్రములకు మధ్య "జోనల్ కౌన్సిల్లు" (Zonal Councils) అనబడు సంఘములు కలవు ఇట్టి కౌన్సిళ్ళ సంఖ్య అయిదు వాని పేర్లు, ప్రాంతములు యీాదిగువ నుదహరింపబడినవి

1 ఉత్తరజోన్–ఇందు పంజాబ్, రాజస్థాన్, జమ్మూకాశ్మీర్, ఢిల్లీ, హిమాచలప్రదేశ్ ప్రాంతములుండును

(2) సెంట్రల్ జోన్–ఇందు ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ ప్రాంతములు కలవు

(3) తూర్పుజోన్–ఇందు బీహార్, పశ్చిమబెంగాల్, ఒరిస్సా, అస్సాం, మణిపూర్, త్రిపురాలు కలసియున్నవి

(4) పశ్చిమజోన్–ఇందు గుజరాత్, మహారాష్ట్ర, మైసూరులు చేరియున్నవి

(5) దక్షిణజోన్–ఇందు ఆంధ్రప్రదేశ్, మద్రాస్, కేరళ రాష్ట్రములు కలసియున్నవి

ఈ జోనల్ కౌన్సిళ్ళ యుద్దేశ్యమేమన–ఇచ్చట యూనియను యందలి 40 కోట్ల ప్రజలలో యేకీభావము జాతీయతాభావము నశించి పోయి, ప్రతి రాష్ట్రమందును విభిన్న భావము లేర్పడకుండా విశిష్ట

ప్రాంతీయ ప్రజలలో అన్యోన్య సహకారము, సఖ్యతను పెంపొందించుట, వారి ఉమ్మడి వ్యాపారములను చక్కబెట్టుకొనుట, రాష్ట్రములకును, కేంద్రమునకును మధ్య 'లింకులుగ" పనిచేయుట

ప్రతి జోనల్ సంఘమందును యీ దిగువ సభ్యులుందురు 1 రాష్ట్రపతిచే నియమితుడగు ఒక యూనియన్ మంత్రి, 2 ప్రతి రాష్ట్రముయొక్క ముఖ్యమంత్రి, ఆ రాష్ట్ర గవర్నరు లేక సదర్-ఇ-రియాసత్ చే నియమితులగు మరి యిద్దరు రాష్ట్ర మంత్రులు, 3 యూనియన్ ప్రాంతములలో రాష్ట్రపతిచే నియమితులగు ప్రతి ప్రాంతమునకు యిద్దరు [illegible] సభ్యులు, 4 తూర్పుజోనునందలి మన్య ప్రాంతపు సలహాదారు వీరికి తోడుగ ప్రతి జోనల్ సంఘమునకును యీ క్రింది సలహాదార్లు ఉందురు —

1 ప్లానింగ్ కమీషన్ చే నియమితుడగు ఒక సభ్యుడు, 2 ఆ జోన్ నందలి ప్రతి రాష్ట్రముయొక్కయు ప్రధాన కార్యదర్శి, 3 ఆ రాష్ట్రములందలి డెవలప్మెంటు కమిషనర్లు లేక యితర ఉద్యోగులు కేంద్రమంత్రియే యీ సంఘములకు అధ్యక్షత వహించును

ఈ జోనల్ సంఘముల నిర్ణయము లా యా రాష్ట్ర ప్రభుత్వములకు శిఫారసు రూపములేకాని శాసనములు కావు ఈ సంఘములా యా రాష్ట్రములలో అన్నింటికిగాని, కొన్నింటికిగాని, యూనియనుకు గాని, రాష్ట్రములకుగాని సంబంధించిన యే వ్యవహారముగూర్చియైనను చర్చించవచ్చును ఇట్టి వ్యవహారములగురించి ఆ యా కౌన్సిళ్ళు కేంద్ర ప్రభుత్వమునకుగాని, అందుకు సంబంధించిన రాష్ట్ర ప్రభుత్వమునకుగాని తమ సలహాలను అందజేయవచ్చును ఆ యా రాష్ట్రములకు జెందిన ఉమ్మడి ఆర్థిక విషయములు, ప్లానింగ్ పనులు, సరిహద్దు తగాదాలు, అల్పభాషా సంఖ్యాకుల సమస్యలు ఉమ్మడి రహదారుల సమస్యలు యితర సమస్యలగూర్చి యీ సంఘములు చర్చించవచ్చును దక్షిణ జోన్ లోని రాష్ట్రములకు ఉమ్మడి పోలీసు దళము నేర్పరచుచున్నారు

అవసరమైనప్పుడు వివిధ జోన్లకు సంబంధించిన ఉమ్మడి వ్యవహారములను చర్చించుటకు యీ సంఘముల జాయింటు సమావేశములు జరుగును

ప్రతి జోనల్ సంఘ నిర్ణయము లను కేంద్రప్రభుత్వమునకును, అందుకు సంబంధించిన రాష్ట్ర ప్రభుత్వములకును అందజేయబడవలెను

## సర్దార్ పటేల్‌గారి సంస్థానవిధానము

ఈ సందర్భములో ది 15-8-1947 అనంతరము ముఖ్యముగ సర్దార్ పటేలు మహాశయుని ఆధ్వర్యమున యిచ్చట జరిగిన సంస్థానముల మార్పుగురించి మన మొకించుక జదువుట యవసరము అప్పటికి ఇండియా భాగములో తొమ్మిది రాష్ట్రములను, 546 స్వదేశ సంస్థానములు నుండెడివి ఈ సంస్థానముల వ్యవహారమంతయు బ్రిటిష్ చక్రవర్తి తరఫున వైస్రాయియు, ఆతని రాజకీయ శాఖయు నిర్వహించెడివారు ది 15 8-1947 న వైస్రాయితోపాటు ఆతని రాజకీయ శాఖయు అంతరించి అందుకుమారుగ సర్దార్ పటేలుగారి ఆధ్వర్యమున యిచ్చట ఒక స్టేట్సుశాఖ" వెలసెను

సర్దార్ పటేల్‌గారి సంస్థానపద్ధతి యిటీవల భారత చరిత్రలోనే కాక ప్రపంచ చరిత్రయందను అద్వితీయమై, మన దేశాభివృద్ధిపట్ల మిక్కిలి లాభదాయకమై చిరస్థాయిగ నుండగలదు దీనివల్ల అంతవరకు విచ్ఛిన్నమైన భారతావని చాలవరకు ఏకీకరణ మొనరించబడినది ఆనేక సంస్థానములు తమంతటతాము ఇండియన్ యూనియన్‌లో జేరిపోయినవి ప్రతిఘటించిన జునాగడ్, హైదరాబాద్‌లు కొద్దిపాటి పోలీసు" చర్యతో లొంగిపోయినవి కాశ్మీరుపై పాకిస్థాన్ దండయాత్ర సాగించగా భారతసేన లాదుండగీండ్రను చాలవరకు తరిమివేసినవి ఆ తగవు యింకను యు యన్ ఓ లో నలుగుచున్నది కొన్ని సంస్థానములు ప్రక్కరాష్ట్రములలో సమ్మిళిత మొనర్చబడినవి సారాంశముగ, సర్దార్ పటేలుగారి సంస్కరణ విధాన ఫలిత మెట్టిదనిన —

1 1,00,080 చ॥ మైళ్ళ వైశాల్యము 176 లక్షల జనాభా కలిగిన 214 సంస్థానములు ప్రక్క రాష్ట్రములలో విలీనమొనర్చ బడినవి

2 7,329 చ॥ మైళ్ళ వైశాల్యము 28 లక్షల జనాభాకల 25 సంస్థానముల పరిపాలనను భారత ప్రభుత్వమే స్వీకరించెను

3 2,1000 చ॥ మైళ్ళ వైశాల్యము, 076 లక్షల జనాభా గల 304 సంస్థానములు ప్రత్యేక యూనియన్లుగా యేర్పడినవి

4 1,96,059 చ మైళ్ళ వైశాల్యము, 277 లక్షల జనాభా గల మూడు పెద్దసంస్థానములు అట్లనే నిలిచియున్నవి (మైసూరు, హైదరాబాద్ జమ్మూ కాశ్మీర్) ఇందు మైసూరు ప్రక్కనున్న కర్నాటక జిల్లాలతోను హైదరాబాద్ సంస్థానము మూడు భాషా భాగములుగ విభజింపబడి, ప్రక్కనున్న ఆంధ్ర, కర్నాటక, బొంబాయి ప్రాంతములతో దరిమిలా కలుపబడినవి

ఈ సంస్థానములు ప్రత్యేకముగ నున్నను, యూనియన్లుగ జేర్చ బడినను, యివన్నియు భారత యూనియన్‌లో జేరి భారత పౌర సత్వము నంగీకరించి, ప్రజాపాలనాసూత్రమును శిరసావహించి ఇందలి రాజులు చట్టపాలకులై వ్యవహరించిరి వీటి విలీనములో భాషా సూత్రములకును పరిపాలనా సౌకర్యమునకును సర్దార్ పటేల్ హెచ్చు ప్రాముఖ్యత నొసంగెను 1956 రాష్ట్ర పునర్నిర్మాణ చట్టముతో యీ సంస్థానములన్నియు నంతరించినవి ఇందుకు మన ప్రధాని శ్రీ జవహర్లాల్ నెహ్రూగారును, ఫజల్ ఆలీ కమీషన్ వారును ముఖ్య బాధ్యులు

# 41 రాష్ట్రప్రభుత్వము

ప్రతి రాష్ట్రమునకు నొక గవర్నరుండును అతని భారతాధ్యక్షుడు నియమించును ఆతని ఉద్యోగ పరిమితి అయిదేండ్లు ఆతని వేతనము రు 5500 రాష్ట్ర ప్రభుత్వ బాధ్యత అంతయు ఆతనిపైనుండును గవర్నరు రాష్ట్రములోని శిక్షితులను క్షమించును శిక్షలను తగ్గించును అడ్వొకేటు జనరలును నియమించును

గవర్నరుకు సహాయముగ నొక మంత్రివర్గ ముండును వీరికి ముఖ్యమంత్రి నాయకుడు (Chief Minister) గవర్నరు ముఖ్య మంత్రిని, అతని శిఫారసుపై యితర మంత్రులను నియమించును మంత్రులు సమిష్టి బాధ్యతతో వర్తింతురు వారు దిగువ శాసనసభకు బాధ్యులై యుండవలెను శాసనసభలో సభ్యుడు కాని యాతడు ఆరు మాసములకు మించి మంత్రిగ నుండరాదు వీరి వేతనములను రాష్ట్ర శాసనసభ నిర్ణయించును గవర్నరు మంత్రులకు శాఖలను పంచును రాష్ట్రపరిపాలనగూర్చియు తాము ప్రతిపాదించవలసిన నూతన శాసనములగురించియు మంత్రివర్గ నిర్ణయములను ముఖ్యమంత్రి గవర్నరుకు తెలుపవలెను రాష్ట్రవ్యవహారములగూర్చి గవర్నరు కోరిన సంజాయిషి ముఖ్యమంత్రి ఆతనికి అందజేయవలెను ఏ విషయముగూర్చి అయినను మంత్రివర్గమంతయు ఆలోచించక ఏ ఒక్క మంత్రియైనను నిర్ణయించిన సందర్భములో గవర్నరు కోరికపై ముఖ్యమంత్రి అట్టి విషయమును మంత్రివర్గము యెదుట నుంచవలెను

గవర్నరు రాష్ట్రశాసన సభలను సమావేశపరచును వాయిదా వేయించును దిగువ శాసనసభను రద్దు చేయవచ్చును ఎగువ శాసన సభకు నియమిత సభ్యులను నామినేట్ చేయును శాసన సభ ఆమోదించిన చిత్తు చట్టములను అంగీకరించవచ్చును, లేక యూనియన్ అధ్యక్షుని నిర్ణయమునకై ఆతనివద్దకు పంపవచ్చును ఆర్థిక బిల్లులను శాసనసభకు శిఫారసుచేయును సభా ప్రారంభమున రాష్ట్ర వ్యవహారములగూర్చి శాసన సభ యెదుట ఉపన్యసించును శాసన సభ హాజరులేని సమయములందు అధ్యక్షుని అనుమతితో అవసర శాసనములను (Ordinances) జారీ చేయును కాని అట్టి అవసర శాసనము

లను రాష్ట్ర శాసనసభ సమావేశమైనప్పుడు ఆ సభయెదుట నుంచ వలెను శాసనసభ సమావేశమైన ఆరువారములలో అట్టి అవసర శాసనములు రద్దయిపోవును ఈ శాసనసభను 'విధానసభ" లని కొన్ని చోట్ల పిలువ నున్నారు

ప్రతి రాష్ట్రమునకు ఒక 'లెజిస్లేచర్' యుండును ఇందు ఒకటిగాని లేక రెండుగాని శాసనసభలుండును ఒకే శాసనసభ యున్నచో దానిని లెజిస్లేటివ్ అసెంబ్లీ (Legislative Assembly) యందురు రెండు సభలున్నచోట రెండవసభను లెజిస్లేటివ్ కౌన్సిల్ (Council)అందురు ఆంధ్రప్రదేశ్ బీహారు మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ మద్రాసు పంజాబ్, ఉత్తర ప్రదేశ్ పశ్చిమ బెంగాల్ మైసూరు రాష్ట్రములలో రెండు సభలున్నవి మిగత రాష్ట్రము లందు ఒక్క ఎసెంబ్లీమాత్రమే కలదు అవసరమునుబట్టి రాష్ట్ర దిగువసభ కోరికపై పార్లమెంటు యీ రాష్ట్రములలో రెండవ సభను రద్దుచేయవచ్చును లేక నూతనముగ సృష్టించవచ్చును మంత్రివర్గము దిగువసభకే బాధ్యతవహించును

ఆంధ్రప్రదేశ్ శాసనసభలో 302 మంది సభ్యులు కలరు ఎసెంబ్లీ సభ్యులందరు ఎన్నిక సభ్యులే 1970 వరకు వీరిలో షెడ్యూలు తరగతివారికిని మన్యపు ప్రాంతీయులకును కొన్ని స్థానములు ప్రత్యేకించబడినవి కౌన్సిల్ సభ్యులు 90 మంది

ఎసెంబ్లీ సభ్యత్వమునకు 25 ఏండ్ల వయస్సు అవసరము కౌన్సిలు సభ్యత్వమునకు 30 ఏండ్లు ఉండవలెను

కౌన్సిల్ సభ్యులలో 1/3 వంతు ఎసెంబ్లీ సభ్యులచేతను, 1/3 మంది రాష్ట్రమందలి జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు పెద్దపంచాయతీ బోర్డులచేతను, 1/12 మంది విద్యాధికులచేతను, 1/12 ఉపాధ్యాయులచేతను యెన్నుకోబడుదురు ఈ యెన్నిక పరోక్ష యెన్నిక (Indirect Elrection) మిగిలినవారిని రాష్ట్రములో సారస్వతము, శాస్త్రము, కళ, పరపతి సంఘములు, సాంఘికసేవలో ప్రవీణులగు వారినుండి గవర్నర్ నామినేట్ చేయును

లెజిస్లేటివ్ అసెంబ్లీ కాలపరిమితి 5 ఏండ్లు కాని దీనిని అంతకు ముందుగనే గవర్నరు రద్దుచేయవచ్చును కౌన్సిలుసభ రద్దుగాక

అందలి సభ్యులలో మూడవవంతు ప్రతి రెండేండ్లకు మారుచుందురు

రాష్ట్రశాసనసభలు సంవత్సరములో కనీసము రెండుసార్లైనను సమావేశము కావలెను

ఎసెంబ్లీ అధ్యక్షుని "స్పీకరు (Speaker) అనియు, కౌన్సిల్ అధ్యక్షుని "ఛైర్మన్ (Chairman) అనియు పిలతురు వీరు హాజరు లేనప్పుడు సభలలో అగ్రాసనాధిపత్యము వహించుటకు డిప్యూటీ స్పీకరు, డిప్యూటీ ఛైర్మనులుందురు వీరిని ఆయా శాసనసభ్యులే ఎన్నుకొందురు, తొలగింతురు, వీరి వేతనములను శాసనసభ నిర్ణయించును

సభలో హాజరైన సభ్యులలో మెజార్టీనిబట్టి సభానిర్ణయములు జరుగును మొదటి లెక్కలో సభాధ్యక్షుడు వోటుచేయడు సభాభిప్రాయము చెరిసమానమైనచో అగ్రాసనాధిపతికి తుదివోటు (Casting Vote) ఉండును సభాసమావేశములకు నియుక్తసంఖ్య మొత్తము సభ్యులలో పదవవంతు, లేక పదిమంది సభ్యులు

సభానుమతి లేనిదే 60 రోజులు సభకు హాజరుకాని సభ్యులు తమ సభ్యత్వమును కోలుపోవుదురు

శాసనసభ నిర్ణయమునుబట్టి సభ్యులకు జీతభత్యము లొసంగబడును

సాధారణబిల్లును ఏసభలోనైనను ప్రవేశపెట్టవచ్చును రెండు సభలు ఆమోదించిన రూపములో బిల్లు శాసనమగును ఏబిల్లునైనను దిగువసభ ఆమోదించి, కౌన్సిలు నిరాకరించినచో, తిరిగి అసెంబ్లీలో ఆమోదించబడినచో ఆబిల్లు శాసనమగును

ఆర్థికబిల్లులు (Money Bills) అసెంబ్లీలో మాత్రమే ప్రతిపాదింపబడును ఎసెంబ్లీ అమోదించిన బిల్లులు కౌన్సిలు 14 రోజులు లోగా తన అభిప్రాయముతో తిరుగ అసెంబ్లీకి పంపించవలెను ఆ బిల్లులో కౌన్సిలు యేవైన మార్పులను సూచించినయెడల అసెంబ్లీ

వాటిగూర్చి ఆలోచించి, అట్టిమార్పులను అంగీకరించవచ్చును, లేక నిరాకరించవచ్చును 14 రోజులలో కౌన్సిలు అట్టి బిల్లును తిరిగి పంపని పక్షమందు అసెంబ్లీ నిర్ణయమే శాసనమగును

— శాసనసభచే ఆమోదించబడిన బిల్లులకు గవర్నరు సమ్మతి అవసరము అట్టిబిల్లులకు గవర్నరు సమ్మతించవచ్చును, లేక నిరాకరించవచ్చును, లేక యూనియన్ అధ్యక్షునకు పంపించవచ్చును

గవర్నరు యేటేట రాష్ట్రనివేదికను శాసనసభయెదుట నుంచవలెను వచ్చే సంవత్సరమునకు అవసరమగు గ్రాంటులను గవర్నరు శాశనసభను కోరును సభాప్రారంభమున ఆతడుభయసభల యెదుట ఉపన్యసించును

# 42. కేంద్ర, రాష్ట్ర, అధికారములు

భారత రాజ్యాంగము చాలవరకు ఫెడరల్ సూత్రముననుకరించెనని మనము లోగడ చదివితిమి అందుచే యిచ్చట కేంద్రప్రభుత్వమునకును, రాష్ట్రములకును గల వివిధ అధికారములు, అన్యోన్య సంబంధములగూర్చి తెలుసుకొనుట అవసరము

రాజ్యాంగములోని 245 సూత్రము ననుసరించి యూనియన్ పార్లమెంటు యూనియన్‌కు సంబంధించిన విషయములగూర్చియు, రాష్ట్ర శాసనసభలు ఆ రాష్ట్రమునకు సంబంధించిన విషయముల గూర్చియు శాసించవచ్చును

యూనియన్ అధికారములో దేశరక్షణ, సేనలు, నౌకా దళము విమానదళములు యుద్ధము, శాంతి, విదేశవ్యవహారములు, యు ఎస్ రైల్వేలు, ఓడలు, పెద్దరేవులు, పౌరసత్వము, తంతి తపాలా, రేడియోలు, నాణెములు, నోట్లు, మారకము, రిజర్వుబ్యాంకి, ఇతర బ్యాంకీలు, ఇన్స్యూరెన్సుకంపెనీలు, నూనెగనులు, ఇతరగనులు, ఉప్పు నల్లమందు, జనాభా యూనియన్ ఉద్యోగులు, కేంద్ర పబ్లిక్ సర్వీసు కమీషన్, మున్నగు 97 హంశములున్నవి

రాష్ట్ర అధికారములలో పోలీసు, న్యాయస్థానములు, స్థానిక పాలన, జైళ్ళు, ప్రజారోగ్యము, విద్య, సహకారము, రోడ్లు, వ్యవసాయము, నీటివసతులు, అడవులు, మున్నగు 66 హంశములున్నవి

కేంద్రమునకును, రాష్ట్రములకును ఉమ్మడి అధికారములలో (Concurrent Powers) సివిల్ లా క్రిమినల్ లా, వివాహములు, విడాకులు ఆర్థిక సాంఘిక ప్రణాళికలు, కార్మికసంఘములు, చిన్న రేవులు ఫ్యాక్టరీలు ఎలక్ట్రిసిటీ, వార్తాపత్రికలు వగైరా, 47 హంశములు కలవు

ఈ విభజనలో రాష్ట్రములకంటె కేంద్రమునకు యెక్కుడు అధికారము లొసంగబడినవని పలువుర అభిప్రాయము దీనివల్ల కేంద్రప్రభుత్వ మెక్కుడు బలిష్ఠమై రాష్ట్రములు రానురాను నీరసించుచున్నవనియు, వీరు భావించుచున్నారు

వీనిలో ఉమ్మడి జాబితాలోని యే అంశములోనైనను మూని యన్ తీర్మానము స్టేట్ తీర్మానమును త్రోసిరాజనును

మన రాజ్యాంగమందు శేషాధికారములు (Residuary Powers) కేంద్రమందుండును

కేంద్రమునకును రాష్ట్రములకును ఒక ఆర్థిక కమీషన్ (Finance Commission) శిఫారసులను బట్టి ఆర్థిక విభజన జరిగెను ఇట్టి ఆర్థిక కమీషన్లను రాష్ట్రపతి అప్పుడప్పుడు నియమించుచుండును

అవసర సమయములందు రాష్ట్రములలో పరిపాలన సక్రమముగ జరుగునట్లు చూచుటకును, వివిధ రాష్ట్రములమధ్య తగాదాలను పరిష్కరించుటకును, యూనియను రాష్ట్రములమధ్య ఉమ్మడి వ్యవహారముల నభివృద్ధి పరచుటకును, యూనియను అధ్యక్షునకును, యూనియను ప్రభుత్వమునకును ప్రత్యేకాధికారము లుండును

వివిధ రాష్ట్రములలో ప్రాంతీయ దురభిమానములు చెలరేగకుండుటకై కొన్ని రాష్ట్రములను కలిపి దేశమున కంతకు అయిదు జోనలు సంఘము (Zonal Councils) లేర్పడినవి వీని గూర్చి మనము లోగడనే చదివియుంటిమి

# 43 న్యాయస్థానములు (JUDICIARY)

న్యాయస్థానము లన్ని రాజ్యములందును ప్రముఖస్థాన మలంకరించుచున్నవి ప్రజలలో ప్రజలకును, ప్రజకు ప్రభుత్వమునకును అనేక సందర్భములందు వివాదములు, వ్యాజ్యములు జరుగుచుండును వీనిని పరిష్కరించుటకు న్యాయస్థానము లేర్పడినవి

వ్యాజ్యము లు సివిల్, క్రిమినల్, అని రెండువిధములు సివిల్ దావాలు యెక్కుడుగా ఆస్తికి సంబంధించినవి క్రిమినల్ కేసులు నేరముల విషయమైనవి

న్యాయనిర్ణయమునకు ప్రమాణములు మూడు (1) రాజ్య శాసనములు, (2) ఈ శాసనవిషయమై పెద్దల అభిప్రాయములు లేక కోర్టు తీర్పులు (3) స్థానిక ఆచారములు – వీనిని నడపుటకు శాస్త్రజ్ఞులు, గుణగరిష్ఠులు, సత్యశీలురు, సమర్థులు, శాంతమనసులు, అనుభవశాలురైన వారిని న్యాయమూర్తులుగ నియమించవలెను

హైకోర్టు జడ్జీలను నియమించుటలో యూనియన్ అధ్యక్షుడు ఇండియా చీఫ్‌జడ్జీని సాధారణజడ్జీల విషయమై రాష్ట్రగవర్నర్లను, రాష్ట్రముఖ్యజడ్జీని సంప్రదించి నియమించును హైకోర్టు ప్రధాన జడ్జీకి నెలకు రు 4000 లు సాధారణ జడ్జీలకు రు 3500 లును వేతనముల నొసంగుచున్నారు 62 సంవత్సరములు నిండగనే వీరు ఉద్యోగముల నుండి విరమించవలెను హైకోర్టు ఆదాయవ్యయములతో రాష్ట్ర శాసనసభ జోక్యము కలుగజేసుకొనరాదు

హైకోర్టుకు ఒరిజినల్, అప్పలేట్ అధికారములు రెండును ఉండును హైకోర్టు తీర్పులపై అప్పీలు అధికారము సుప్రీమ్‌కోర్టున కుండును

ప్రతి హైకోర్టుకును అనుబంధములుగ రాష్ట్రములోని సివిల్, క్రిమినల్ వ్యాజ్యములను పరిష్కరించుటకు అనేక సబార్డినేట్ కోర్టు లున్నవి వీటి యాజమాన్యమంతయు హైకోర్టే నిర్వహించును

క్రిమినల్ –ప్రతి జిల్లాలోను ఒక సెషన్సుకోర్టు, సెషన్సు జడ్జీ, కొందరు సహాయజడ్జీలు నుందురు ఆ జిల్లా లేక డివిజన్ నందలి పెద్ద క్రిమినల్ కెసులను విచారించి "లా" ప్రకారము పరిష్కరించుటకు

వీరి కధికార ముండును కాని మరణశిక్షలు మాత్రము హైకోర్టు ఆమోదము బడయవలెను

సెషన్సుకోర్టులక్రింద మూడు తరగతుల మేజిస్ట్రేట్లుందురు వీరిలో మొదటితరగతి మేజిస్ట్రేట్లు రెండేండ్లు కఠిన శిక్షను, వేయి రూపాయలు జరిమానాను విధించవచ్చును రెండవతరగతి మేజిస్ట్రేట్లు 6 నెలల శిక్ష, రు 200 ల జరిమానా విధించవచ్చును మూడవ తరగతి మెజిస్ట్రేట్లు ఒక నెల విడిఖైదు, రు 50ల జరిమానా విధించ వచ్చును

ప్రతిజిల్లాలో జిల్లా కలెక్టరే జిల్లా మేజిస్ట్రేటుగా నుండెడివారు ఈ హోదాలో ఆతడు జిల్లాలోని యితర మేజిస్ట్రేట్ల పనిని అజమాయిషీ చేయును సబ్ కలెక్టర్ మున్నగువారికికూడ యీక్రిమినల్ అధికారము లుండును జిల్లా మేజిస్ట్రేట్లు వీరందరి కీ పనిని పంచుచుందురు పెద్దపట్టణములందు ప్రెసిడెన్సీ లేక నగర మేజిస్ట్రేట్లుందురు

ఈ ప్రభుత్వోద్యోగులే కాక కొన్ని పట్టణములలో కొందరు గౌరవ మేజిస్ట్రేట్లుందురు ఘరానా మనుష్యులను ప్రజాసేవయందిచ్ఛ గలవారిని, యీ పదవులకు నియమింతురు వీరిలోగూడ మూడు తరగతు లున్నవి కాని వీరికి న్యాయశాస్త్రమందు విశేష పరిచయము కాని, అనుభవముకాని యుండదు కావున వీరికి సామాన్యమైన కేసులను మాత్రమే పంపుదురు గౌరవమేజిస్ట్రేట్లు ప్రభుత్వోద్యోగులవలెనే స్థానిక సంఘములందు సభ్యులుగ నుండరాదు ఏలయన విరు స్థానిక సంస్థలకు జెందిన కేసులను విచారించి తీర్పు చెప్పవలసియుండును

సెషన్సు కేసులలో జూరర్లు (Jurors) గాని అసెసర్లు (Assessors) గాని, జడ్జీలకు సహాయపడుదురు ఈ జూరర్లు అసెసర్లుగ జిల్లాలోని నిష్పాక్షికులగు పెద్దమనుష్యులను యీ కేసులలో తమకు సలహా నిచ్చుటకై జడ్జీలే నియమింతురు జూరర్లు తమ అభిప్రాయమును సమిష్టిగా నిత్తురు అసెసర్ల యొక్క అభిప్రాయము విడివిడిగా తీసుకొనబడును జూరీ అభిప్రాయమును సాధారణముగ జడ్జీ అంగీకరించవలెను అసెసర్ల అభిప్రాయమును ఆతడు త్రోసివేయవచ్చును జూరీ అభిప్రాయమును నిరాకరింపవలెనన్నచో ఆతడు ఆ కేసులను

హైకోర్టుకు బంపవలెను ఇప్పుడీ జూరీపద్ధతి మనదేశములో ాచ్చుగ అమలులోలేదు

సివిల్ – సివిల్ శాఖలో దిగువమెట్టున గ్రామ మునసబు లేక పంచాయతీ కోర్టులుండును వీరు 50 రూపాయలకు మించని కేసులు విచారించవచ్చును ఉభయ పార్టీల సమ్మతితో రు 200 ల వరకు దావాలను వీరు పరిష్కరింతురు ఈ గ్రామ నిర్మాణమునకు పైన జిల్లా మునసబు లుందురు జిల్లా మునసబు నిజముగ తాలూకా న్యాయాధికారి మాత్రమే జిల్లా మునసబులకు పైన సబ్ జడ్జీలు, వారిపై జిల్లా జడ్జీలు నుందురు జిల్లాకోర్టులకు పైఅధికారి హైకోర్టు జిల్లా జడ్జీలను హైకోర్టు సలహాలతో గవర్నరు నియమించును ఇతర సబ్ జడ్జీలు, మునసబులను హైకోర్టు, రాష్ట్ర సర్వీస్ కమీషన్ల సలహాపై గవర్నరు నియమించును

ఈ న్యాయపాలనలో రివిన్యూ అధికారులకుగల క్రిమినల్ అధికారమును పూర్తిగ తొలగించి న్యాయశాఖకు మార్చవలెనని మన పెద్దలు చాలకాలమునుండి కోరుచున్నారు మన రాష్ట్రమందీ విభజన యిప్పటికి పదకొండు జిల్లాలలో జరిగినది ఇతరచోట్లగూడ ఇట్టి విభజన త్వరలో జరుగుట అవసరమని భారత రాజ్యాంగము శిఫారసు చేయుచున్నది ఇట్టి విభజన జరిగిన జిల్లాలలో సివిల్ న్యాయము వలెనే క్రిమినల్ న్యాయముకూడ జిల్లా జడ్జీల అజమాయిషీ క్రిందనే జరుగును దీనిపాలనకై జూడిషల్ మేజిస్ట్రేట్లను ఉద్యోగులు నియమించబడుచున్నారు

భారత రాజ్యాంగములో యీ క్రింది 14 భాషలును ముఖ్య భాషలుగ పేర్కొనబడినవి (1) అస్సామీ, (2) బెంగాలి (3) గుజ రాతీ, (4) హిందీ (5) కన్నడ, (6) కాశ్మీర్, (7) మళయాళము, (8) మహారాష్ట్రము (9) ఒరియా, (10) పంజాబీ, (11) సంస్కృతము (12) తమిళము, (13) తెనుగు, (14) ఉర్దూ ఇందు రాష్ట్రి శాసనసభలలో ఆయా రాష్ట్రి భాషలలో గాని హిందీలో గాని, ఇంగ్లీషులో గాని వ్యవహరించవచ్చును 15 సంవత్సరముల ఎమ్మట వీని నుండి ఇంగ్లీషు తొలగించబడవలెనని ఆశించిరి కాని ఆ పని యిప్పుడు సాధ్యపడదని అంగీకరించుచున్నారు

యూనియన్‌లో హిందీ రాజభాషగా అంగీకరించబడెను కాని కొంతకాలమువరకు ఆంగ్లభాషయే యిచ్చట రాజభాషగా నుండును ఈ లోపుగ యూనియన్ ప్రభుత్వము హిందీ భాషను దేశమందన్ని ప్రాంతములవారికిని ఉపయుక్తముగ నుండున ట్లు అభివృద్ధిచేయవలెను ఈ యభివృద్ధిని సమీక్షించుటకై యూనియన్ అధ్యక్షుడు అయి దేండ్ల కొకతూరి ప్రత్యేకముగ విచారణ సల్పును అవసరమైనచో 15 సంవత్సరముల ఎమ్మటకూడ ఆంగ్లమునే ఉపయోగించుటకు పార్లమెంటుకు అధికారముండును

ఏ రాజ్యాంగమైనను న్యాయముగను, సమర్థముగను, నడచు టకు సక్రమమగు శాసనసభలు, మంత్రివర్గములు, న్యాయస్థానము లకు తోడు సమర్థులును, న్యాయశీలురగు శాశ్వతోద్యోగులు అవ సరము వీరిని రాజకీయ పక్షముల దృష్ట్యా నియమించకూడదు వీరి ఉద్యోగకాలము, హక్కులు, జీతభత్యములు, ఆకర్షణీయముగ నుండ వలెను వీరిని నియమించుటకు రాజకీయ పక్షముల కతీతమగు స్వాతం త్రాధికారులుండవలెను ఇందుకై ప్రతి రాజ్యమందును నిష్పాక్షిక మగు పబ్లిక్ సర్వీస్ కమీషన్లను నియమింతురు బహిరంగ పరీక్షల ద్వారా యెట్టి పాక్షికభావము లేకుండా, యీ కమీషన్లు ఉద్యోగు లను నియమింతురు

భారత రాజ్యాంగములో యూనియన్ ఉద్యోగులకును, రాష్ట్రో ద్యోగులకును ప్రత్యేక సర్వీస్ కమీషన్లు యేర్పాటు చేయబడినవి

రెండు మూడు రాష్ట్రములు కలిసి ఒకే సంయుక్త కమిషనుగూడ ఏర్పరచుకొనవచ్చును

యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషను అధ్యక్షుడు, సభ్యులు, వివిధరాష్ట్రముల సంయుక్త కమిషన్ అధ్యక్షు, సభ్యులను యూనియన్ ప్రెసిడెంటు నియమించును రాష్ట్రసర్వీస్ కమిషన్ అధ్యక్షు, సభ్యులను ఆ రాష్ట్రగవర్నరు నియమించును ఇట్టి కమిషన్ సభ్యులు ఆరేండ్లు ఉద్యోగములోనుందురు కాని 65 సం||లు నిండగానే వీరు ఉద్యోగ విరమణ చేయవలసియుండును ఆంధ్రరాష్ట్రమునకు ప్రత్యేకముగా యిట్టి కమిషన్ కలదు

ఈరాజ్యాంగము ది 26-1-1950 నుండి అమలులోనికి వచ్చెను దీని ననుసరించి ప్రథమ యెన్నికలు 1952 లోను, రెండవ యెన్నిక 1957 లోను జరిగినవి ఈ యెన్నికలలో నమోదైన వోటర్ల సంఖ్య 18 కోట్లు ఇందు దాదాపు 8 కోట్ల మంది యెన్నికలలో పాల్గొనిరి ఇంతమంది వోటర్లు ఎన్నికలలో పాల్గొనుట యింతకుముం దెన్నడును చరిత్రలో కని, విని, యెరుగని విషయము మూడవయెన్నిక 1962 లో జరిగెను

భారతరాజ్యాంగమును సవరించుట కీదిగువ విధానము శాసించుచుండును క్రొత్తరాష్ట్రములు, రాష్ట్రసరిహద్దుల మార్పు, రాష్ట్రములలో యెగువ సభలను రద్దుచేయుట లేక క్రొత్తగా నిర్మించుట, మున్నగు విషయములలో పార్లమెంటులో సామాన్య మెజార్టీ చాలును ఈసందర్భములో మన రాజ్యాంగము Flexible అనగా తేలికగా మార్పు చేయ వీలైనదని చెప్పవచ్చును ఇతర విషయములలో నిది Rigid పద్ధతి ననుసరించును

రాజ్యాంగమును పార్లమెంటులో యే సభలో నైనను ప్రతిపాదన జరుగవచ్చును అట్టి ప్రతిపాదన ఉభయసభలందును ఆ యా సభ్యుల సంఖ్యలో సగముకంటె తక్కువ కానట్టియు, హాజరై వోటువేయు సభ్యులలో మూడింట రెండువంతుల సభ్యుల సమ్మతి పొందవలెను అట్టి ప్రతిపాదనకు ప్రెసిడెంటు ఆమోదము అవసరము అధ్యక్షుని యెన్నిక రాష్ట్ర శాసనాధికారములు రాష్ట్రముల కార్యనిర్వాహకాధికారములు రాష్ట్ర హైకోర్టులు సుప్రీమ్

కోర్టు అధికారములు, యూనియన్ రాష్ట్రి అధికారములు, పార్లమెంటులో రాష్ట్రిములకుగల ప్రాతినిధ్యములకు సంబంధించిన సవరణలకు రాష్ట్రిశాసనసభలలో కనీసము సగముమంది సభ్యులైనను, తమ ఆమోదమును ప్రకటింపవలెను

భారతావని కొన్ని శతాబ్దములుగా స్వాతంత్ర్యమును కోలుపోయి యిటీవలనే తిరిగి సంపాదించుకొనగలిగెను హిందూ-ముస్లిమ్ విభేదములచే యిచ్చట రెండు రాజ్యములు, రెండు పౌరసత్వములు, యేర్పడినవి ఇందు భారతీయ నాయకులు విశేష వ్యయ ప్రయాసలతో నొక రాజ్యాంగమును సిద్ధపరచిరి ఈరాజ్యాంగము పూర్తిగ భారతీయ సంప్రదాయముల కనుగుణ్యాముగ నున్నదని చెప్పుటకు వీలులేదు అట్టి సంప్రదాయము లెన్నడో అడుగంటిపోయినవి ఈ రాజ్యాంగమును సిద్ధపరచుటలో యెక్కుడుగ పాశ్చాత్య పార్లమెంటరీ పద్ధతియే అనుకరించబడెను బ్రిటన్, అమెరికా, ఐర్లాండు, కెనడా, ఆస్ట్రిలియా రాజ్యాంగములనుండి అనేక రీతులు, విధానము లిందు పొందుపరచబడినవి అడుగునబడిపోయిన భారతీయ సంప్రదాయము లెన్నటికైన పైకివచ్చునో, రావో, చెప్పజాలము ఇతర విషయములలో గూడ అనుభవముపై యీ రాజ్యాంగసూత్రములలో అనేక మార్పులుఅవసరమగుచుండును శాసనసభ్యులు, మంత్రులు మారుటకు, రాజకీయపార్టీలు, ఎన్నికలు యేర్పాటుచేయబడినవి వ్యక్తిగతముగ గాని, సిద్ధాంతవిషయమైకాని యీ రాజ్య నిర్వాహణమును గాని, రాజ్యాంగమునుగాని మార్చుటకు భారతీయ పౌరులకును పౌరప్రతినిధులకును యిప్పుడు సంపూర్ణ సావుకాశమున్నది ఇంటెంత పెద్దమార్పులకైనను రక్తపాత మవసరములేదు తిరుగుబాటు లవసరములేదు సూర్యునిబట్టి సూర్యచక్ర (Sun dial) మెటుల తిరుగుచుండునో, అటులనే ప్రజాభిప్రాయముబట్టి యీ రాజ్యాంగమును రూపొందించుటకు వీలుకలదు అట్టితరి భారతీయ పౌరులును, ప్రజాప్రతినిధులును యీ అవకాశమును వినియోగించుకొని మన కెట్టకేలకు లభించిన భారత స్వాతంత్ర్యము, భారతీయ పౌరసత్వము, భారత పతాకము భారతరాజ్యాంగములను తమ సర్వస్వములను సమర్పించియైనను సర్వదా సంరక్షించుకొనెదరుగాక!

———

# 45. రాజ్య లాంఛనములు
(National Insignia)

ది 15-8-1947 న భారత స్వాతంత్ర్య మవతరించెను అప్పటి నుండి మనకు భారతీయపౌరసత్వముతో పాటు కొన్ని రాజ్యలాంఛనములును లభించినవి ఇంతవరకు భారతీయ పౌరసత్వముగూర్చియు ది 26-1-1950 నుండి యిచ్చట అమలులోనికి వచ్చిన భారత రాజ్యాంగముగురించియు మనము కొంతవరకు జదివితిమి ఈ అధ్యాయమందు మన జాతీయజెండా గూర్చియు, రాజ్యాంగ మొహారు (Crest), జాతీయగీతముల గూర్చియు కొలదిగా తెలుసుకొందుము,

మనజెండాను "చక్రధ్వజ" మని పిలుతురు ఇది త్రివర్ణ పతాకము ఇందు పై నుండి వరుసగ కేసరి (వంగపండుఛాయ,) తెలుపు, ఆకుపచ్చరంగు సమభాగములుగ నుండును ఇందలి పొడవు, వెడల్పులు మూడు, రెండుభాగములలో నుండును మధ్య తెలుపుభాగమందు నీలిరంగులో నొక చక్రచిహ్నము చిత్రింపబడి యుండును ఈ చక్రము భారత చక్రవర్తులలో నగ్రగణ్యుడగు అశోక చక్రవర్తి బుద్ధభగవానుడు తన ధర్మబోధను ప్రారంభించిన సారానాథ్ మృగవన మందలి సింహస్తంభముపై గల "ధర్మచక్రము" నకు సూచన ఇందు యిరవై నాలుగు దళములుండును భారత సంప్రదాయమందిరువదినాలుగు పవిత్ర సంఖ్య కేశవ నామములు యిరవై నాలుగు ఇంద్రియాది తత్వములు ఇరవై నాలుగు గాయత్రీ మంత్రాక్షరములు ఇరవై నాలుగు- "చతుర్వింశత్యక్షరా"

ఇందలి మూడురంగులకును వివిధభావములను చెప్పుచున్నారు ఇందు కేసరికి మారు యెరుపు కొంతకాలము కాంగ్రెసు జెండాపై నుండెడిది ఆ రోజులలో—

హిందువులకూ – యెర్రనై
ఇస్లామందున – పచ్చనై।
ధర్మమైన – యితరజాతుల।
ధవళమై వెలి – నేటి జెండా।
ఖండాంతరముల – ఖ్యాతిగాంచి।
జయముగూర్చెడి – జెండా॥

అని పాడెడివారు దరిమిలా ముఖ్యముగ శిఖ్ఖులకోరికపై యీ ఎరుపు స్థానే కెసరివర్ణమును నెలకొల్పి, యిందలి రంగులకు మతమునకు సంబంధించిన అర్థము చెప్పరాదనియు, కెసరి ధైర్యమునకును, త్యాగమునకును గుర్తనియు, తెలుపు సత్యము, శాంతికి చిహ్నమనియు, ఆకుపచ్చ విశ్వాసము, ఆర్త్రతాణ పరాయణత్వములకు సూచన యనియు చెప్పుచున్నారు

ఈ జెండాయందలి చక్రభావ మత్యంత తేజోవంతమును శాంతియుతమును, భావగర్భితమును, పవిత్రమును, వీర్యవంతము నైనది చక్రము ప్రాణచిహ్నము! నిరంతర చలనరూపము! శక్తివంతము? ఇహపరసాధకము మన నిత్యజీవితములో రిక్షాచక్రము, బండి చక్రము మొదలు, రైలుచక్రము మోటారుచక్రము, పారిశ్రామిక చక్రము, భూచక్రము, సూర్యచక్రములవరకు యీ ప్రపంచ మంతయు చక్రమయమే కాలచక్రము రేయింబవళులు నిరంతరము తిరుగుచుండును ధర్మార్థక కామ మోక్షములలో బుద్ధభగవానుడు ధర్మము నీ చక్రరూపమున బ్రిదర్శించెను "సహస్రకరదుస్సహా మహా పటలభాసురంబగుచు, దేవదైత్యాదానవ యక్షరాక్షస పిశాచోరగ ప్రశమనంబై వెలుంగు సుదర్శన చక్రంబు" అని భారతము చెప్పుచున్నది అగ్నిదేవుడు నారాయణున కీ చక్రము ప్రసాదించునప్పుడు

ఈ చక్రము మధుసూదన!
నీచేత విముక్తమగుచు నీ రిపుల ద్రియా
మాచరుల జంపి క్రమ్మర
నీచేతికి వచ్చు దేవనిర్మితశక్తిన్ ॥

అని ఆదిపర్వములో చెప్పబడినది (8–257) ఈ చక్రము బౌద్ధ, హిందూ, పారశీక, ఈజిప్షన్, అస్సీరియన్, గ్రీకు మతములం దారాధనీయముగ నుండెనని భారత ప్రభుత్వము గుర్తించెను అట్టి చక్రరూపము భారతధ్వజము నలంకరించుట మహాభాగ్యము

భారత రాజ్యమునకు మొహరుగ (Crest) పైన నుడివిన సారనాథ్ అశోక స్తంభ చిహ్న మేర్పరుపబడినది ఈ చిహ్నమొక స్తంభరూపమున నుండును ఇందు నాలుగు వైపుల నాలుగు చక్రము

లున్నవి ఈ చక్రములే మన జాతీయ జెండాలోని చిహ్నముకు మూలములు ఇందిరపై నాలుగు దళములుండును చక్రము, చక్రము నడుమ నాలుగు వైపుల నాలుగు మృగములు కలవు—ఏనుగు, నంది, గుర్రము, సింహము ఈ స్తంభముపై నాలుగు సింహము లున్నవి ఈ సింహముల భుజములపై పూర్వ మొక పెద్ద చక్రముండెడిది అదియే ధర్మచక్రము దాని దళములు ముప్పదిరెండు కాని యిది నేడు శిథిలమై అంతరించి పోవుటచే భారత మొహరునందీ భాగము చేర్చబడ లేదు ఈ స్తంభమునకు దిగువ భాగమున "సత్యమేవ జయతే" యను ఉపనిషద్వాక్యము భారతీయ మహామంత్రముగ బ్రతిష్ఠించబడినది ఇటులనే వివిధ రాష్ట్రములకును ప్రత్యేక ముద్రలు గలవు, ఆంధ్ర ముద్రపై అమరావతీ స్థూపమునందలి పూర్ణకుంభము కలదు

జాతీయ గీతము విషయమై యిచ్చట బంకించంద్రుని 'వందే మాతర" గీతము రాజకీయముగ మొదటినుండియు బ్రసిద్ధిగాంచినది కాని దరిమిలా రవీంద్రనాథ ఠాగూరుగారి "జనగణమన' గీతము ప్రచారములోనికి వచ్చెను ఈ రెండింటికిని భారత ప్రభుత్వము సమాన గౌరవస్థానము నొసంగుచు, రవీంద్రుని గీతమునుండి యీ దిగువ పదములు మాత్రము సర్వదా పఠనీయములని సూచించెను

జనగణమన అధినాయక జయహే
భారత భాగ్యవిధాతా !
పంజాబ్ సింధు గుజరాత
మరాఠా ద్రావిడ ఉత్కళవంగ !
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగ !
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాగే !

గాహే తవ జయగాథా !
జనగణ మంగళదాయక జయహే ! భారత భాగ్య విధాతా ॥
జయహే ! జయహే ! జయహే !
జయ్ ! జయ్ జయ్ ! జయహే !

"స్వస్తి ప్రజాభ్య"

---

# 1 వ అనుబంధము

## కొన్ని ప్రశ్నలు

1 పౌరశాస్త్రమనగా నేమి? రాజకీయ శాస్త్రమునకును పౌరశాస్త్రమునకు గల తారతమ్యమును నిరూపింపుము?

2 పౌరశాస్త్ర పఠనమువల్ల మనకెట్టి లాభము కలుగును?

3 మంచిపౌరుని లక్షణములెవ్వి? అతని ముఖ్య విధులను హక్కులను వివరింపుము?

4. పౌరసత్వ (Citizenship) మనేమి? ఒక పురుషుడు లేక స్త్రీ పౌరసత్వమెట్లు పొందగలుగును? ఎట్లు పోగొట్టుకొనును?

5 (1) గృహము (2) పాఠశాల (3) గ్రామ పంచాయితీలలో పౌరధర్మమును మనమెట్లు అలవరచుకొందుము?

6 పౌరునకును (Citizen), సబ్జక్టు (Subject) ఏలియన్ (Alien) కును గల తారతమ్యమేమి? పూర్వకాలపు పౌరసత్వమునకును యిప్పటి పౌరసత్వమునకును భేదమేమి?

7 'మానవుడొక సాంఘికజీవి' అనుసూత్రమును సోదాహరణముగ విపులపరచుము.

8 సమిష్టి కుటుంబముయొక్క లాభనష్టములను వివరింపుము

9 వర్ణము (Caste) అనగా నేమి? మన దేశములో వర్ణవ్యవస్థను నిర్మూలించవలెనా? హేతువుల నిమ్ము

10 మతమనగా నేమి? సాంఘిక జీవితములో మతమునకు గల స్థానమెట్టిది

11 (a) స్థానిక స్వపరిపాలన యనగానేమి? మీ ప్రాంతమందలి గ్రామ పంచాయతీ లేక పట్టణ మునిసిపాలిటీ యొక్క నిర్మాణము, అధికారములు, ఆదాయముల గూర్చి వివరింపుము.

(b) ఒక బ్లాకు సమితి లేక జిల్లా పరిషత్తు యొక్క నిర్మాణము అధికారములు, ఆదాయములను విశదీకరింపుము

(c) ఒక మునిసిపల్ కార్పొరేషను యొక్క సంపూర్ణ స్వపరిపాలనకు హద్దులను వివరింపుము

(d) ప్రజాస్వామ్య వికేంద్రీకరణ (Democratic Decentralisation) యనగానేమి?

12 (ఎ) మీ జిల్లా పరిపాలనను వర్ణింపుము

(బి) మీ రాష్ట్రమందలి పోలీసు పరిపాలనను వర్ణింపుము

13. వ్యక్తికి ఆస్తియుండునా? కూడదా? కారణములనిమ్ము?

27 భారత రాజ్యాంగముయొక్క ప్రధాన లక్ష్యములను వర్ణింపుము

28 మన రాజ్యాంగములోని ప్రాథమిక హక్కులను (Fundamental Rights) వివరింపుము

29 అమెరికా రాజ్యాంగములో న్యాయస్థానము (Judiciary) యొక్క ప్రాముఖ్యతను తెల్పుము

30 భారతాధ్యక్షుని యెట్లెన్నుకొందురు ? అతని అధికారములను వివరింపుము

31 ఇండియాలో స్టేట్సు కౌన్సిలు నిర్మాణము, అధికారములను వివరింపుము

32 సర్దార్ పటేల్‌గారి సంస్థాన నీతి (States Policy) యన నేమి ?

33 మీ రాష్ట్ర గవర్నరు అధికారము లెవ్వి ?

34 మీ రాష్ట్రమందలి శాసనసభ (Legislature) నిర్మాణమును అధికారములను వివరింపుము ఇచ్చట కౌన్సిల్ ఏల యేర్పరుపబడెను ?

35 మీ రాష్ట్రమందలి న్యాయపరిపాలనగూర్చి వ్రాయుము

36 ఈ దిగువ అంశములగూర్చి లఘుటీక వ్రాయుము

1 చట్టము (Law), (2) స్వాతంత్ర్యము (Liberty), (3) భిన్నాభిప్రాయము (Minute of Dissent) (4) మేట్రియార్కల్ కుటుంబము (Matri archaly Family), (5) అస్పృశ్యత (6) పెంపుడు పౌరుడు (Natura lised Citizen), (7) అపార్థాయిడ్ (Aparthoid), (8) విశ్వాసరాహిత్యము (Vote of No confidence), (9) బడ్జెట్టు (Budget) (10) రాజ్యాంగ పరిషత్తు (Constituent Assembly), 11 వయోజన వోటింగు (Adult Suffrage), 12 సమిష్టి బాధ్యత (Collective Respons bility), (13) శేషాధికారములు (Residuary Powers) (14) నిర్దేశక సూత్రములు (Directive Princples), (15) సుప్రీమ్‌కోర్టు (16) భద్రతా సంఘము (Security Concil), (17) ప్లెబిసైట్ (Plebiscite), (18) ఉమ్మడి ఆస్తి (Common Property), (19) అంతర్జాతీయసమితి (League of Nations), (20) Public Service Commission (21) పరోక్ష యెన్నిక (22) Zonal Councils, (23) Community Development, (24) Block Panchayat Samithi

37 మన దేశమందలి రాజ్య లాంఛనములగూర్చి (National Insignia) నీ కేమి తెలియును ?

38 భారతదేశమందలి రాష్ట్రపునర్నిర్మాణ మే సూత్రమునుబట్టి జరిగెను ? వాని బాగోగులను వివరింపుము

39 మనదేశమందు సాంఘిక సేవయొక్క ఆవశ్యకతగూర్చి వ్రాయుము

40 (అ) జాతీయ ప్రణాళిక (National Plan) యొక్క ఆవశ్యకతను గూర్చి వ్రాయుము

(ఆ) మూడవ పంచవర్ష ప్రణాళిక గురించి మీకేమి తెలియును ?

# 2వ అనుబంధము

## [Glossary of Some Technical Terms]

Act = చట్టము
Adjournment = వాయిదా
Administration = పరిపాలన
Amendment = సవరణ మార్పు
Aristocracy = ప్రముఖ పెద్దల పాలన
Audit = తనిఖీ
Bill = చిత్తు చట్టము
Budget = జమాఖర్చుల అంచనా
Cabinet = మంత్రివర్గము
Candidate = అభ్యర్థి
Caste = వర్ణము
Citizen = పౌరుడు
Citizenship = పౌరసత్వము
City = పురము, నగరము
Civic = పౌరసత్వపు
Civic Sense = పౌరభావము
Civics = పౌరశాస్త్రము
Coalition = మిశ్రమ ప్రభుత్వము
Coinage = నాణెముల విధానము
Collective Responsibility = సమిష్టి బాధ్యత
Concurrent = ఉమ్మడి
Constituency = ఎన్నికస్థానము
Constitution = రాజ్యాంగము
Currency = ద్రవ్య పద్ధతి
Decentralisation = వికేంద్రీకరణము
Defence = రక్షణ సేనలు
Democracy = ప్రజారాజ్యము
Dictatorship = నిరంకుశ పాలన
Directive Principles = శిఫారసు సూత్రములు
Duty = విధి
Dyarchy = ద్వంద్వపరిపాలన
Economics = అర్థశాస్త్రము
Election = ఎన్నిక
Electorate = ఎన్నిక వర్గము
Equality = సమానత్వము
Executive = కార్యవర్గము
Executive Council = కార్యవర్గ సభ
Family = కుటుంబము
Federation = సమ్మేళనా రాజ్యము
Flexible = సులభముగా మార్చుటకు వీలైన
Fraternity = సౌభ్రాతృత్వము
Freedom = స్వాతంత్ర్యము
Functions = విధులు పనులు
Fundamental Rights = ప్రాథమిక హక్కులు
Government = ప్రభుత్వము
Interpellation = ప్రశ్న
Initiative = వోటర్లు స్వయముగ శాసనములు ప్రవేశపెట్టు విధానము
Insignia = చిహ్నములు లాంఛనములు
Judiciary = న్యాయవర్గము
Judge = న్యాయాధికారి
Justice = న్యాయము
Law = ధర్మము శాసనము
Legislature = శాసనసభ విధానసభ
Liberty = స్వేచ్ఛ స్వాతంత్ర్యము
Limitations = హద్దులు
Local Administration = స్థానికపాలన
Minister = మంత్రి
Minute of Dissent = భిన్నాభిప్రాయము
Monarchy = ఏకరాజరికము
Nationalism = జాతీయత
Naturalisation = పౌరుల పెంపకము
No Confidence = అవిశ్వాసము

Oligarchy = పలువురు పెద్దల పీడన
Ordinance = అవసర శాసనము
Organisation = నిర్మాణము
Organs = అంగములు
Paramountcy = ఉన్నతాధికారము
Party = రాజకీయకక్ష పక్షము
People = ప్రజ
Politics = రాజకీయ శాస్త్రము
Polity = ప్రజారాజ్యము
Port = రేవు పట్టణము
President = అధ్యక్షుడు రాష్ట్రపతి
Profession = వృత్తి
Province = రాష్ట్రము
Provincial Autonomy రాష్ట్రీయ స్వాతంత్ర్యము
Quorum = సభలకు అవసరసంఖ్య
Recall = వోటర్లు తమ ప్రతినిధులను పదభ్రష్టులనుజేయు విధానము
Referendum = ఒక ముఖ్యమైన విషయముగూర్చి వోటర్ల అభిప్రాయమును తెలుసుకొనుపద్ధతి
Religion = మతము
Representative Government = ప్రతినిధి ప్రభుత్వము
Republic = శాశ్వత రాజులేని ప్రజారాజ్యము లేక పంచాయతీ
Residuary Powers = శేషాధికారములు
Resolution = తీర్మానము
Responsible Government = బాధ్యతాయుత ప్రభుత్వము
Right = హక్కు
Rigid = సులభముగ మార్పుటకు వీలులేని
Security Council = భద్రతా సంఘము
Self determination = స్వయం నిర్ణయాధికారము
Self Government = స్వపరిపాలన
Society = సంఘము
Sovereign = ఏలిక ప్రభువు
Sovereignty = రాజ్యాధికారము
State = రాజ్యము
Structure = అంగనిర్మాణము
Town = పెద్దవూరు
Trustee = ధర్మకర్త
Tyranny = నిరంకుశత్వము
Unitary Government = ఐక్యరాజ్యము
United Nations = ఐక్య రాజ్య సమితి
Veto = రద్దు
Village = గ్రామము
Vote = వోటు
Wealth = ఐశ్వర్యము

—o—